బిగిసిన వంద కలాల పిడికిళ్ళివి.

గొంతెత్తిన వంద కొడవళ్ళివి.

వలసాంధ్రా ఆధిపత్యం మీద ఎగరేసిన నిరసన జెండాలివి

ఈ పుస్తకం మీ చేతిలో ఒక ఆయుధం..

ఒక్క ఆయుధం కాదు.. వందల ఆయుధాలు..

ఈ ఒక్క పుస్తకమే మీ చేతిలో విచ్చుకున్న వెయ్యి కత్తులు..

పొజిషన్ తీసుకున్న వేలవేల ఎ.కె.47 బందూఖులు..

విసిరిన వేలాది బాంబులు..

రెడీ.. ఫైరర్ !!

# జా గో.. జ గా వో

## తెలంగాణ ఉద్యమ కవిత్వం


ప్రధాన సంపాదకులు

స్కైబాబ

సంపాదకులు

పసునూరి రవీందర్, షాజహానా

గోగు శ్యామల, అన్వర్

వేముగంటి మురళీకృష్ణ

అన్నవరం దేవేందర్



ప్రచురణ

తెలంగాణ కవులు, కళాకారులు

**JAAGO.. JAGAAVO**
Telangana Revolutionaly Poetry
by Telangana Poets & Singers

Editor
Sky Baba
Editorial Board
Pasunoori Ravinder
Shajahana, Gogu Shyamala,
Vemuganti Murali, Annavaram Devender
Anwar



December, 2009

Cover Drawing & Disign
Akbar
Publication
Telangana Poets & Singers
For copies

● Pasunuri Ravindar
406, Gulmohar Park Colony
Sheri Lingampally, Hyderabad - 19
Cell: 99483 19442
E-mail: hcuravinder@gmail.com

● Annavaram Devendar
Flat No.406, Maruti Heavens apts.
Bhagat Nagar, Kareem Nagar-505001
cell: 94407 63479

● SKY Baba
10-1-639, Chintal Basti
Khairathabad, Hyderabad-4
Cell: 9885420027, 94403 22361
E-mail: skybaba@ymail.com

*Printed at:* **Anupama Printers,** Green View
126, Shantinagar, Hyderabad-28
Ph: 23391364

● available at all literary book Centers

Price: **30/-**

తెలంగాణ రాష్ట్ర ఉద్యమంలో
ప్రాణాలిచ్చిన బిడ్డలకు...
కన్నీళ్ళతో... బిగిసిన పిడికిళ్ళతో...



ఏ వరుసా లేదు.. సిర్ఫ్ తెలంగాణ..

## హైదరాబాద్ కవిత్వం



## తెలంగాణ కవిత్వం

# జాగో.. జగావో

## తెలంగాణ కవి గాయక సమ్మేళనం

జాగో (మేలుకో) జగావో (మేల్కొల్పు). నిద్రపోయిన కాడికి చాలు. మోసపోయిన జాడ సాలుతప్పని వారసత్వమైతాంది. గాయపడ్డ పక్షులం తలా పిడికెడు శక్తిని కూడగట్టుకొని మేల్కొందాం. మన చుట్టూ ఉన్న మట్టి బతుకుల్ని మన కైతలు, పాటలతో తట్టి లేపుదాం. కన్రెప్పలు తెరిచుండంగనే శత్రువు మన ఇంటిని, ఒంటిని వేలం పాటకు పెడుతున్నడు. ఫ్రీజోన్ పేరిట తెలంగాణ గుండెకాయను ఆక్రమించే కుట్రకు పాల్పడుతుండ్రు. మనం సోయి లేకుంట, సప్పుడు జేయనంత కాలం వాళ్ల ఆటలు గిట్లనే సాగుతయ్.. వాళ్ల మాటలు గిట్లనే చెల్లుతయ్. మా తెలంగాణ మాగ్గావాలని నడుస్తున్న ఉద్యమానికి మన పెన్నులను గన్నులను చేసినమ్. ఇగ గిప్పుడు పొయ్యిల నిప్పు వడ్డది. పొగ రగులుకుంటున్నది. పట్టనట్టుగా ఉంటే ఎట్లా? మనం కవులుగ, కళాకారులుగా కలాలను గోరుకొయ్యలు జేద్దాం.. చిర్ర కోలలు జేద్దాం.. నిప్పు కణికలు జేద్దాం.. కైతలు, పాటల చేత ఉద్యమం వెన్నంటి ఉన్నామంటూ ఒక్క గొంతుకై నినదిద్దాం. ఇగముందు ఈ గడ్డ మీదున్న ఏ జోన్ గురించి మాట్లాడాలన్నా సల్ల జెముటలు పుట్టాలే.. తెలంగాణ శత్రువుల గుండెలదురాలె.. విద్రోహ దినాన (నవంబర్ 1న) మన నిరసన నింగినంటాలె!

**యే హైద్రాబాద్ హమారా హై**

**హమారా హీ రహేగా !**

జాగో ఔర్ జగావో!!



2009 నవంబర్ 1న తెలంగాణ కవులు, కళాకారులు నిర్వహించిన 'జాగో..జగావో' కవి సమ్మేళనం కరపత్రంలోని వాక్యాలివి. 217 పేర్లతో వేసిన ఆ కరపత్రం బహుశా తెలంగాణ చరిత్రలో రికార్డు. అవాళ పొద్దున్నుంచి రాత్రి దాకా సమ్మేళనం జరిగినా ఎందరికో కవితలు చదివడానికి సమయం సరిపోలేదు. హైదరాబాద్ నాంపల్లి తెలుగు యూనివర్సిటీ ఆడిటోరియంలోని 260కి పైగా సీట్లు నిండిపోగా బైటిదాక కవులు, రచయితలు నిలబడ్డరు. ప్రారంభసభకి స్కైబాబ అధ్యక్షత వహించారు. ప్రొ.జయశంకర్ సభను ప్రారంభించారు. అల్లం నారాయణ, కొమ్రన్న మాట్లాడారు. అందెశ్రీ పాడిన తెలంగాణ జాతీయ గీతం- 'జయజయహే తెలంగాణ' పాటకు అందరూ లేచి కోరస్ ఇచ్చారు. జై తెలంగాణ నినాదాలతో సభా ప్రాంగణం దద్దరిల్లింది. తరువాతి సెషన్‌లకు పసునూరి రవీందర్, గోగు శ్యామల, అన్నవరం దేవేందర్, వేముల ఎల్లయ్య, నాళేశ్వరం శంకరం, షాజహానా అధ్యక్షత వహించారు. ఆ సభలో చదివిన కవితలు, తర్వాత పత్రికలో ప్రకటించి రప్పించుకున్న కవితల సంకలనం ఇది... ప్రయత్న లోపం లేకున్నా ఇంకా ఎందరో ఇందులో మిస్సయ్యారు.. కష్టనష్టాలు సమజై కవిత్వంలోకి వెళతారని...

# జాగో..జగావో ఒక చరిత్ర

బతుకును, భవిష్యత్‌ను కోతకిచ్చిన దినాన కలాలు వెల్లగక్కిన నిరసన అగ్ని పర్వత లావాలివి. నిండా దోపిడి చేసిన కుట్రల మీద తలా పిడికెడు అక్షరాల్ని కురిపించిన సమయమిది. తెలంగాణ గడ్డ మీద ఊటలై పారే పాటలు వలసాధిపత్యం మీద మంటలై మండిన సందర్భమిది. కుతకుతా ఉడుకుతున్న అరవయేండ్ల గోసను చూసి, ఉబికి వచ్చిన వెచ్చటి కన్నీటి ధారలు... ఈ కైతలు, పాటలు! సోయి తప్పినోళ్ళ ముఖాల మీద సల్లుతున్న పోరాట నీటిసుక్కలివి. ఊరు దాటి, వాడ దాటి, పల్లెదాటి కొట్లాట పట్నం చేరింది. బతుకొచ్చిన కొడుకులు బరితెగించిన తీరుకు తెలంగాణ గొంతులొక్కటై గర్జించినయ్...

నీటి పాయలు వేరైనా పరుగొక్కటే, గమనాలెన్నైనా గమ్యం ఒక్కటే... సంఘాలెన్నైనా సంకల్పం ఒక్కటే ! గిట్లా సబ్బండ వర్ణాల, సంఘాల కలాలు, గొంతులు ఒక్కటై నినదించడం ఒక చరిత్ర. చేతులన్ని ఒక్కటై లడాయికి సిద్ధమైనయ్. సోర పోరగాళ్ళు మొదలుకోని తల పండి, చెయ్ తిరిగి వొయ్‌ల మీద వొయ్‌లేసిన పెద్దన్నలు నిండు మనసుతో నవంబర్ 1 నాడు జై తెలంగాణ అని నినదించిండ్రు. హైదరాబాద్ హమారా హై! హమారా హీ రహేగా! అని మొహం మీద గుద్ది చెప్పిన్రు.

అచ్చరాలను ఆయుధాలను చేసి నడుస్తున్న పోరాటంలో దండుకట్టిన గుండెలెన్నో... ఎన్నెన్నో ! అట్లా గిప్పుడు నడుస్తున్న లడాయికి పోరుముగ్గులు పోసి సర్కారు మీద కొట్లాట షురూ చేయించింది... ఈ జాగో.. జగావో కవిగాయక సమ్మేళనం !

అట్లా రూపుదిద్దుకున్న
ఉద్యమ కైతల సంకలనం ఈ జాగో.. జగావో!

**- సంపాదకులు**
డిసెంబర్ 2009

# జయజయహే తెలంగాణ

జయ జయహే తెలంగాణ జననీ జయకేతనం
ముక్కోటి గొంతుకలు ఒక్కటైన చేతనం
తరతరాల చరిత గల తల్లీ నీరాజనం
పది జిల్లల నీ పిల్లలు ప్రణమిల్లిన శుభతరుణం
జై తెలంగాణ జై జై తెలంగాణ
జై తెలంగాణ జైజై తెలంగాణ ॥జయ జయహే॥

'పంపన'కు జన్మనిచ్చి 'బద్దెన'కు పద్యమిచ్చి
భీమకవికి చనుబాల బీజాక్షరమైన తల్లి
'హాలుని' గాథాసప్తశతికి ఆయువులూదిన నేల
బృహత్కథల తెలంగాణ కోటిలింగాల కోన
జై తెలంగాణ జై జై తెలంగాణ
జై తెలంగాణ జైజై తెలంగాణ ॥జయ జయహే॥

ప్రజల భాషలో కావ్య ప్రమాణాలు ప్రకటించిన
తెలుగులో తొలి ప్రజాకవి 'పాలకుర్కి సోమన్న'
రాజ్యాన్నే ధిక్కరించి రాములోరి గుడిని కట్టి
కవిరాజై వెలిగె దిశల 'కంచర్ల గోపన్న'
జై తెలంగాణ జై జై తెలంగాణ
జై తెలంగాణ జైజై తెలంగాణ ॥జయ జయహే॥

కాళిదాస కావ్యాలకు భాష్యాలను రాసినట్టి
'మల్లినాథసూరి' మా మెతుకు సీమ కన్నబిడ్డ
ధూళికట్ట నేలినట్టి బౌద్ధానికి బంధువతడు

‘దిగ్నాగుని’ కన్న నేల ధిక్కారమే జన్మహక్కు
జై తెలంగాణ జై జై తెలంగాణ
జై తెలంగాణ జైజై తెలంగాణ ॥జయ జయహే॥

‘పోతన’దీ పురిటిగడ్డ ‘రుద్రమ’దీ వీరగడ్డ
గండరగండడు ‘కొమరం భీముడే’ నీ బిడ్డ
కాకతీయ కళాప్రభల కాంతిరేఖ రామప్ప
గోలుకొండ నవాబుల గొప్ప వెలిగే చార్మినార్
జై తెలంగాణ జై జై తెలంగాణ
జై తెలంగాణ జైజై తెలంగాణ ॥జయ జయహే॥

రాచకొండ ఏలుబడిగ రంజిల్లిన రేచెర్ల
‘సర్వజ్ఞ సింగభూపాలుని’ బంగరు భూమి
వాణీ నా రాణీ అంటు నినదించిన కవికుల రవి
‘పిల్లలమర్రి పినవీరభద్రుడు’ మాలో రుద్రుడు
జై తెలంగాణ జై జై తెలంగాణ
జై తెలంగాణ జైజై తెలంగాణ ॥జయ జయహే॥

‘సమ్మక్క’లు ‘సారక్క’లు ‘సర్వాయి పాపన్న’లు
సబ్బండావర్ణాల సాహసాలు కొనియాడుతు
ఊరూర పాటలైన ‘మీరసాబు’ వీరగాథ
దండునడిపే పాలమూరు ‘పండుగోల్ల సాయన్న’
జై తెలంగాణ జై జై తెలంగాణ
జై తెలంగాణ జైజై తెలంగాణ ॥జయ జయహే॥

కవిగాయక వైతాళిక కళలా మంజీరాలు
డప్పు డమరుకము డక్కి శారదస్వరనాదాలు



పల్లవుల చిరుజల్లుల ప్రతి ఉల్లము రంజిల్లగా
అనునిత్యం నీ గానం అమ్మ నీవే మా ప్రాణం
జై తెలంగాణ జై జై తెలంగాణ
జై తెలంగాణ జైజై తెలంగాణ ॥జయ జయహే॥

జానపద జనజీవన జావళీలు జాలువార
జాతిని జాగృతపరిచే గీతాల జనజాతర
వేలకొలదిగా వీరులు నేలొరిగిపోతెనేమి
తరుగనిదీ నీ త్యాగం మరువనిదీ శ్రమయాగం
జై తెలంగాణ జై జై తెలంగాణ
జై తెలంగాణ జైజై తెలంగాణ ॥జయ జయహే॥

బడులగుడులతో పల్లెల ఒడలు పులకరించాలి
విరిసే జనవిజ్ఞానం నీ కీర్తిని పెంచాలి
తడబడకుండా జగాన తల ఎత్తుకోని బ్రతుక
ఒక జాతిగా నీ సంతతి ఓయమ్మో వెలగాలి
జై తెలంగాణ జై జై తెలంగాణ
జై తెలంగాణ జైజై తెలంగాణ ॥జయ జయహే॥

గోదావరి కృష్ణమ్మలు తల్లి నిన్ను తడుపంగ
పచ్చని మా నేలల్లో పసిడి సిరులు కురవంగ
సుఖశాంతుల తెలంగాణ సుభిక్షంగా ఉండాలి
ప్రత్యేక రాష్ట్రాన ప్రజలు కలలు పండాలి
జై తెలంగాణ జై జై తెలంగాణ
జై తెలంగాణ జైజై తెలంగాణ ॥జయ జయహే॥

- అందెశ్రీ

# ఇద్దరం విడిపోతే...

ఇద్దరం విడిపోతే భూమి బద్దలైతుందా
ఇండియా పాకిస్థానోలే ఇనుపకంచ పడుతుందా
రావొచ్చు, పోవచ్చు రొయ్యలమ్ముకోవచ్చు
మీరు పద్యం పాడితే మేము వన్సుమోరు కొట్టొచ్చు
మీ విశ్వనాథ శ్రీశ్రీలకు వినమ్రంగ మొక్కొచ్చు
మా దాశరథి కాళోజిని దాచిపెడితే కుట్ర కాదా
పొమ్మంటే పోవేందిర పోర ఓ వలసదొర - 2 ॥ఇద్దరం॥

మీ ఇడ్లీ బండి అడ్డా జాగ మీరే నిలుపుకోవచ్చు
మీ కూకట్‌పల్లి హౌజింగ్‌బోర్డుల మీరే కులుకుతుండొచ్చు
మీ వనస్థలిపురములోన వుండచ్చు పండచ్చు
ఆ అమీర్‌పేట అడ్డాజేసుక అధికారం నెరుపుకోండ్రి
గా సెక్రటేరియటల మాత్రం నీ చక్రం తిప్పుతే గాదు
పొమ్మంటే పోవేందిర పోరా ఓ వలసదొర -2 ॥ఇద్దరం॥

తెలుగుజాతి ఒక్కటని తెగులబడిపోతున్నవ్
అన్నదమ్ములిద్దరుంటే ఆస్తి పంచుకోర చెప్పు
భాష ఒక్కటైతే నన్ను బాధ పెట్టాలనుందా
జాతి ఒక్కటైతే నన్ను గోతిల ఎయ్యాలనుందా
గనులెవ్వరివి ఎక్కువో ధర్మంగా నువ్వే చెప్పు
పోలికలున్నయి గానీ, పొంతన యాడుంది మనకు
మీ అట్టుకు మా జొన్నరొట్టెకు సుట్టారికమెక్కడిది
మీ అట్లతద్దికి మా బతుకమ్మకు బంధుత్వమెక్కడిది
పొమ్మంటే పోవేందిర పోరా ఓ వలసదొర ॥ఇద్దరం॥

మాకు సాలెవాయి ఉన్నదని సంకలెగరేస్తున్నరు
మెట్టకార్తె భూమి ఉందని నెత్తి కొట్టుకొంటున్నరు
కాటను కట్టున్నదని కడుపు నిమురుకుంటున్నరు
విశాఖ ఉక్కు ఉన్నదని విర్రవీగిపోతున్నరు
అన్ని ఉంటె ఉంచుకో మిమ్ము అడిగితె చెప్పుతో కొట్టు
ఏమిలేనోళ్ళ కాడికి ఏం పీక వచ్చిండ్రు
పొమ్మంటే పోవేందిర పోరా ఓ వలసదొర ॥ఇద్దరం॥

గంటె గిన్నెలతో వచ్చి వంటమెసులు మొదలెడితిరి
చీర మూటలతో వచ్చి లారీ ఓనర్లైతిరి
పచ్చడి బ్యారాలు చేసి పత్రిక ఓనర్లైతిరి
పట్నం శివారులన్ని పట్టా చేసుకోవడితిరి
బతుకనీకి వచ్చినోన్ని భాయి భాయిగా సూత్తం
దోచుకొన వచ్చినోడ సూసుకోర నీ తోవ
పొమ్మంటే పోవేందిర పోరా ఓ వలసదొర ॥ఇద్దరం॥

ట్యాంకుబండ కట్టా మీ తాతా కట్టిండా చెప్పు
అందులోన మా పెద్దల ఆదర్శమూర్తులెన్ని
యాడ నల్లరేగడుంటె ఆడనే మీ పాదేస్తిరి
కోచింగు సెంటర్లను కొల్లలుగా తెరిచేస్తిరి
పండ్లతోటలెన్నో పట్టి ఫాం హౌజులూ పెడితిరి
ఊరిలోన అరెకురం భూమున్నదమ్ముకొచ్చి
ఈడికొచ్చి హీరోలై విర్రావీగ వడ్తరి
త్యాగాలు మా చరిత్ర భోగాలు మీ చరిత్ర
విశాలాంధ్ర గిశాలాంధ్ర జాంతనై సమైక్యాంధ్ర'
విషాదాలకు ఇంక స్వస్తి తెలంగాణ కొరకు కుస్తీ - 3

- గోరటి వెంకన్న

# పండు వెన్నెల్లలోన

నన్నారె - నన్నారె - నన్నారె - నన్నారె
నన్నారె నన్నారె నారే...
నారె నన్న నార - నారె నన్నారె నాన నారే...!

పండూ వెన్నెల్లలోన - వెన్నెల్లలోన
పాడేటి పాటలేమాయె?
మన పల్లెటూరిలోన ఆడేటి ఆటలేమాయె...?
బాలనాగమ్మ భక్తశిరియాల హరిశ్చంద్ర
అల్లిరాణి ఆటలు ఏవి?
మన పల్లెటూరి లాడె బాగోతాల జోరేది?

;రాజు : ఎవ్వరే ఈ వనములోనా... ఏర్పరించావే లలనా..? ॥ఎవ్వరే॥
రాణి : ఎవ్వరైతే నేమి సామ్మి - ఏల సరసాలోయ్ రాజా..? ॥ఎవ్వరైతే॥
స్టజి కరెంటు మైకు ఏదీ లేకున్నగాని
తెల్లార్లు ఆడి పాడేది
మన పల్లెగుండెలోన మోగేటి కంచుగొంతులేవి?
భీముండర వొరె ద్వారకా!
పరంధాముండర వొరె ద్వారాకా!
భీముండరిపుజర కారుండ
కౌరవ నామంబు గల నే శూరుండరా - చల్
చిందేస్తూ చిత్రంగ వూరంత తిరిగేటి
చిందోల్ల వేషాలేవి?
మన పల్లె ముద్దుబిడ్డలు పిట్టల దొరలు ఎటుపోయిరి?

జోకర్: తుర్ర్ర్ర్! తుర్, తుర్ర్ర్ర్!
బుర్ర్ర్ర్! బుర్, బుర్ర్ర్ర్!
మేరేనామ్ గిర్కోంటి
ఇదివర్దాక పాయిలపంటి ॥మేరే॥
నాకి పెళ్ళాంకి లేదు. దానికి మొగుడికి లేదు ॥మేరే॥
భార్యాబిడ్డలతోటి ఉగ్రూతలూపుకుంటు
బుర్రకతలెన్నో చెప్పేటోల్లు

మన శారద కాన్ల గుండెల బుర్రల చప్పుడేలేదు.
జోడుగ వంతలు... జోరుగా పాడంగా
తందాన, తందానె, తందానా
ఆదితాళలములు, శబ్దరాగములు-తందానా, తందానె, తందానా!
ఆది తాళముల, శబ్దరాగముల, తాంబూర కత వినుడీ...
తందానా... తందానాదేవనందనానా...తరికిట జమ్ తరితా...!
ఢిముకు, ఢిముకు డోలు దరువు, ఘల్లు ఘల్లు గజ్జెల్ల
ఒగ్గొల్ల కతలెటుబాయె?
మన ఢిల్లెం కల్లెం - చిల్లం, కల్లం అయే
నాయినా... ఓ....! శరణు శరణు మా యమ్మ రాణీ
శాంభవీ రాణీ... శాంభవీ రాణీ... కరుణ జూపు మా యమ్మ దేవీ
గంగాభావాణీ! దేవీ భవానీ!
పోరగాల్లు పెద్దోల్లు ఊరంత గుమ్ముగూడి
దుమ్మురేగ దూల ఆడేది
మన పీర్ల పండుగొస్తె సవార్లు ఎత్తెటోల్లేరి?
ఏమేమి గావాలె సామికి-పెద్దగుట్ట మౌలాలికి
దట్టీలు గావాలె సామికి-మట్కీలు గావాలె సామికి
మట్కీలు గావాలె సామికి-మలీద ముద్దలు సామికి
దులా! దూలా! దూలా! దూలో...!
వాడకట్టు అమ్మలక్కలొక్కతానగూడి
సుట్టు కాముడాడే టోల్లు
మన పల్లెటూరినంత ఉయ్యాలలూపేటోల్లు
ఇద్దరక్క చెల్లెల్ల ఉయ్యాలో-వొక్కూరికిచ్చిరి ఉయ్యాలో
వొక్కూరికిచ్చిరి ఉయ్యాలో-వొక్కింటికిచ్చిరి ఉయ్యాలో
వొక్కింటికిచ్చిరి ఉయ్యాలో-వొక్కనికే ఇచ్చిరి ఉయ్యాలో
వొక్కడే మాయన్న ఉయ్యాలో-వొచ్చన్న పోడాయె ఉయ్యాలో
సక్కని మాయన్న ఉయ్యాలో-సూసన్న పోడాయే ఉయ్యాలో
చిన్నారి చెల్లెండ్లు, చెంగు చెంగు నెగురుకుంట
చెమ్మచెక్కలాటలాడేది-మన వాకిల్లలోన ఆడపిల్లల లొల్లేది?

ఆడేటి ఆటలేదు పాడేటి పాట లేదు
పల్లె సంబరాలె లేవమ్మో
నేడు టీవీలు, సినిమాలు పల్లె కళలను మింగెనమ్మ!

- నిసార్

# తెలంగాణ అమరులు

తెలతెలవారంగా తెలిరేఖలై విచ్చి
తెలంగాణ కోసమై ప్రాణాలు ఒడ్డిన ॥
వీరులారా మీకు జోహార్లు మా బిడ్డలారా మీకు జోహార్లు ॥

తొలి సమరమందునా అంగ్రేజు నెదిరించి
నైజాము నెదురొడ్డి నేల చెర విడిపించి ॥
విజయాలు నిల్పుకొన నెహ్రూతో పోరాడి
వేల ప్రాణాలను పూలవలె ఇచ్చిన
అయ్యలారా మీకు జోహార్లూ అమ్మలారా మీకు జోహార్లూ ॥

ప్రత్యేక తెలగాణ పోరాటమందునా
ఉద్యమాలు నడిపి యువజనుల కదిలించి ॥
కర్ఫ్యూల కనుగప్పి బారికేడ్లూ గట్టి
తూపాకి గుండ్లకూ గువ్వలై కూలినా ॥
విద్యార్థులూ మీకు జోహార్లూ మా బిడ్డలారా మీకు జోహార్లూ ॥

దోపిడీ పీడనలు అణచివేతలు లేని
ప్రజాస్వామ్యంలోన ప్రజలరాజ్యం తేను ॥
తెలగాణ మార్గాన్ని దశదిశల వ్యాపింప
రాజ్యహింసతో పోరి రక్తాలు వొడిపినా ॥
వీరులారా మీకు జోహార్లూ మా అమరులారా మీకు జోహార్లూ ॥

ప్రజాస్వామ్య ప్రత్యేక తెలగాణ తెస్తమని
ఆడిపాడి ప్రజల కూడగట్టిన మిమ్ము ॥
పాలకావర్గాలు పగబట్టి నరికినా
ప్రజల గుండెల్లోన పదిలంగ నిలిచినా ॥
ప్రజాగాయకులారా జోహార్లూ ప్రజల నాయకులారా జోహార్లూ ॥

వీరులారా మీకు జోహార్లూ
మా అమరులారా మీకు జోహార్లూ ॥

**- వరవరరావు**



# ఇంకేమి మిగిలిందిరా

ఇంకేమి మిగిలిందిరా తెలంగాణ
జిల్లేడు మొలిచిందిరా..
ఇంకేమి మిగిలిందిరా తెలంగాణ
పల్లేరు గాసిందిరా..
॥ఇంకేమి॥

వరిచేను కడుపుకే తిండిగింజలు లేక
వలవల ఏడుస్తూ వున్నదీ
పత్తిచేనుకు వంటి మీద బట్టాలేక
సిగ్గుతో తలదించుకున్నదీ
॥ఇంకేమి॥

మొక్కజొన్న సంక బిడ్డనెత్తుకొని
ఊరిడిసి వలసబోతున్నదీ...
॥ఇంకేమి॥

మాదీగోల్ల డప్పు మండేటి కడుపు
దండోర వాయిస్తూ వున్నదీ
కుమ్మరోల్ల కుండ చేతిలో చిప్పయి
గడప గడపకు తిరుగుతున్నదీ..
॥ఇంకేమి॥

ఆవుదూడలకిన్ని పాల సుక్కాలేక
అంబాః అని వర్లుతున్నవీ..
కాళ్లు చేతులు కట్టి కటికోని కిస్తుంటె
పిల్లకేమి బతుకు నిస్తదీ
॥ఇంకేమి॥

పాలు మరువనట్టి పసిగుడ్డులను బట్టి
కన్న తల్లి అమ్ముతున్నదీ
పాలుగారె బుగ్గల్లో పండేటి మొగ్గలు
పండుటాకై రాలుతున్నరూ..
॥ఇంకేమి॥

**- జయరాజు**

# తెలంగాణ లడాయి పాట

వాడెవ్వడు, వీడెవ్వడు తెలంగాణకు అడ్డెవ్వడు
అడ్డమొచ్చె కొడుకులను అడ్డంగా నరుకుతం
పోరు జెండలెత్తుతం
॥వాడెవ్వడు॥

మన నీళ్ళను, మన కొలువుల దిగమింగినోళ్ళను
ఊరొదిలెదాక తరిమి ఉప్పెనై లేస్తం
గుతుప కట్టెలైతం
॥వాడెవ్వడు॥

పట్నం మాదన్నోళ్ళను పాతరెయ్య కదులుతాం
దోచుకు తినె ఆంధ్రోళ్ళ దుమ్మురేగ తన్నుతం
ధూం ధాం ఆడుతం
॥వాడెవ్వడు॥

తెల్లపంచె మోసగాళ్ళు రండగాళ్ళెందరైనా
కదిలె మా పోరులోన ఖతం చెయ్య కదులుతం
గోసులూడ దంచుతం
॥వాడెవ్వడు॥

సాగే పోరాటంలో గోరుకొయ్యలవుదాము
అయిలమ్మా, కొమురయ్య అడుగుజాడలవుదాం
అండదండలిద్దాం
॥వాడెవ్వడు॥

కల్లబొల్లి మాటలతో కాలమెల్ల దీసేటి
దొంగా సర్కారును మెడలు వంచ గెలుద్దాం
వంగబెట్టి తన్నుదాం
॥వాడెవ్వడు॥



ఎనుకటి మన చరిత్రంత ఎర్కజేసుకుందాము
తిరుగబడ్డ తిప్పలేందో మదిల దల్సుకుందాం
మట్టి బిడ్డలైదాం
॥వాడెవ్వడు॥

కలబడదాం నిలబడదాం కడదాక ఎగబడదాం
తెలంగాణ వచ్చేదాక తెగువతోటి నిలుద్దాం
తెగబడగా గెలుద్దాం
॥వాడెవ్వడు॥

ఎంతకాలం ఈ మోసం ఎన్నెండ్లు మన దుఃఖం
అటో, ఇటో తేల్చుకోను, అంతుజూడ కదులుదాం
ఎగబడగా లేద్దాం
॥వాడెవ్వడు॥

త్యాగాల మట్టిలోన మొలకెత్తిన మొక్కలం
బందగి ఒరిగిన నేల నెత్తుటీ ధారలం
పోరుతల్లి బిడ్డలం
॥వాడెవ్వడు॥

రేపటి మన భవిత కొరకు వెలిగె సూర్యులవుదాం
ఆరని జ్యోతుల మంట ఇంటింటా పంచుదాం
పోరు శంఖం ఊదుదాం
॥వాడెవ్వడు॥

కొమరంభీం వారసులం కాళోజీ కన్నులం
బియ్యాల బిడ్డలం బెల్లి లలిత తమ్ముళం
లొల్లిజేయ కదిలినం
॥వాడెవ్వడు॥

**-పసునూరి రవీందర్**

# ఉత్తుత్త మాటలతో వస్తదా..

ఉత్తుత్త మాటలతో వస్తదా తెలంగాణ
ఉరుమోలె ఉరమకుండ వస్తదా తెలంగాణ
మెరుపోలె మెరవకుండ వస్తదా తెలంగాణ
బట్ట మడత నలుగకుండ వస్తదా తెలంగాణ
బడితెలు మట్టెయ్యకుండ వస్తదా తెలంగాణ ॥ఉత్తుత్త॥
నైజాము సర్కారోని రాజ్యమెట్ల కూలిపాయె
ఎంటబడి తరుముకుంటె - రజాకార్లు ఉరికింద్రా
జాగీర్‌దార్ల, దేశముఖ్‌ల - గడీలెట్ల మట్టిగలిసె
మంత్రాలకు చింతకాయలు రాలిన చరిత్రున్నదా
॥ఉత్తుత్త॥
విశాలాంధ్ర పేరు జెప్పి - కలిసిమెలిసి ఉండమంద్రు
ఒప్పందాలు నిబంధనలు తుంగలో తొక్కింద్రు
ఆంధ్రవలసపెత్తనంలో - అసమానత పెరిగిపాయె
తెలంగాణ మన బ్రతుకులు ఆగమాగమయిపోయె ॥ఉత్తుత్త॥
మిల్లులన్ని మూగపడే బ్రతుకులు బజార్లవడే
అన్నానికి కరువాయె ఆత్మహత్యలు పెరిగిపాయె
భూములు బంజెర్లాయె - మస్కట్ దుబాయ్ వలసలాయె
బ్రతుకుదెరువు దారిలేక - పల్లెలు కన్నీరు వెట్టి ॥ఉత్తుత్త॥
గనులున్నా నదులున్నా కరెంటు కరువెందుకొచ్చె
గలగల పారేటి నదుల - నీళ్లెవ్వరి పాలాయె
అడవులల్ల కట్టెవాయె వాగుల్లల్ల ఉస్కెవాయె
బావుల్లల్ల బొగ్గువాయె - గుట్టల్లల్ల రాళ్ళువాయె
సొమ్మొకడిది సోకోడిది అన్న తీరుగా లేదా
॥ఉత్తుత్త॥
ఆరొందల పది జీవో అమలువట్టి నాటకమాయె
తెలంగాణా నౌకర్లన్న ఆంధ్రోల్ల పాలైపోయె
చదువుకున్న పోరగాండ్లకు - దిక్కుదేము లేకుండాయె
కల్లబొల్లీ మాటలు జెప్పి కంట్ల కారం జల్లుతుంద్రు
మిట్టమిట్ట జూత్తావుంటే ఉన్న దూడ్సపోతున్నారు ॥ఉత్తుత్త॥

- సి.హెచ్. రమణాచారి

# దేనికైనా సిద్ధమే

ఉవ్వెత్తున ఎగిసింద ఉద్యమం మల్లి చూడు
విప్లవ చిరు జల్లుల్లు వీధి వీధిలల్ల జాడు
॥ఉవ్వెత్తున॥
రాజ్యాంగపు హక్కులుతో రాచరికం తిక్క కుదిరే
ప్రజాస్వామ్య గర్జనకు భూస్వాముల గుండెలదిరే
మ్రోగుతున్న డప్పులది ఆగదింక చప్పుడూ
వర్ణకులాలకతీతంగా వర్ధమానమిప్పుడూ
॥ఉవ్వెత్తున॥
అమరవీరుల ఆత్మత్యాగం రక్తమై ఉడుకుతుంది
సత్యాగ్రాహమ్మ తోటి పల్లె నడుం బిగుస్తుంది
సాగుతున్న సమ్మెలతో పట్నం నిలబడ్డది
జిల్లజిల్లల జనం నిద్రలేచి తిరగబడ్డది
॥ఉవ్వెత్తున॥
విద్యార్థుల విజ్ఞానపు విద్యుత్తే ఇంధనమై
రైతన్నల కన్నీళ్ళే మండే అగ్గితునకలై
కార్మికుల కష్టాలే కదులుతున్న చక్రాలై
ఉరుకుతుంది బండి మనది ఆపేవాళ్ళింక ఎవరు?
॥ఉవ్వెత్తున॥
తెలంగాణా నినాదాలు నింగిదాకా వినబడాలే
తెలంగాణా జెండాలు జగమంత కనబడాలే
తెలంగాణా వచ్చే దాక దేనికైనా సిద్ధమే
తెలంగాణా వచ్చే దాక దేనికైనా సిద్ధమే
॥ఉవ్వెత్తున॥

- సిద్దార్థ పాములపర్తి

# తేట గట్టిన పాట

తెట్ట తేట తెలంగాణ - తెగింపే తెగింపే
బట్టబయలు ఆంధ్ర కుట్ర - ముగింపే ముగింపే ॥తెట్ట॥

ఆరొందల పది జీవో - ఆ మాట గాడ్పుకే
అదనపు పోస్టుల పేర - అలుముడు బలుసుడు మీరే
దీక్షలకు దెబ్బలకు - మా పిల్లలు బలే
కంపెనీల టాయిలేట్ల - కావలికి మీవోళ్ళే
రూల్సేమో మా మెడకు సుట్టుడాయె
గీల్సులతో మీరు ఖుషి జేసుడాయె ॥తెట్ట॥
గోదావరి కృష్ణమ్మల - బరబరా లాక్కెళ్తిరి
రొయ్యల చేపలు పెంచి - మార్కెట్లను కమ్మేస్తిరి
రామగుండం బొగ్గు బూమిల - అగ్గిశాపం అంటు వెడ్తిరి
బోధన్ షుగర్ ఫ్యాక్టరీ - గుండె సైరన్ ఆపివేస్తిరి
కుట్రలతో కూల్చినారు తెలంగాణని
హిల్స్ లేసి పెరిగినారు హైటెక్కులతో ॥తెట్ట॥
సర్కారు బడులకు - సున్నాలు వెడ్తిరి
ఆంగ్లభాష మోజుకు - గేట్లు దీస్తిరి
కేజీల లెక్కన - ఫీజు జోక్తిరి
అరమార్కు తట్టుకోని - సదువు నేర్పిరి
పేరెంట్సు పిల్లలేమో మనుగుడాయె
నారాయణ చైతన్యలు తేలుడాయె ॥తెట్ట॥
జయంతులు ఉత్సవాలు - శతాబ్దులు మీ కవులకు
పీఠాలు భుజకీర్తులు - సద్గోష్ఠులు మీ మాన్యులకు
రీళ్ళకొద్ది సిన్మాలు సుట్టగ - సత్కలలకు చీడ పట్టె
హింసా అశ్లీలతలను - యువతకు కానుక మిస్తిరి
కాళోజీ గొడవలకు స్థానముండదాయె
కంటిచూపుతో చాపే దర్శక ప్రతిభాయె ॥తెట్ట॥
యాత్ర మీద యాత్రలే - పాదాలకు పాపాలే
రింగురోడ్డు కొండ చిలువ - సుట్టు భూముల సప్పరించె
నాలుగు జిల్లాల ముంచి - గ్రేటర్ గోడలు కడ్తిరి
రియల్ దంద ఫాక్షన్ బొంద - రాష్ట్రాన్ని అడ్డ జేస్తిరి
అరచేతిల ధనరేఖలు చూపుడాయె
చిరునవ్వుతో సిరులన్ని మలుపుడాయె ॥తెట్ట॥
కార్పొరేట్ దవఖాండ్లకు - పచ్చనోట్ల ఆరోగ్యశ్రీ
ఇందిరమ్మ ఇండ్లలోన - అప్పులదయ్యం తిరుగుతుంటది
దోరూపయ్ బియ్యానికి - కందిపప్పు అసలే డిడకది
జలయజ్ఞం సాగుతోంటే - పొలాలన్ని ఆవిరాయె
సుజలాం సుఫలాం సస్యశ్యామలాం
ఏలినోళ్ళ కళ్ళకెపుడు ఆ 'పచ్చ' రోగమే ॥తెట్ట॥
ఫిరీగానె సొచ్చినారు - కిరికిరై కూసున్నరు
సాక్ష్యమెంత రాశిపోసిన - దొంగనిద్ర నటిస్తున్నరు
వలస వచ్చిన జాగమీద - శకుని కృతజ్ఞతలు చూపుతుండ్రు
చాచిన చేతులతోనే - దోచిన ఘనతా మీదే
ఫ్రీజోను హైద్రాబాదు ఎట్లెట్లనొ చెప్పు
నిప్పుల గుండంల నడిచి నిగ్గేదో తేల్చు ॥తెట్ట॥
గోలకొండ కోటనుంచి - కోతుల దండై దుంకుతం
చార్మినారు నలుముకుని - దట్టిలై మండుతం
టాంక్‌బండ్ రోడ్డంతా - శివసత్తుల శివమౌతం
అసెంబ్లీ గేటు ముందు - అమరుల ప్రతిజ్ఞ లౌతం
తెలుగు తల్లి ఫొటోలను సర్దుకోండి
వెలుగు లొచ్చే తెలంగాణకు జర జరగండ్రి ॥తెట్ట॥

- దాసరాజు రామారావు

# నా తల్లి తెలంగాణ

నా తల్లి తెలంగాణ ఉయ్యాలో ఉయ్యాలా
పుల్లడిల్లి పోతుందమ్మ ఉయ్యాలో ఉయ్యాలా
తల్లడిల్లి పోతుందమ్మ తాడో పేడో తేల్చమన్నది

॥నా తల్లి॥

ఈ తొవ్వ పొడుగున ఉయ్యాలో ఉయ్యాలా
రక్తపు మడుగులాయె ఉయ్యాలో ఉయ్యాలా
పుట్లకొద్దీ బలగాలమ్మ ఉయ్యాలో ఉయ్యాలా
పుట్టుకొస్తున్నయమ్మ ఉయ్యాలో ఉయ్యాలా
యుద్ధంతో ఈ నేలంత ఉయ్యాలో ఉయ్యాలా
దద్దరిల్లి పోయిందమ్మ ఉయ్యాలో ఉయ్యాలా
లాఠీలు తూటాలతో ఉయ్యాలో ఉయ్యాలా
రణరంగం జేసిండ్లమ్మ ఉయ్యాలో ఉయ్యాలా
రాపిడ్ ఫోర్సులు దించిండ్లమ్మ - రావణ కాష్టం జేసిండ్లమ్మ

॥నా తల్లి॥

తెలంగాణ అడిగినందుకు ఉయ్యాలో ఉయ్యాలా
నక్సలైట్లన్నరమ్మ ఉయ్యాలో ఉయ్యాలా
అసాంఘిక శక్తులని ఉయ్యాలో ఉయ్యాలా
అన్యాయంగ గొట్టిండ్లమ్మ ఉయ్యాలో ఉయ్యాలా
ఒకన్ని పదిమందేసి ఉయ్యాలో ఉయ్యాలా
బంతాట ఆడిండ్లమ్మ ఉయ్యాలో ఉయ్యాలా
పాములాను సంపినట్లు ఉయ్యాలో ఉయ్యాలా
పండేసి సంపిండ్లమ్మ ఉయ్యాలో ఉయ్యాలా
మేమున్న క్యాంపసంతా ఉయ్యాలో ఉయ్యాలా
పోలీసు క్యాంపులాయె ఉయ్యాలో ఉయ్యాలా
పొద్దున్నేమో ఫైరింగంటండ్లు ఉయ్యాలో ఉయ్యాలా
రాత్రైతే రైడింగంటండ్లు ఉయ్యాలో ఉయ్యాలా

॥నాతల్లి॥

ఆంధ్ర అబ్బాయిలంత ఉయ్యాలో ఉయ్యాలా
డాక్టర్లు యాక్టర్లాయే ఉయ్యాలో ఉయ్యాలా
మా ఊరు పోరగాండ్లు ఉయ్యాలో ఉయ్యాలా
కూలీలు క్లీనర్లాయే ఉయ్యాలో ఉయ్యాలా
సావలేక బతుకులేక ఉయ్యాలో ఉయ్యాలా



పోరురాగ మైయిండ్లమ్మ ఉయ్యాలో ఉయ్యాలా
ఉద్యోగాలు లేక యువత ఉయ్యాలో ఉయ్యాలా
ఉద్యమం బాటబట్టిండ్లు ఉయ్యాలో ఉయ్యాలా
నూనూగు మీసాలు మొలవకముందే
నూరు వసంతాల వీరులైపోతుండ్లు ॥నాతల్లి॥
నలభై ఏండ్ల నుండి తల్లి ఉయ్యాలో ఉయ్యాలా
కొడుకులను పోగొట్టుకుంటుంది ఉయ్యాలో ఉయ్యాలా
కన్నీటి ఊటలన్ని ఉయ్యాలో ఉయ్యాలా
కడుపులోన దాసుకుంటుంది ఉయ్యాలో ఉయ్యాలా
గుండెలోని బాధలన్ని ఉయ్యాలో ఉయ్యాలా
గొంతులోన దాసుకుంటుంది ఉయ్యాలో ఉయ్యాలా
సలుపుతున్న గాయాలను - గేయాలల్లే పాడుతున్నది ॥నాతల్లి॥
బానిస సంకేళ్లు ఉయ్యాలో ఉయ్యాలా
తెంచమంటున్నదమ్మ ఉయ్యాలో ఉయ్యాలా
ఉస్మానియా క్యాంపస్‌లో ఉయ్యాలో ఉయ్యాలా
ఉద్యమం ఊపందుకుంది ఉయ్యాలో ఉయ్యాలా
వీరుల త్యాగాలతో ఉయ్యాలో ఉయ్యాలా
ఉప్పెనై పొంగుతున్నది ఉయ్యాలో ఉయ్యాలా
విద్యార్థులు మేధావులంత ఉయ్యాలో ఉయ్యాలా
ఉస్కబొస్తె రాలకుంటచ్చిండ్లు ఉయ్యాలో ఉయ్యాలా
తెలంగాణ తెచ్చేటందుకు ఉయ్యాలో ఉయ్యాలా
అగ్గి రాజేస్తున్నారే ఉయ్యాలో ఉయ్యాలా
అగ్గి రాజేస్తున్నారమ్మ - బగ్గున మంటయై మండుతున్నరు

॥నాతల్లి॥

కాకతీయ క్యాంపస్‌లో ఉయ్యాలో ఉయ్యాలా
కన్నెర్ర జేస్తున్నారే ఉయ్యాలో ఉయ్యాలా
ఓరుగల్లు పోరునంత ఉయ్యాలో ఉయ్యాలా
ఒంటినిండ పూసుకున్నరే ఉయ్యాలో ఉయ్యాలా
దాసుకున్న మాటలన్ని ఉయ్యాలో ఉయ్యాలా
పోరాట పాటలు జేసి ఉయ్యాలో ఉయ్యాలా
కత్తుల వంతెన మీద ఉయ్యాలో ఉయ్యాలా
కవాతు జేస్తుండ్లమ్మ ఉయ్యాలో ఉయ్యాలా
కవాతు జేస్తుండ్లమ్మా -కత్తులు నూరుతున్నరమ్మా ॥నాతల్లి॥

**- నలిగంటి శరత్**

# జాగో తెలంగాణవాలె - బగావోరె ఆంద్రోఁకు

జాగో తెలంగాణ వాలె - బగావోరె ఆంద్రోఁకు
నీ నోటి కాడి బువ్వ గుంజి నోట్ల మట్టి కొట్టినోన్ని
గుతప కట్టె తీసుకొని పొలిమేర దాటియ్యలేరా ॥జాగో॥

ఇసుంటు రమ్మంటె ఇల్లె నాదన్నోన్ని
తిన్నింటి వాసాలు లెక్కపెట్టిన దొంగ
పొట్ట చేత బట్టుకొని పట్నం బతుకొచ్చినోడు
పట్నమే నాదంటుండు పట్టుకొని దంచుకోరా ॥జాగో॥

ముసాఫూర్‌ల వచ్చి ముద్దుగా కొలు వెక్కిండు
ఆలు పిల్లలతోని హాయిగా బతుకుతుండు
పిల్లల చదివించుకుండు పెండ్లము కొలువెక్కింది
బువ్వ నిండా తిన్నాక బుద్ధిలేని పనిలాగ
హైద్రాబాద్ నాదంటు, ఫ్రీజోన్ జెయ్యమండు ॥జాగో॥

జీ.వోలు డి.వోలు సటుకున తెచ్చుకోను
సెక్రటేరియట్ ఆంద్రులు అడ్డగా జేసుకుండ్రు
డైరెక్టరేట్లూ ఆంద్రుల అబ్బసొత్తు అనుకుండ్రు
చిన్న ఆఫీస్‌లోని సీపర్ కొలువాడె కొట్టె
పెద్ద ఆఫీస్‌లోని ఆఫీసర్ వాని పాలె
కొలువులలో ఆంద్రోళ్ళు మజా జేసుకుంటుంటే
కన్నీళ్లలో తెలంగాణ కుమిలి సచ్చిపోతుంది ॥జాగో॥

పాలమూరులో పుట్టినోడు పాపమేమి జేసిండు
తెలంగాణ బిడ్డల్లా సవతి పిల్లలెందుకయిరి
తాతముత్తాత కూడ కోస్తాంద్రలో పుట్టినోల్లు
బతుకుదెరువు కొచ్చి - కొలువులు దొరికించుకొని
పిల్లల చదివించుకొని - పట్నంలో లోకలై



తెలంగాణ నిరుద్యోగి - నాన్ లోకలంటూంటే
సంకలో ఉన్న పిల్లను గద్దెత్తుకుపోయినట్టు
తెలంగాణ బిడ్డలు లబోదిబో మంటుండ్రు ॥జాగో॥

మద్రాస్‌లున్నోల్లను తమిళులు ఈడ్చి తన్నితే
ఏ దిక్కు జూసినాను దిక్కులేదు ఆంద్రులకు
తెలుగు భాష మనదంటు చిక్కటి వల ఏసిండు
మిగులు బడ్జెట్లలోని ముచ్చటైన రాష్ట్రమని
అందమైన హైద్రాబాద్ ముద్దుగా జూసుకుండ్రు
కుటిల నీతితో వచ్చి మన నాగము జేసిరి ॥జాగో॥

రాష్ట్రాన్ని కలుపనీకీ పెట్టుకున్న షరతులన్నీ
చేసిన బాసలు మరిచిన మోసపు బావతీరుగా
పెద్దమనుషుల మాటకు పెద్దదిక్కు లేకపాయె
ముత్క రూల్సు తీసి ముడ్డికి తుడిసేసిండ్రు
ఫజల్ అలీ కమీషన్ ప్రక్కకు తొక్కేసినారు
610 ని గుండు సున్న జేసినారు
ఒక్కటి మనమని చెప్పి - నెత్తిమీది కెక్కిండ్రు ॥జాగో॥

ప్రాణం అరచేత బట్టి బొగ్గుబాయిలోకి దిగి
తట్టను నెత్తికి గట్టి బొగ్గును బయటికి దీస్తే
మన బొగ్గును తీసుకెళ్లి ప్యాక్టరీలు పెట్టుకుండ్రు
కరెంటు వెలుగులు వానికి గుడ్డి దీపము మనకు ॥జాగో॥

నీల్లను మళ్ళించుకుండ్రు - నిధుల దోపిడి జేసిరి
భూములు గుంజుకొని - కబ్జాలు జేసిండ్రు
కొలువులు బోయినాయి - నిరుద్యోగము మిగిలే
నిత్యము కరువుతోని తెలంగాణ కుములుతోంది
నువ్వు పుట్టిన గడ్డకొరకు - జంగు సైరనూది రారా ॥జాగో॥

- లేబరోడు

# రాజన్న ఓ రాజన్న

ఎనకముందు సూసుడేంది రాజన్న ఓ రాజన్న
ఎత్తుకో తెలంగాణ జెండ రాజన్న ఓ రాజన్న
మాయదారి కాంగిరెస్సు రాజన్న ఓ రాజన్న
మాటదప్పి మోసగించె రాజన్న ఓ రాజన్న
ఆడితప్పిన కాంగ్రేసును రాజన్న ఓ రాజన్న
ఓడించి తీరుదాము రాజన్న ఓ రాజన్న
రాజన్న మా రాజన్న మా ఎముడాల రాజన్న
సిరసిల్ల రాజన్న మా కోరుట్ల రాజన్న మా మెట్టు పల్లి రాజన్న చల్..
పుడితె ఒకటి, సస్తె రెండు రాజన్న ఓ రాజన్న
ఎత్తుకొ తెలంగాణ జెండ రాజన్న ఓ రాజన్న
గజ్జెలు గజ్జాలు రెండు గజ్జెలో రాజన్న
చేను ఎండె చెల్క ఎండె గజ్జెలో రాజన్న
గొడ్డు గోద కోతకాయె గజ్జెలో రాజన్న
దూల వాగు నీళ్లు వాయె గజ్జెలో రాజన్న
మోట వాయె ఊట వాయె గజ్జెలో రాజన్న
బతుకు బాయె మెతుకు బాయె గజ్జెలో రాజన్న
వలసవోయి బతుకుడాయె గజ్జెలో రాజన్న
ఈ ఆంధ్ర వలస పాలనలోన రాజన్న ఓ రాజన్న
మన తెలంగాణ ఆగమాయె రాజన్న ఓ రాజన్న
రాజన్న ఓ రాజన్న మా జగిత్యాల రాజన్న
మా బుద్దారం రాజన్న  మా ధర్మపురి రాజన్న
మా మేడిపల్లి రాజన్న భల్.... ॥పుడితె॥
గజ్జెలు గజ్జాలు రెండు గజ్జెలో రాజన్న యాస బాయె బాష బాయె గజ్జెలో రాజన్న
పండుగ పబ్బాలు బాయే గజ్జెలో రాజన్న
సింగరేణి సిరులు బాయే గజ్జెలో రాజన్న
రామగుండమెలుగు బాయే గజ్జెలో రాజన్న
సదువుకున్న కొలువులేదు గజ్జెలో రాజన్న
ప్రమోషన్‌లు మనకియ్యరు గజ్జెలో రాజన్న
నీళ్ళు దోచి, నిధుల దోచి రాజన్న ఓ రాజన్న
వాడు నిండముంచి రాజ్యమేలే రాజన్న ఓ రాజన్న
రాజన్న ఓ రాజన్న మా చొప్పదండి రాజన్న
మా కొడిమాల రాజన్న మా మాల్యల రాజన్న
మా పెగడపల్లి రాజన్న ॥పుడితె॥



గజ్జెలు గజ్జాలు రెండు గజ్జెలో రాజన్న
గజ్జెలు గజ్జాలు రెండు గజ్జెలో రాజన్న
నమిలికొండ కొండ మీద  గజ్జెలో రాజన్న
నెమలి నాట్యమాడినట్లు గజ్జెలో రాజన్న
ఎగిరెను తెలంగాణ జెండా గజ్జెలో రాజన్న
ఎలిగందుల ఖిల్ల గూడ గజ్జెలో రాజన్న
ఎలిగెత్తెను తెలంగాణ గజ్జెలో రాజన్న
తెలంగాణ ముందుబాట రాజన్న మా రాజన్న
కరీంనగరోల్లమే చూపాలే రాజన్న మా రాజన్న
రాజన్న మా రాజన్న మా గంగాధర రాజన్న
మా చందుర్తి రాజన్న మా సారంగపూరు రాజన్న
మా మేడిపల్లి రాజన్న చల్... ॥పుడితె॥
గజ్జెలు గజ్జాలు రెండు గజ్జెలో రాజన్న
గజ్జెలు గజ్జాలు రెండు గజ్జెలో రాజన్న
ఆంధ్రవాళ్ళ మోసాలు గజ్జెలో రాజన్న
అన్ని తెలిసిపాయే మనకు గజ్జెలో రాజన్న
కత్తి ఆంధ్ర వాడిస్తడు గజ్జెలో రాజన్న
పొడిసెటోడు మనోడేర గజ్జెలో రాజన్న
ఈ ఇంటిదొంగలా పంతం గజ్జెలో రాజన్న
పట్టాలే మనమంతా గజ్జెలో రాజన్న
ఎలక్షన్ల సంచులొచ్చు రాజన్న ఓ రాజన్న
మన కంచంలా మెతుకులేదు రాజన్న ఓ రాజన్న
రాజన్న ఓ రాజన్న మా పెగడపెల్లి
రాజన్న మా కోనరావుపేట రాజన్న
మా ఇల్లంతకుంట రాజన్న మా ఇబ్రహీపట్నం రాజన్న ॥పుడితె॥
గజ్జెలు గజ్జాలు రెండు గజ్జెలో రాజన్న గజ్జెలు గజ్జాలు రెండు గజ్జెలో రాజన్న
ఊరువాడ తిరిగి నువ్వు గజ్జెలో రాజన్న ఉడుం పట్టు పట్టునువ్వు గజ్జెలో రాజన్న
ఊరువాడ తిరిగి నువ్వు గజ్జెలో రాజన్న ఉడుం పట్టు పట్టునువ్వు గజ్జెలో రాజన్న
జైకొట్టు జైకొట్టు రాజన్న ఓ రాజన్న
తెలంగాణ రాకపోతే ఒట్టు రాజన్న
రాజన్న మా రాజన్న ఎముడాల రాజన్న
సిరసిల్ల రాజన్న మా కోరుట్ల రాజన్న
మా జగిత్యాల రాజన్న చల్ ॥పుడితె॥

- గూడ అంజయ్య

# తెలంగాణకై తెగువతొ లెండి

ఆశన్న ఊషెన్న
ఆశన్న ఊషెన్నలాలా
తెలంగాణకై తెగువతొ లెండి
ఆశన్న ఊషెన్న లాలా ॥ఆశన్న॥

కాలీ అందెల కణక డప్పుతో
దుమ్ము లేపుతూ ధూం లాడుదాం
కిన్నెర మోతలు కేకలు పెడుతూ
తీన్‌మార్ దెబ్బయీ దద్దరిల్లగా

ఆళ్ళెం బళ్ళెం ఓగ్గొడోలుతో
ఆశన్నా ఉశన్నలారా
చెంద్ర కొలలై ఛెళ్ళున మోగరా
ఆశన్నా ఉశన్నలారా ॥ఆశ॥

తద్దింమ్ దిన్‌కని మద్దెల మోతతో
యక్షగానముల సిందులాడుదాం
కొల చిర్రలు గాలీలో ఆడగా
జాన పదాల ఝూజరాడుదాం

మోదుగుపూలను ముద్దు పెట్టుకొని
ఆశన్నా...ఊశన్నలాలా
పోరు హోలీల పోరాడుదాం
ఆశన్నా ఊశన్నలాల
॥ఆశ॥

పెద్దమనుషుల ఒప్పందమేదని
బొడ్డురాయికి వీర తిలకం దిద్దుర
బోనాలెత్తిన మహిళ దండుతో
పోతురాజు పొలికేకలు బెట్టు

ఉయ్యాల చప్పట్ల పాటతో
ఆశన్నా.... ఊశన్నాలాలా
బతుకు పోర బతకమ్మలాడుదాం
ఆశన్నా... ఊశన్నలాలా
॥ఆశ॥

సింగరేణి ఆ ఎన్‌టిపిసిలో
సైరన్ మోతై సైసై మనగా
బీడి ఆకు మొనా దేలిన బాకై
వలస పిట్ట వడిశాల రాయినై

ధర్మయుద్ధమును గుర్తు చేసుకొనే
ఆశన్నా...ఊశన్నాలాలా
పోరు దసర జాతర్ల కెల్దాము
ఆశన్నా...ఊశన్నలాలా
॥ఆశ॥

రాజుల కోటలు బీటలు వార్చినా
సమ్మక్కలకు సలామ్ చేద్దాం
గొల్ల సుద్దల గొంగడి కర్రతో
బలిగుడి కూతై ఛెంగున దూకర
॥ఆశ॥

కలబడి నిలబడి తెగబడకుంటె
ఆశన్నా... ఊశన్నలాలా
ఎన్నేండ్లయినా బ్రతుకులింతేరా
ఆశన్నా...ఊశన్నలాలా
॥ఆశ॥

**- యశ్‌పాల్**

(ప్రత్యేక తెలంగాణ పోరాటంలో తమ ప్రాణాలను
తృణప్రాయంగా అర్పించిన అమరులకు ఈపాట అంకితం)

# నాగేటి సాల్లల్ల నా తెలంగాణా

నాగేటి సాల్లల్ల నా తెలంగాణా నా తెలంగాణా
నవ్వేటి బతుకుల్ల నా తెలంగాణా నా తెలంగాణా

పారేటి నీల్లల్ల పానాదులల్ల
పూసేటి పూవుల్ల పూనాసలల్లా ॥పారేటి॥
కొంగు సాపిననేల నాతెలంగాణా, నాతెలంగాణా
పాలుతాపిన తల్లి నాతెలంగాణా, తెలంగాణా
॥నాగేటి సాల్లల్ల॥
తంగేడు పువ్వుల్ల తంబాలమంతా, తీరొక్క రంగుల్ల తీరిచ్చినా పువ్వు ॥
తీరొక్క రంగుల్ల తీరిచ్చినా పువ్వు, బంగారు చీరలు బాజారులన్ని ॥
బతుకమ్మ పండుగ నా తెలంగాణా, నాతెలంగాణా
బంతిపూల తోట నాతెలంగాణా, నాతెలంగాణా
॥నాగేటి సాల్లల్ల॥
వరద గూడు కడితె వానొచ్చునంటా, బురద పొలము దున్ని
మురిసున్నరంతా
శివుని గుల్లే నల్లచీమలకు శెక్కరి,
వానకొరకు భజన జడకొప్పులేసి
వాగుల్ల వంకల్ల నా తెలంగాణా, నా తెలంగాణా
సూపు రాలిన కండ్లు నాతెలంగాణా, నాతెలంగాణా
॥నాగేటి సాల్లల్ల॥
కొత్తబట్టలు కట్టి కోటి ముచ్చట్లు, పాలపిట్టల జూసి పడుసుసప్పట్లు
॥పాల॥
పాలపిట్టల జూసి పడుసుసప్పట్లు, జొన్నకర్రల జండ జోరున్నదేమి ॥
అలైబలై తీసి నా తెలంగాణా నా తెలంగాణా
జమ్మి పంచిన ఆర్తి నా తెలంగాణా నా తెలంగాణా
॥నాగేటి సాల్లల్ల॥
మోటగట్టే రాత్రి మోగిన పాట, తాడుబేనిన తండ్రి తలుపులున్నప్పు
॥తాడబేనిన తండ్రి తలపులున్నప్పు,



కల్ల ముడిసిన అవ్వ కలలోని గింజా ॥
ఆరుగాలం చెమట నాతెలంగాణా, నాతెలంగాణా
ఆకలి దప్పుల మంట నాతెలంగాణా, నాతెలంగాణా
॥నాగేటి సాల్లల్ల॥
ఊరుగాచే తల్లి ఉరిమి సూడంగా, బువ్వలేని తల్లి బోనమొండిందీ ॥
బువ్వలేని తల్లి బోనమొండిందీ, సేనుకొచ్చిన పురుగు సెరిగిపోసిందా ॥
బోనాల పండుగ నా తెలంగానా, నా తెలంగాణా
కాట్రావుల ఆట నా తెలంగాణా, నా తెలంగాణా
॥నాగేటి సాల్లల్ల॥
దట్టి గట్టిన రోజు డప్పు సప్పుల్లు, పీరీల గుండంల పిలగాండ్ల ఆట ॥
పీరీల గుండంల పిలగాండ్ల ఆట, కుడుక పేర్ల మొక్కు కూలిబత్కులు ॥
ఆల్లువాడిన పాట నా తెలంగాణా, నా తెలంగాణా
ఆత్మగల్లా చెయ్యి నా తెలంగాణా, నా తెలంగాణా
॥నాగేటి సాల్లల్ల॥
కలిసేటి సేతుల్ల కన్నీటి పాట, సిందోల్లసిందుల్ల సిగురించే నాట్యం
సిందోల్లసిందుల్ల సిగురించే నాట్యం, ఒగ్గు మద్దెల డప్పు వాద్య సంగీతం
కళలకే పుట్టుక నాతెలంగాణా, నాతెలంగాణా
పాటగాచిన పట్టు నాతెలంగాణా, నాతెలంగాణా
॥నాగేటిసాల్లల్ల॥
తాడుబేనిన బతుకు తండ్లాట సూడు, మంటలేని కొలిమి బతుకుల్ల మంట
మంటలేని కొలిమి బతుకుల్ల మంట, నీళ్ళులేని చెరువు నిను జూసి నవ్వే
బతికి సెడ్డాబిడ్డ నా తెలంగాణా, నా తెలంగాణా
తల్లడిల్లే తల్లి నా తెలంగాణా, నా తెలంగాణా
॥నాగేటి సాల్లల్ల॥
బురుజుగోడల పొగరు మెడలు వంచంగా, పుట్లల్ల సెట్లల్ల గోగుపువ్వుల్లా
సద్దిమోసిన తల్లీ సావుబతకులు, పానమిచ్చిన వీరకథలు పాడంగా
గోరుకొయ్యల పొద్దు నా తెలంగాణా, నా తెలంగాణా
గోరింకలా సభలు నా తెలంగాణా, నా తెలంగాణా
॥నాగేటి సాల్లల్ల॥

**- నందిని సిధారెడ్డి**

## తెలంగాణ సోదరా

తెలంగాణ సోదరా... గళమెత్తి పాటపాడరా...
జరిగిన అన్యాయమును జగమెల్ల చాటిచెప్పరా
॥తెలంగాణ॥

వలస బాట పట్టి మనము ఆగమయ్యి చస్తు ఉంటే
ఆదుకుంటామంటు చెప్పి యాది మరిచి నిదురపోయిరి
ఫ్రీజోను పేరు చెప్పి కొలువులన్ని కొల్లగొడితే
గల్లిగల్లిన లొల్లి చేసి ఎల్లగొడ్దాం ఎదురు తిరిగితే
॥తెలంగాణ॥

కృష్ణ గోదావరులు వనరులు ఎన్ని ఉన్ననేమిరా
దొంగలొచ్చి దోచుకున్నా చందమాయెను బతుకురా
మేలిమైన బొగ్గు గనులు మెండుగ మన కుండెరా
ఎక్కడెక్కడో మోసుకెళ్లి మోసగించిరి చూడరా
॥తెలంగాణ॥

సాగు తాగు నీళ్లు లేక తల్లడిల్లి చస్తు ఉంటే
ఆనకట్టలు కడతమంటూ అసలు కెసరు పెట్టినారు
కళ్లబొల్లి మాటలాడి కట్టుకథలను మనకు చెప్పి
నిధులను మళ్ళించి వారు పదిల పర్చుకుంద్రు చూడు
॥తెలంగాణ॥

- ఎ. మోహన్‌రాజ్



## దండు

తల్లి తెలంగాణ తల్లడిల్లిందో
తల్లడిల్లిన తల్లి గోడు వినరండో
చెరను యిడిపించాలె దండు కట్టండో
దండులో పానాలు యెదురొడ్డ రండో
తల్లి తెలంగాణ వొడిల తలవాల్చి
అమ్మ తెలంగాణ కండ్లు తుడవండో
చెరను యిడిపించాలె దండు కట్టండో
దండులో పానాలు యెదురొడ్డ రండో
తల్లి తెలంగాణ తల్లడిల్లిందో
తల్లడిల్లిన తల్లి గోడు వినరండో

కట్టుబొట్టు నీకు రాదన్నడాని
కన్నీట మున్నీట కుమిలిపోయిందో
వొంపుసొంపులు హొయలు లేవన్నడాని
కలతసెందిన తనివి రగిలిపోయిందో
మోటసిమ్ముల కింద పిట్టగూల్లల్ల
సనసన్న పోగుల్ల కలనేత నీది
సీతకోకసిలుక పైటసింగుల్ల
రంగుల్లు పొంగుల్లు పూతల్లు నీవి
తల్లి తెలంగాణ కండ్లు తుడవండో ॥చెరను॥

బాస రాదని వాడు యెక్కిరించిండాని
యెక్కియెక్కి యేడ్చి సొలసిందో
యాస రోతని వాడు యీసడించిండాని
గుక్కపట్టిన మాట మూగవోయిందో
పూరిగుడిసెల్లల్ల పూరపిసికెల లొల్లి
సిగురు కొమ్మల్లల్ల రింగన్న మోత
సీటారు కొమ్మల్ల సిలకమ్మ మాట
యీలపాటలు రేలపాటల్లు నీవి
తల్లి తెలంగాణ వొడిల తలవాల్చి
అమ్మ తెలంగాణ వొడిల తలవాల్చి ॥చెరను॥

ఆంబోతు రామన్న బుస్సుమన్నాడో
బుస్సుమని రంకెల్ల కొమ్ము జులిపిండో
జులిపిన కొమ్ముల్ల కాలు దువ్విండో
దువ్విన కాల్లల్ల దుమ్ము రేగిందో
తల్లి తెలంగాణ వొడిల తలవాల్చి
అమ్మ తెలంగాణ కండ్లు తుడవండో ॥చెరను॥

కందిరీగల బారు తరుముకొస్తుందో
గోండ్రుకప్పల చెరియ గొంతు కలిపిందో
సాలెగూడుల ఉచ్చు సిక్కులౌదామా
ఉరుముల్ల మెరుపుల్ల పిడుగులౌదామా
దుస్సేరు తీగల్ల సిక్కమౌదామా
మర్రివూడల సెంద్రకోలలౌదామా
పోతరాజుని వుగ్ర రూపమౌదామా
మైసమ్మ కండ్లల్ల నెత్తురౌదామా
పూన్కమొచ్చిన యాప మండలౌదామా
యీరునేషపు వొంటి పసుపులౌదామా
తల్లి తెలంగాణ వొడిల తలవాల్చి
అమ్మ తెలంగాణ వొడిల తలవాల్చి ॥చెరను॥

బాలింత పొత్తిల్ల పొద్దు పొడవాలె
పురిటి నొప్పుల్ల తల్లి ఊరడిల్లాలె
గజ్జె కట్టిన పాట సిందులెయ్యాలె
తనువునిచ్చిన తల్లి రుణము తీరాలె
తల్లి తెలంగాణ వొడిల తలవాల్చి
అమ్మ తెలంగాణ కండ్లు తుడవండో
చెరను యిడిపించాలె దండు కట్టండో
దండులో పానాలు యెదురొడ్డ రండో
తల్లి తెలంగాణ తల్లడిల్లిందో
తల్లడిల్లిన తల్లి గోడు వినరండో

**- భైరెడ్డి కృష్ణారెడ్డి**



# సమైక్యాంధ్ర పాలన ఇంక మాకొద్దురా

ఎయ్ ఎయ్ ఎయ్ ఎయ్ ఎయ్ దెబ్బ
డప్పు మీద ఎయ్ ఎయ్ ఎయ్ ఎయ్ ఎయ్
జై జై జై జై జై తెలంగాణ
జై జై తెలంగాణ జై తెలంగాణ జై జై తెలంగాణ జై జై తెలంగాణ

నీళ్ళను దోచేసిన - బీళ్ళు మిగిలించిన
భూములు మింగేసిన - బువ్వను కాజేసిన
కొలువులు కొట్టేసిన - నిలువున ముంచేసిన
సమైక్యాంధ్ర పాలన - చావమనే పాలన
మనకింక వొద్దనీ - చాలునింక పొమ్మనీ
దిక్కులదరగొట్టుతూ - ఒక్కటయ్యి చెప్పుదాం ॥ఎయ్॥
ఒప్పందాల మీదనే - తుప్పున ఉమ్మేసిన
మన సంపదనంతటినీ - మట్టగ దోచేసినా
కడుపులోన ఇసము దాచి - కౌగిలించి చంపిన
కలిసుందామంటునే - కష్టాలే పెట్టిన
బలుపుతొ మాట్లాడుతూ - బాధలెన్నొ పెట్టిన
పాలన మాకొద్దనీ - పట్టుబట్టి చెప్పుదాం ॥ఎయ్॥
భాషనీసడించిన - బతుకు నెక్కిరించిన
వేశాలే మార్చి మార్చి - మోసాలే చేసిన
కనిపించని చిచ్చుపెట్టి - కాల్చి మమ్ము చంపిన
ప్రగతి ఐక్యతనే పేర - పాడు పాడు చేసిన
జాతి బంధువనుకుంటు - నీతిమాలి దోచినా
సోపతి మాకొద్దనీ - ఒక్కటయ్యి చెప్పుదాం ॥ఎయ్॥
ఇంటి దొంగలార మీరు - ఇంక సర్దుకొండిరా
ఎన్నెముకను అమ్ముకునే - బానిస బతుకొద్దురా
సమత స్వేచ్ఛ న్యాయబద్ధ - జీవితాల కోసమూ
బాధలెన్నో గల్గినా - భయపడక సాగుతాం
బంగారు తెలంగాణ - బతుకమ్మను నిల్పుతాం
దిక్కులన్ని వినేటట్టు - ఒక్కటయ్యి చెప్పుదాం ॥ఎయ్॥

**- హారతి వాగీశన్**

# జోహార్ శ్రీకాంతన్నా !

జోహార్ శ్రీకాంతన్నా!
తెలంగాణ నేలపై జన్మించిన ఓపులి బిడ్డ
ఆఖరి జంగ్‌లో అమ్మకోసం బలిదానం చేసి
నింగి కెగసి ప్రకాశించే తారావయ్యావా! ॥జోహార్॥
అగ్నికి ఆహుతి అవుతూ జంకు బొంకు లేకుండా
తెలంగాణ కోసమని తెగువ జూపి
అమర వీరుడవయ్యావా! ॥జోహార్॥
నాల్గు కోట్ల గంజి బతుకుల ఆకాంక్ష సాకారానికి
బలిపీఠమెక్కి కన్న వాళ్ళని త్యాగమయులను చేశావా! ॥జోహార్॥
కాలిన శరీరంతో మైకుల ముందు
జైతెలంగాణ అని చెప్పిన ధీరుడవయ్యావా! ॥జోహార్॥
తెలంగాణ అమరవీరుల చరిత్ర పుటల్లోకెక్కి
మాకు కన్నీళ్ళే మిగిల్చి వెళ్ళావా! ॥జోహార్॥
తెలంగాణ లడాయికి ఊపిరిలూదె
"ఉస్మానియా" సిపాయిలకు
శక్తినిచ్చే యుక్తిడివయ్యావా!
తెలంగాణ తల్లి విముక్తికి బలి దానుడవయ్యావా! ॥జోహార్॥
నీత్యాగం మేం మరవం జన్మాంతం
నీవు లేని ఈప్రపంచం మాకు ఏకాంతం
నీరూపం భావి తెలంగాణకు ప్రతిరూపం!
అన్నా..! నిన్ను కన్న అవ్వ,అయ్యాకు
అర్పిస్తున్నాం శిరస్సు వంచి పాదాభివందనం! ॥జోహార్॥
స్వర్గంలో వీరునివై! నింగిలో మెరిసే తారవై!
మాపోరులో శక్తివై! మా అడుగుల్లో అడుగువై!
నీజ్ఞాపకమె మాకు ఊపిరవయ్యావా! ॥జోహార్॥
గమ్యం చేరే వరకు ఆపం మన పోరు
ఉప్పెనలా లేస్తున్న తెలంగాణలోని ఊరు ఊరు
అందుకో మేము అర్పిస్తున్న శోకతప్త అశ్రు నివాళి! ॥జోహార్॥
అమరహై శ్రీకాంతన్నా!
జై తెలంగాణ! జై జై తెలంగాణ!!

**- ముస్కురాము**

(అమరవీరుడు కాసోజు శ్రీకాంత్ కోసం)



హైద్రాబాద్ హమారా హై
హమారా హీ రహేగా !

జాగో..జగావో

# మేరా హైదరాబాద్

నా ఆత్మ ఈ షహర్ చుట్టూ
పిట్టలా గిరికీలు కొడుతుంది
అనుభూతుల్ని ఏరుతుంటుంది
పుల్లా పుల్లా నెలనెలా కట్టి
గూడులో నిశ్చింతగా నిద్రపోతుంది
ఏం పోగొట్టుకుని ఇక్కడికి వచ్చినా
ఏదో ఒకటి దొరికిస్తుందీ అమ్మ !

ఈ షహర్ ఒక షాయర్
రాత్రిని పాన్‌బీడా చేసి
తెల్లవార్లు ఎర్రని ముషాయిరాల్ని పండిస్తుంది
నక్షత్రాల దుపట్టా కప్పుకున్న ఈ షహర్
దుల్హన్‌లా ముస్తాబవుతుంది
మొజాం జాహి బజారు పూలజడై
పేర్చిన పండ్లన్నీ నాగరమై
ప్రతిరోజూ గుబాళిస్తుందీ నగరం
ఇరానీ చాయ్ కమ్మదనపు రుచి
ఇరు మతాల దోస్తానాను గుర్తు చేస్తుంది
హైదరాబాదీ బిర్యానీ ఘుమఘుమల ధూమాలు
భూమి చుట్టూ సాంబ్రాణీ పొగలై అలుముకుంటాయి
రాత్రి కూడా పగలై విచ్చుకునే
రాత్రీ పగలూ తేడా లేని కష్టజీవి ఈ నగరం

ఈ చార్‌సౌ సాల్ షహర్ బిడ్డలు
సంపాయించడానికే బతకడం లేదు
ముల్లెలు దాచుకోవడానికే జీవించడం లేదు
భూమిని చాపలా చుట్టి చంక కింద పెట్టుకునే
రియల్ ఎస్టేట్ వ్యాపారులు కాదు వాళ్లు
నగర జీవనానికి నాడీ వాళ్లు
షహర్ వాళ్లకు అమ్మ
నగరానికి నిజమైన వారసులు వాళ్లు

ఆ కళకళలాడిన నా హైదరాబాద్ ఏదీ?
ఆ సంస్కృతిని నాగరికతను ధ్వంసం చేస్తున్నదెవరు?
ఆక్రమణ చేసిందెవరు?
ఆశల్ని భుజాల మీదేసుకొని వలసొచ్చిందెవరు?
ఉన్న నాలుగు పచ్చని తలల్ని తెగ నరికి
బిల్డింగులు కట్టిందెవరు?
రోడ్లని వాహనాల ప్రవాహం చేస్తూ
కాలుష్యమని గగ్గోలెత్తడమేంటి?
మీ పచ్చదనాల్ని నదీమ తల్లుల్నీ
కావ్యగానం చేస్తూ కాపాడుకుంటూనే
బతుకిచ్చిన నగరాన్ని కులట అంటారా?!
పరిశ్రమలంటూ సెజ్‌లంటూ తల్లినే తార్చాలని
చూస్తున్నది మీరే కదా
మా కంచం ముందు మెతుకు మెతుక్కి
మేకులు కొడుతున్నది మీలాంటి వాళ్లే కదా
మిమ్మల్ని పెంచి పోషిస్తున్నందుకే కదా
మీరు అంతంత మాటలంటున్నదీ..
బిడ్డల్ని సాదడానికి ఏ పేరును మోసినా సరే
ఆమె మాకు అమ్మే!

కడుపు చేతుల పట్టుకొస్తే కన్నీరు పెట్టిన నగరం
మీకింత చోటిచ్చింది
ఆకలి తీర్చి అమ్మయ్యింది
గిరి గీసుకొని లేదు పొమ్మని మీ మొఖాన
తలుపెయ్యలేదు చూడూ..
అలాంటి అమ్మను 'లంజ' అంటారా?
మీలాంటి లక్షల కృతఘ్నుల్ని
ఒడిలో మోస్తున్న నా హైదరాబాద్
అల్లావుద్దీన్ చేతిలో ఎన్నటికీ ఆరని అద్భుత దీపం
మేరా హైదరాబాద్ !
తుఝే సౌ బార్ సలాం !!

-షాజహానా



# ప్రేమ నగరం హైదరాబాద్

దేకో దేకో భాయి - మేర హైదరబాద్ రోయి
జెర దేకో సునో భాయి - తుమ్ హైదరబాద్ రోయి
బాగమతి పేరున కట్టిన భాగ్యనగరము
॥దేకొ॥
ప్రేమికుల గలుపనీకే - వాలెంటైన్సు ప్రాణమిచ్చె
షాజహాను ప్రేమ కొరకు - తాజ్‌మహల్ బంగ్ల గట్టె
దునియాలొ లేనే లేదు - ప్రేమ కొరకు గట్టిన నగరం
॥దేకొ॥
కాకతీయ శాతవాహన - మొగలాయి చాళుక్యులు
రాష్ట్ర కూటుల వంశాజులు - నిజాము నవాబులు
సర్వాయి పాపన్నాలు - కుతుబ్‌షాహీ లేలిన నగరం
॥దేకొ॥
కాకతీయ గణపతి - జలదుర్గం కట్టినా
వజ్రాలు రాసులు వోసి - అమ్మినా గోలుకొండ
నేడు శిథిలమయిపోయే - దాని రూపు రేఖలు వాయే
॥దేకొ॥
మీర్ ఉస్మాను ఖాను - కట్టించిన టాంక్‌బండు
పచ్చి జీవరాసికి కొలను - ప్రజలాకు జీవ బలము
ఉస్సేన్ సాగర్ చెరువు - నేడు కుల్లిపోయిన శవము
జెర రోకో రోకో భాయి - నాలుగొందాల ఏండ్ల దోయి
ప్లేగ్ వ్యాధితో సచ్చినోల్లకు - చార్‌మినార్ చిహ్నమోయి
ప్రేమ పెండ్లీలు పేల్యారైతే - సావనికే తావై పోయే
॥దేకొ॥
తల్లి పాల తీరుగ నీళ్లు - పొంగి పొర్లిన మూసి జాడు
దూపైతే గొంతు దడిపి - సేద దీర్చిన అమ్మ తీరు
మురికినీళ్ళతో పెంటాకుప్పగా - కంపుగొట్టి కన్నీరెట్టే
॥దేకొ॥

సంపంగి పూలవాసన - గతమంతా పట్టనమోయి
కారు మబ్బులు గమ్మినట్టు - కాలుష్యపు పొగలు జిమ్మి
కాటి తీరుగ నగరం - కొంరాసన గొడ్తుందోయి
॥దేకొ॥

ఉద్యమాల పోరుగడ్డ - ఉస్మానియా క్యాంపస్ బిడ్డ
మూడువందల అరవైమంది - తెలంగాణకు ప్రాణమిస్తే
ప్రత్యేక రాష్ట్రంగాలే - నిరుద్యోగుల అడ్డాయే
॥దేకొ॥

నంగార మోగిన కొండలు - నాట్య మాడెను పూలజింగల్
నాటి లంబడొల్ల గుట్టలు - నేటి బంజారహిల్స్ బిడ్డా
బలిసినోల్లా కండ్లావడీ - కరిగినాయి కొండలన్నీ
॥దేకొ॥

నిజాము కాలంనాటి - నూటొక్క చెరువు వాయే
అడవులన్ని ఆగమాయే - అగ్గిలాగ పట్టనమాయే
పాతాల బోరుయేసిన - గంగమ్మ గానరాలే
॥దేకొ॥

నవాబుల పాలనలోన - అద్దరూపాయి గజంభూమి
కబ్జదారులే పాలకులయ్యి - లక్షలలో పెంచిరయ్యో
అద్దెలలో మగ్గెటోలకు - సొంత ఇల్లు కలగ మారే
॥దేకొ॥

దున్నపోతుల ఆట దూకుడు - మొహరానికి దూల ఆడు
బతుకమ్మ పూల పేర్పుడు - బోనాలకు బొట్లను జూడు
పోతురాజుల వేషం జూడు - పొట్టకూటికి దెబ్బలు జూడు
॥దేకొ॥

ధగధగల నగల తీరు - సిరునవ్వులు సిలుకుతారు
కూటికొరకు వొల్లు నమ్మి - ఎయిడ్స్ కోరల్లో చిక్కుకొని
సక్షీసు రొడు మెడకు - ఉరితాడుగ వేసుకుంద్రు
॥దేకొ॥

రైయి నురికె రైలు కూతా - క్లాక్‌టవర్ ముల్లు జూడు
సాలార్జంగ్ మ్యూజియం బొమ్మ - జూపార్క్‌లో జంతువుల జాడ
ఏకశిల బుద్దుని జాడ - ఏలెటోల బుద్దులు గనుకో
॥దేకొ॥

'మురికి గుంటలో పేదల గుడిసెలు - వెక్కి ఇండ్లకు పైసలు లేవు
బంజరహిల్స్ జూబ్లీహిల్స్ - బడాబాబుల కార్ల జల్సాకు
ఫ్లైవోవర్లు గట్టినారు - కష్టజీవుల మరిసినారు
॥దేకొ॥

తల దువ్వినట్టు పిల్లకు - అద్దమోలే రోడ్లు ఊడ్చి
తెల్లార్లు నిదురవొక - పట్నమంతా శుద్దిజేసే
పైయంత నొప్పులాయే - పైసలేక జచ్చుడాయే
॥దేకొ॥

వృద్ధాప్యం శాపమైతే - కోటిలోన యాచనంట
సంసారం గడవనికే - సన్నవిల్లల సర్కాసంట
మందికంతా తమాషాయే - తీగజారుతే తనువు ఆగే
॥దేకొ॥

ఎడ్లబండ్లు గుర్రపు బగ్గీలు - దౌడు దీసిన రస్తాలండి
కుయ్యిం కుయ్యిం మొయ్యిం అంటూ - కారు బస్సుల మోతలాయే
అంబులెన్స్ ట్రాపిక్‌లోన - పేద ప్రాణం గాలిలోనా
॥దేకొ॥

ఎన్నికలొస్తే సాలు - చాణుక్యుల వాగ్దానాలు
చీపులిక్కరు సారా డబ్బు - ఓటు ఓటుకు గుప్పిస్తారు
గెలిసినంక యెతలు జెప్పి - బాధలని దీర్చమంటే
బషీర్‌బాగ్‌లోన కాల్చి నట్టు సంపుతుంటరు
॥దేకొ॥

నిజాము కాలంలోన - అభివృద్ధి జెందిన నగరం
అరె పూలె అంబేద్కరులు - సూసి మెచ్చిన సుందర నగరం
నేటి పాలక దోపిడీ కుట్ర - కొడిగట్టెను ప్రేమదీపం
॥దేకొ॥

**- గుడిపల్లి రవి**

# కన్నతల్లి హైదరాబాద్

హైదరాబాద్ ఒక కవల పిల్లల కన్నతల్లి
పెద్దకొడుకు యాదగిరి రంజాన్ అంటాడు
చిన్నవాడు దస్తగిరి దసరా అంటాడు
ఆ తల్లికి మాత్రం ప్రతి రోజూ పండుగే

హైదరాబాద్ పేదకొడుకుల ప్రేమగల తల్లి
ఒక్క బన్‌రొట్టెను చెరిసగం తినిపిస్తుంది
తాను పస్తులున్న సంగతి తన ప్రాణానికే తెలియనివ్వదు
కొడుకుల్ని చూస్తే చాలు ఆమె కడుపు నిండుతుంది

హైదరాబాద్ కథలు చెప్తూ ఇల్లిల్లూ తిరిగే తల్లి
తానీషా కథలో అందరికీ రాముణ్ణి చూపిస్తుంది
తుర్రేబాజ్ ఖాన్ కథలో తిరుగుబాటు చెప్తుంది
తాను మాత్రం మక్కామసీదు పావురమై ఎగురుతుంది

హైదరాబాద్ ఒక కవలపిల్లల కన్నతల్లి
హైదరాబాద్ పేదకొడుకుల ప్రేమగల తల్లి
హైదరాబాద్ కథలు చెప్తూ ఇల్లిల్లూ తిరిగే తల్లి
ఎక్కడ ఏ పాప ఏడ్చినా తన బిడ్డేనని పరిగెత్తే తల్లి

- అమ్మంగి వేణుగోపాల్



# ఆదాబ్ హైద్రాబాద్

ఎంతైనా నువ్వు గ్రేట్
నీ విజన్ గ్రేట్
హైద్రాబాద్ చుట్టూ అల్లుకున్న నీ అభిమానం గ్రేట్
మరి ఇప్పుడు నీ విదేశీగానంలో ఎన్ని గణాంకాలో
హైద్రాబాద్ ఆదబ్‌నీ ఆత్మీయ హస్తాన్నీ అందుకోలేక పోయావ్
ఈ రంగుల గుల్‌దస్తాలో యిమడలేకపోయావ్
బాగె ఆమ్ పూలవనంలో పురుగులు చొరబడ్డాయా?
ఇక్కడి ఆబెహవాలో ఇంత కాలుష్యమెప్పుడూ లేదు
విశ్వాసం నిండిన యిక్కడి గాలిలో
విదేశీ బక్వాస్ నింపకు
అమ్మపాలు అమృతమౌతాయని తెలుసు
విషమై ద్వేషమై కుదరని రోగమౌతుందని ఎవరికి తెలుసు?
ద్వేషం నాష్తా అయిన వాడికి
దోస్తానా రుచి ఏం తెలుసు
ఇక్కడి ఒక్క ఇరానీ చాయ్ చుట్టూ ఎన్ని స్నేహ సౌరభాలు
ఒక్క బిర్యానీ మనసునిండా ఎంత బిరాదరీ ఘుమఘుమలు
ఆకాశం గుండెలు తాకే ఖవ్వాలీలు
కమనీయ కవితా సాయంత్రాలూ-
షామె గజల్లూ.. భజనలూ.. భాయీచారాలూ..
వేదనలు వైరుధ్యా లెన్నున్నా
అనుబంధాల నగరం హైద్రాబాద్
రంగుల హరివిల్లు యీ యిల్లు
మక్దూమ్ మల్లె పందిరి కింద మంట పెట్టేవాడికి
మనసు మమకారాల మాటేమి తెలుసు?
ఇక్కడి జీవధారలు తరలించుకుపోయిన పైరేట్లెవ్వరు?
సహజ సంపన్న తెలంగాణ తల్లిని
చింపిరి గుడ్డల్లో నిలిపిన వంచనా శిల్పులెవరు?
ప్రాణాన్ని మించిన ఆమె అభిమానాన్ని అవహేళన చేసిందెవ్వరు?
నీవు తిన్నింటి వాసాలు లెక్కపెట్టవు- తగల బెడతావు!

ద్వేషమే మాకు విదేశీయం
దోపిడీ యిక్కడ బహిష్కారం

ఇంకా కమర్షియల్ కాంప్లెక్స్‌ల కాళ్ళకింద నలగని
ఈ గరీబ్ గల్లీల్లో గలత్ నడకలు నడవకు, గందగీ నింపకు
దోస్తానా దారుల్లో వేర్పాటు ముళ్ళ కంచెలు నాటకు

మనసున్న నగరమిది
మొహబ్బత్‌కి దునియాఁ యిది
ఇక్కడి చౌరస్తాలో నిలబడి ధృతరాష్ట్రుని చేతులు చాచకు

నువ్వెన్ని గొళ్ళాలు పెట్టినా
ఖులాదిల్ కా దర్వాజా మాది

ఆమ్ ఆద్మీ ఆత్మీయ సౌందర్యం హైద్రాబాద్
వేదనలు వైరుధ్యాలెన్నున్నా
వైవిధ్యాల హరివిల్లు యీ యిల్లు

ఇంత అందమైన ఆత్మీయ నగరంలో
అభివృద్ధికి అదని అస్పృశ్యులు ఎందరో
ఈ కూడళ్ళు ఆకలికళ్ళ నెగళ్ళు
చాచిన హస్తాలు యిక్కడి రస్తాలు
మూసీనది తీరం బురదలో కూరుకుపోతున్న బతుకులు
రాత్రుళ్ళు యీ నగరం ఫుట్‌పాత్‌ల మీద
ఆకలి ఆరేసిన అస్తిపంజరాలు
బడుగుల ప్రత్యేక బలివితర్దులు, ఎన్నెన్నో భోలక్‌పూర్‌లు
బడుగు బతుకుల యీ బడబాగ్ని కడుపులో దాచుకుని
బంజరా గుదిబండను మోస్తున్న అమ్మ హైద్రాబాద్
అందరి ఆషియానా హైద్రాబాద్

అయ్యా! మళ్ళీ చెపుతున్నా
మఖ్దూమ్ చల్లని మల్లెపందిరి కింద మంట పెట్టకు
తెలంగాణా తగ్దీర్‌తో ఆడుకోకు
తెలంగాణా కోపాన్ని తట్టి లేపకు
ఈ రతనాలవీణ తీగల తెంచకు
రక్తగీతమై అంతా రాజుకొంటుంది

ఇక్కడ యీ బోనాల వీధుల్లో, ఈద్‌బముబారక్ ఇఫ్తార్ విందుల్లో
భోలాల, దిల్‌వాలాల మనసుల్లో



వేరు బంధాల బీజాలు నాటకు
తెలంగాణా తెరువుకు రాకు
ఇక్కడి బతుకుల తెర్లు చేయకు

అన్నీ అమ్ముకొని సొమ్ము చేసుకునేవాడు
అమ్మను కూడా నమ్మడు కదా
అవును
తెలంగాణా తెర్లయింది
దొంగలు పడ్డ యిల్లయింది

తెలంగాణా వాడు
నీకు దివానాగాడు
చీల్చడమే తప్ప కూర్చడం రాదు కొందరికి
హైద్రాబాద్ అందమంతా
ఆమ్‌ఆద్మీ ఆత్మీయతతో ఉంది
నీ నవ్వుల షార్ప్‌వెపన్‌తో అనుబంధాల అంతస్సూత్రాలు తెంచకు

హైద్రాబాద్ నీకు అతిపెద్ద ఆర్థికమండలి కదా
నీవేమైనా కొనగలవేమో కానీ
తెలంగాణకి వెలకట్టలేవు

అబద్ధాల మీద ఆయుధాల మీద బతికేవాడు
అమెరికా వాడైనా అనంతపురం మనిషైనా
మనిషి రక్తం రుచి మరిగినవాడే కదా

విదేశీయం అహా!
ఇది ఎన్నికల ఎత్తుగడ అని లైట్‌గా తోసేయకు
నీ మనసు కక్కిన నిజమిది
నీ నరాల్లో పారే నైజమిది

ఆదాబ్ హైద్రాబాద్
అనురాగాల హైద్రాబాద్
వేదనలు వైరుధ్యాలెన్నున్నా
అనుబంధాల నగరం హైదరాబాద్

- లోచన్

## తరంతంతెలు ఓ పుట్టుతలం

కాలం నడి పొద్దున గాథలు పొదిగీ...

మనిషికి అలాయ్ బలాయ్!

పుట్టు జీవుల జీవరాశీ అదుముకున్న పొది హైదరాబాద్
గిప్పటి అంబేద మెడల మీన విషకత్తి
కచ్చ కైలాటకం తలలు మార్చే ఆంధ్ర మేదోత్పత్తి తంత్రీ

నాదం గానం గందర్వం ఆంధ్రుల దుకున సముదాయం
అగ్ర రాజ్యం సోకిన కిటుకు వొల్లారగించుకున్నరా
హైద్రబాద్ ఫ్రీజోనంటే గావురమయిందా! కొడకా!
తీర్పారమంత తీర్పు కోర్టుకు నిరసన తెలపండిరా! మనిషైతే!

గీడ జీవనం బరువంత పిరమై జాడలెంకుకున్నయ్
నడిచి తిరిగిన తలం మా పుట్టు గడ్డకే పుటం పెడ్తార్రా
పెట్టువడీ, ఉద్దార్కం అబివృద్దా! అడ్డ దోపికస్తుడా!
జీవి కాలానికి కాపలా! పగలూ నాత్రీ యుద్ధ గడియ గడపతెర్చిందీ

ఎడారంత ఎడం ఏ నీడన మాపటికి రూప మెతుకుదుం
మెడలు తెగిన లబ్బరు బొమ్మా! బొమ్మన కమాల్.. మాల్

"ఔరా! ఆంధ్రోడా! నువ్ నాకెర్కా!"

నిద్ర కనుపాపలు దోసిళ్లతో కన్నీళ్లను కడిగీ,
అద్దమ నేత్రీ బల్మికి భద్రమెతుకుంటిమీ
మొగులు పొడి దులుపని తడీ తెల్లారకముందే మొండాలైనమ్
ముడుపుల మూట ఆకాశమెత్తయ్యిందీ..



కుళ్ళడి జాడ ఎల్లడి, తల్లీ తండ్రీ, తరంతంతెలు పుట్టుతలం,
దిక్కుల దిశమీన దేశ దేశాలే దుస మొలలైనయ్
దస్కత్ దండం హైద్రాబాద్ ఫ్రీజోన్ కాదెన్నటికీ
అద్దం ముక్కల నడమ ఆంధ్రసీమ
తీరం ముక్కులు తెగిన మొండాలే
ఆ మెడలు అతుకని నడకలూ నాత్రీ ఓ పగలూ..!
తలుపురెక్కా..
బేడం ఊడిన దర్వాజై నవ్విందీ పట్నం
సెనితల దొంగ దెబ్బకు ఆత్మలు పగిలినయ్
పడి మొగ్గిన ఉగ ఉద్దెమం
తెలంగానయిందీ

పొద్దూ...!
ఇగ బాలింత ఊర్లు నిరసనోద్దెమం
నిజం పచ్చి తడి నెత్తురు ఉడుకు ఉగ్రడీ
ఉరికీ ఉర్కంగా..
తొలి విద్యార్థి మృతవీరుల పాదయుద్ధం
మునుం తొలగని తరం మిగిల్చిన ఉద్దెమ ఎజెండా!

**- వేముల ఎల్లయ్య**

# నా భాగ్యనగరం తెలంగాణ వజ్రకిరీటం

నా ఇల్లును కూల్చి మాల్స్ కట్టిందెవరు?
నా వాకిట్లో స్టూడియోలు నిర్మించిందెవరు?
నా గల్లీలను మాయం చేసి
కాలనీలు పెంచుకొన్న దెవరు?
దీన్ని కబ్జా అంటారా! దౌర్జన్యమంటారా!

నా భాషను బఫూన్లతో మాట్లాడించి
పరిహాసం చేసిందెవరు?
కళాఖండం లాంటి నా హైద్రాబాదును
పచారు కొట్టులాంటి
బెజవాడను చేసిందెవరు?
దీన్ని కుట్ర అంటారా! కుటిలమంటారా!

మేరే ప్యారే దోస్తోఁ !
నాది అస్లీ హైద్రాబాద్
నువ్వు తీన్ పాంచ్ చెయ్యకు
తల్లిలాంటి నా గండిపేట నీళ్లకు
అవమానం జరుగుతుంది
జెరా బచ్‌కే రహెనా!
సలాం కరేతో గులాం నహీ సమజ్‌నా!
నా కాలిమీద నీ కాలుపెట్టి తొక్కితే
నయాపూల్ నిద్రలేస్తుంది
ఆగే పీఛే దేక్ కే చల్‌నా!
ఈ మోడే ఖతర్నాక్ మోడు!

బంతిపూల తోటలో
క్రీస్ పాయింట్లు పెట్టి
ఖూబ్‌సూరత్‌ను కచ్‌రా చేశావు
నీ అచార్ పచార్ కో మారో గోలీ!
నా బిర్యాని తిని దునియాఁ ఖుషీ అవుతుంది
చార్మినార్ మీద
చుక్కలు దిగుతాయి
బస్సు బుకింగు కౌంటర్లు తెరిచి
వెన్నెలను అమ్మేయకు!

ఇది అత్తర్ నగరం
కంపు రాజకీయాలతో
బీమార్ చేయకు!
దోస్తీ చేసినవాళ్ళను ధోకా చెయ్యకు!
ఇక్కడి జనాలది భోళాగుణం
నా గిన్నెలనే తిని
నీ ఎంగిలి నీళ్ళను
నా ముఖంమీద కొట్టకు!
కరచాలనం చేసిన చేతిని
కపటంతో నరకకు!

చిర్నవ్వులాంటి
ఇరానీ హోటళ్ళను లేపేసి
క్లబ్బులూ పబ్బులూ పార్లర్లు పెట్టావు
మలాయి చాయినీ మస్కా బన్నునీ
టిఫిన్ సెంటర్ల కింద తొక్కేశావు
షామియానాను పడగొట్టి
సంగీతాన్ని నిలిపేశావు

నన్ను నెట్టివేస్తూ నెట్టివేస్తూ
నేను నిలుచున్న నీడను లాక్కున్నావు
జరుగుతూ జరుగుతూ
చివరి మెట్టుదాకా జారాను
ఇప్పుడు ఉల్టా తిరుగకపోతే
నాకు బతుకు తెరువు లేదు

నా మ్యూజియంని
రవిక గుడ్డముక్కలమ్ముకొనే
'మ్యాచింగ్ సెంటర్' చేసిందెవరు?
కాశ్మీరు బులాఖీ లాంటి నా ట్యాంకుబండును

'పాపడ్లు' కాల్చే గుడిసెలుగా మార్చిందెవరు?
సంగీత కచేరి జరిగేచోట
రికార్డు డాన్సుల సంస్కృతి ఎక్కడిది!
నా భాగ్యనగరం
తెలంగాణ కిరీటం
కోహినూర్ వజ్రంలాగా
కొల్లగొట్టాలని చూస్తున్నదెవరు?
నా దివాన్ ఖానాలో కూర్చుండి
నన్ను బయట నిలుచో బెట్టిందెవరు?
నా గోడమీది అద్దంలో
నీ ముఖం కనిపించడం మంచిదికాదు!

నా హైద్రాబాద్
సీతాకోక చిలుక
దాని రెక్కలకు కత్తులు కట్టి
కోడిపందాలు ఆడకండి
రాత్రి ముషాయిరా జరిగే వేళ
నీ బోరియా బిస్తర్
నా పలంగ్ మీద కనిపించొద్దు
అలాయిబలాయిని అర్థం చేసుకుంటే
గోలకొండ ఖుదాఫీజ్ చెపుతుంది

దయచేసి
నా హైద్రాబాద్‌ను
సజీవ శిల్పంగానే వుండనివ్వండి
ప్రైవేటు సర్వీసుల 'జంక్షన్' చేయకండి

నా జాగాలో నేను
షాయెరీ రాసుకొంటాను
నీ జాగాలో నువ్వు
సినిమా బొమ్మలమ్ముకో!
నా హైద్రాబాద్‌ను
హైద్రాబాదుగానే వుండనివ్వండి

**- ఆశారాజు**



# ఫ్రీజోన్

ఔను మరి
మీకు నగరం ఫ్రీజోనే
వడ్డించిన విస్తరి -తేరగా ఆరగించడానికి
పరిచిపెట్టిన పక్వాన్నాల భోజనం
మా ఊళ్ళ చెమటతో గట్టిన
చక్కని చెక్కనాల నగరమాయె
చెరువుల్తోటి... బాగే ఆలం తోటి
బహుబాగున్న నగరమాయె
కడుపుల విసంలేని ఆత్మగల నగరమాయె
అలాయి బలాయిలిచ్చే
అవ్వల్దర్జ నగరమాయె

ఔనుమరి నగరం మీకు ఫ్రీజోనే...
చాపకింద నీరోలె బుదగరిచ్చుకుంట జేరి
మా బొండిక్కాయలకు తడిగుడ్డలైతిరి కదా
పానాలిచ్చి పోరాడినం
దీని బునియాదుల్నుండ
మా ఊళ్ళ కలల్నే పరుచుకున్నం
గూడిచ్చినందుకు
గుర్రపు డెక్కాకు చెరువుల్ని మింగినట్టు
నగరాన్నే మింగవడ్తిరి
దర్వాజల్దీసి రానిచ్చినందుకు
మమ్మల్ని నిశానిగాల్లను జేసి దోపుకాల దొరలైతిరి
మీవోన్ని మీవోన్ని వట్టి కొలువులన్ని కొట్టుకపోతిరి
పెత్తనాలన్ని గుప్పిట్ల వెట్టుకుంటిరి
ఔను మరి.. నగరం మీకు ఫ్రీజోనే...

బడ్లైతేంది గుడ్లైతేంది ఆఫీసులైతేంది ఆస్పిటలైతేంది
ఊర్ల ఫైళ్ళనుంచి ఉస్మానియా శవాలదాక
అన్నీ మీ యాపారాలేనాయె
కుక్కకు బొక్కేసినట్టు

ఎడ్డోనికి గుడ్డెద్దునిచ్చినట్టు
నోరు తెరవకుండా పతారలేని పదవులిస్తిరి
మీ కాళ్లొత్తుడుకు అలవాటుపడ్డ ఎర్రిబాగులోల్లు
పౌరుషాలు దుగూట్ల వెట్టి
కుక్కిన పేన్లై పడుంటారు
చట్టాలు మీరు
చట్టాల జుట్టువట్టి ఆడించే
గాలిగచ్చిలాలు మీరు
ఔను రాజ్యం మీ పెంపుడు కుక్క
నిమిషానికో అవినీతిని గంటకో అత్యాచారాన్ని
శాసనసభల సాక్షిగా
హక్కుగా పొందినవాళ్ళు మీరు

ఔను మరి.. నగరం మీకు ఫ్రీజోనే!
ఇంక ఆడుంద్రి
ఫిలింనగర్ల నించి ఫిలింసిటీల దాంక
జూపార్కుల నించి జాబిలి గుట్టలదాంక
సేట్లుమీరు కార్పోరేట్లు మీరు
రూట్లు మీరు పర్మిట్లు మీరు
కాలేజీలు మీరు కార్ల గ్యారేజీలు మీరు
సినిమా వాళ్ళు మీరు
సినిమా హాళ్ళు మీరు
మా రక్తాన్ని జనిగెల్లా పీల్చే
బళ్లు మీరు పెట్టుబళ్ళు మీరు
ఔను మరి..
నగరం మీకు ఫ్రీజోనే...

కబ్జాలు కబ్జాలై రియలెస్టేటులై
గ్రేటర్ బోర్డులై ఔటర్ రింగ్‌రోడ్డులై
చుట్టుముట్టు పల్లెల్ని
ఎవుసం భూముల్ని
అంబుక్క పెట్టచ్చు
పొద్దెక్కితే దిల్‌సుఖ్‌నగర్ నించి కూకట్‌పల్లిదాక
మీ ఫ్యాక్షన్ కక్షల ప్రతీకారాల్ని
నిరాటంకంగా తీర్చుకోవచ్చు
మీ కోస్తా ద్రోహాల మార్కెట్లు తెరిచి
మసిబూసి మారెడు కాయ జెయ్యొచ్చు
పొద్దుగూకితే నారాయణగూడల్ని నెక్లెస్ రోడ్లని
తెనాల్జెయ్యచ్చు, పెద్దాపురాల్జెయ్యచ్చు
నమ్మినోల్లని నట్టేట ముంచే తీరుల్ల
ఆరితేరినోళ్ళు గదా
ఔను మరి.. నగరం మీకు ఫ్రీజోన్

కుతకుత తెలంగాణ అట్టుడికిపోతుంది
మీ తడిగుడ్డ మోసాలకు
తలకొరివి సిద్ధం జేసింది
మరో విముక్తి పోరాటానికి ఆరో ప్రాణమైంది

ఇది మీ ఫ్రీజోన్ కాదు
మీ అబ్బ సొమ్ము అంతకన్నా కాదు
ఈ నగరం మా పదిజిల్లాల
మూడున్నర కోట్ల ప్రజల గుండెకాయ
మా నేల నాడులకి కేంద్రస్థానం
మా వెన్నెముక
మేం రక్తాన్ని పారించి నిలబెట్టుకున్న
మా బతుకు భాగ్యనగరం

తిరగబడే మఖ్దుం అక్షరాల కవాతు
విప్లవాల ఖిల్లా హైదరాబాద్
మీ ఆధిపత్యాన్ని తరిమి తరిమి కొట్టే
జలే హువే దిలోంకా
షేర్ షాయరీ హైదరాబాద్

హైదరాబాద్ హమారా హై
హైదరాబాద్ హమారా హై
జై తెలంగాణ!
జై జై తెలంగాణ!!

**- వరుఖల శివకుమార్**

# హైద్రాబాద్‌కు నేను పరాయివాణ్ణా?

నా ఊళ్లె నన్ను పరాయివాన్ని అంటున్నారు
నాది ఏ ఊరని అడుగుతున్నారు
యాప్రాల్ మా ఊరు
అది ఎక్కడ? నీవు ఎక్కడుంటావు?
నిన్ను ఎక్కడ ఎప్పుడు చూడలేదు
నీవు ఎక్కడ ఎప్పుడు కనబడలేదు అంటున్నరు
నేను తిరిగి నీది ఏ ఊరని అడిగాను
నాది హైటెక్ సిటీ శిల్పారామం దగ్గర
బాలయోగి స్టేడియం సమీపంలో
సింగపూర్ సిటీలో నా చెల్లెలుంటది
రామోజి ఫిలింసిటిలో మా తమ్ముడు గైడ్‌గా చేస్తాడు
కూకట్‌పల్లి ఎక్కడుందో
మా ఆవిడనడుగు చూపెడుతుంది
ఇంటర్‌నేషనల్ ఎయిర్‌పోర్ట్ దగ్గర
మా ఇంటిదాని చెల్లెలు ఇల్లు కట్టుకుంది
రింగురోడ్డు పోసే కాంట్రాక్టరు మా వూరోడే- తెనాలి
ఫ్యాబ్‌సిటి దగ్గర 10 ఎకరాలు మొన్ననె కొన్న
గ్రేటర్ హైదరాబాదు ఎన్నికల్లో
రేపు నేను కార్పోరేటర్‌గా నిలబడుతున్న
పోలీసు కమిషనర్ మా పొరుగూరోడె
అంత ఎందుకు ఒక్కమాట చెప్పాలంటే
గ్రేటర్ హైదరాబాదు నాదే గుర్తుంచుకో- అని దబాయిస్తుండు!
సిటీలో రోడ్లు పోసే కాంట్రాక్టరు సీమ రెడ్డి
రాజీవ్ స్వగృహ, ఇందిరమ్మ ఇల్లు
సర్వశిక్ష అభియాన్ స్కూల్లు అన్నింటిలో వాళ్లే
రంగారెడ్డి జిల్లా పేదల భూములన్ని
వాళ్ల ఆక్రమణలు నిర్మాణాలు నివాసాలు
మేము స్థానికులమె అంటున్నారు
అయితే నేనేనా పరాయివాన్ని?

**- కె.రాజనర్సింహ్మ**



# హైదరాబాద్ ఎవల్ది?

ఎవడి నోటికొచ్చినట్టు వాడు మాట్లాడుతున్నడు?
హైదరాబాద్ ఎవడబ్బ సొమ్మని తేల్చమంట్రుండు?
మా మూసీనదిని మురికిగా మార్చినందుకా?
మీరు పరిశ్రమలు పెట్టి కోట్లకు పడగలెత్తి
కాలుష్యాన్ని మాకు మిగిల్చినందుకా?
మా భూగర్భజలాన్ని విషంగా మార్చినందుకా?
హైదరాబాద్ కేంద్రపాలిత ప్రాంతం చేయాలంట...!
బతుకమ్మ కుంటలో బతుకమ్మ లాడకుంట చేసినందుకా?
మా పట్నం చుట్టూ వందల చెరువులు మాయమైనందుకా?
మీ భూముల వ్యాపారం మూడు పువ్వులు ఆరుకాయలైనందుకా?
హైదరాబాద్ ఉమ్మడి రాజధానిగా చేయాలంటుండ్రు...
అడ్డగుట్ట, పార్సీగుట్ట, రాంనగర్ గుండు, వడ్డెర బస్తీ
గొల్నాకాల్లో మేము ఉన్నందుకా?
వనస్థలిపురం, కె.పి.హెచ్.బి.కాలనీ, ఎ.ఎస్.రావ్ నగర్
బంజార, జూబ్లీహిల్స్‌ని మీరు ఆక్రమించుకున్నందుకా?
హైదరాబాద్‌ని మేం అభివృద్ధి చేసినమంటుండ్రు...
తెలుగు యూనవర్సిటీకి ముందు పొట్టిశ్రీరాములు వచ్చి కూర్చున్నందుకా?
వ్యవసాయ విశ్వవిద్యాలయం యన్.జి.రంగాగా మారినందుకా?
సచివాలయాన్ని ఆంధ్రాలయంగా మార్చినందుకా?
ఆఫీసర్ ఉద్యోగాల్లో మీరుండి, అటెండర్ కొలువుల్లో మేమున్నందుకా?
మా ట్యాంక్ బండ్‌ను, సచ్చిగూడా మీ పెద్దలు ఆక్రమించినందుకా?
హైదరాబాద్ ప్రత్యేక రాష్ట్రంగా ఉండాలంటుండ్రు....
మీ తాతలు తండ్రులొచ్చి మా ఆర్ట్స్ కాలేజీకి రాల్లెత్తిండ్రా?
ఉస్మానియా దవఖానకు నీల్లు మోసిండ్రా?
చార్మినార్‌కు మట్టి ముద్దలందిచ్చిండ్రా?
హుసేనసాగర్ కట్టకు తట్ట బట్టిండ్రా?
మీ విజయవాడ, విశాఖలను మేం కావాలంటున్నమా?
కర్నూల్, తిరుపతిలో భాగమడిగినమా?
మా తెలంగాణా ప్రజల రక్తమాంసాలతో నిర్మించిన
హైదరాబాద్ మీదంటావా
వలస వచ్చిన కొంగ చెరువు నాదంటే
చెరువు ఒడ్డున, కుమ్మరి పురుగు మీట పెట్టక తప్పదు

**- శీలం రామ్మూర్తి**

## గాయాల లోకం...

లోపటి మనుషుల్లారా! జర తెర లేపుండ్రి!
మీరు తలుపులు బార్లా తెర్సిన మాట నిక్కమే...
తలుపులే అబద్దం!
మీరు జెండాలు ఎగిరేసిన మాట సత్తెమే...
జెండాలే అబద్ధం!
డొంకలు డొంకలైనా కాకపోయినా
బత్కులు గుడ్డికాయ బట్నా లేకపోయినా
కండ్లు నెత్తురు బుడగలైనా
సెమటల సుక్కలు నువ్వు మింగినా కక్కినా
యేట పేగుల్నీ సేదినట్టు నా భూముల్ని తెగనమ్మినా
తెలంగాణ ఏనాట్కైనా హైదరాబాద్ ఎప్పటికైనా
సన్నాలిచ్చి సాదిన మా అమ్మనే!
లోపటి మనుసుల్లారా! జర తెర లేపుండ్రి!
తలుపులేగాదు కిటికీలు తెరవండి!!
నన్నీ ఐక్యతా స్పెక్ట్రమ్ లోంచి విముక్తిన్ని చెయ్యండి
నన్ను పాడనీయండి ఏడ్వనీయండి
దూరంగా కాకపోయినా సమీపంగా నైనా విడిపోనీయండి
నా వనాల్లో నా శవాన్నైనా తిర్గనీయండి
మనసారా నా బొగ్గులో పొర్లనీయండి
నా ఎమ్కలైనా ఈ నీళ్ళలో మున్గనీయండ్రా!
మేం భాంచలం గాంరా! ఈ భూమిని బంగారం జేసినోల్లం
మా బతుకులూ! ఎచ్చిపచ్చిగ దంచిన పచ్చి మిర్పకాయ బద్దలెక్క
ఎండిపోయిన దీపబ్బుడ్డి లెక్క సిత్కిన సితపాల పండ్ల మాదిరి
సీకేసిన బొక్కలోలెగె పక్కున పల్గి పచ్చలైన ఓటి బతుకులు
గాయిదు బతుకులు మారవా?
మన జలాల నెత్తురు మరిగినోడు
సింగరేణి బొగ్గు కొండ నాలుకలు మింగినోడు
పిండి పిస్కినట్టు కోడిమెడిర్సినట్టు కల్లుమడ్డి గొట్టినట్టు
నార చీరినట్టు చీరినోడు గడగడ వొనికే శరీరాల మీన
శూన్యం దుప్పటి కప్పినోడు మంచు కమ్మినట్టు పొగలు జిమ్మినట్టు అడ్వి
తగలబడ్డట్టు వూరంతా బొందల గడ్డ జేసినోడు... సిగ్గులేనోడు. బొగ్గు దొంగోడు.
అమ్రికోడు అంగ్రేజోడు - ఇగీడు



తోలుదొంగలారా! తెలంగాణ ఎన్నాళ్లకైనా
హైదరాబాద్! ఏ రోజుకైనా
'సన్నాలిచ్చి సాదిన 'నా' కన్నతల్లే!
నాది మంటే... నీల్ల మంట... కన్నీల్ల మంట... సత్తునాశైన కడ్పుమంట
నీల్లమీద నిలబడ్డా కన్నీల్ల మీద నిలబడ్డా
నాశనం నాల్గు చాల్లే
కడ్పు సించుకున్నా లాబం వుంటలేదాయె
కాల్లమీద పడిపోక ముందే లోలోపల్నె మాడి మసిబొగ్గులైన పేగులు గొల్సు
రొండు కండ్లూ నాయేనన్నోడు మూడోకన్ను నామీన తెర్సిండు.
మనకిప్పుడు వొంటినిండా కండ్లు మొలిస్తే ఎంత బాగుండు?!
బాధల ఉలి చెక్కిన జీవ్‌తాలు
పొత్తిబోసిన పొత్తులు ఎల్లగాసిన వొప్పందాలు
గుడ్డిగుఱ్ఱం మేధావులు
ఎండిన బత్కు పొలాలు నిలబడిపోయిన ఎట్టిజల్మలు
పారే నీల్లు, కారే కల్లు, బొగ్గు గనులు కాదు కాదు డబ్బుగనులు
పతిరోజూ రేపొతున్న 610. డామిట్ కథ అడ్డం తిర్గద్దు. పోచంపాడు దింపుడుగల్లం
జేస్తి. పులిచింత బొందల గడ్డల్ని దేవాదులకు పాతాలిస్తి. గిప్పిటిమీన
హక్కే లేదంటున్నవ్‌గా?
నువ్వు ఆక్రమించిన నా జీవితం నాకిచ్చెయ్... బడివే!
నన్నెట్లా ఊకుండమంటర్రా చెంచాల్లారా...
గుంపులు గుంపుల ఆలోచన్లు ఇర్గబడ్తుంటె
వొంట్లె నెత్తురు సలసల కాగుతుంటే
కోపం అలుగై ఆవేశం వొర్దై మీ వొంటి నిండా పార్తె ఎంత బాగుండు?!
నన్నెట్ల ఊకుండమంటవ్ రా!
నా ఇంట్ల నేను మాట్లాడ్డం నేరమైన యాల
బందెకానైన ఇల్లు, నేరమైన పాట ప్రశ్న
నెత్తురొల్కిన గేయం నిషేధించబడ్డ చూపులు
ఎక్కిరించబడ్డ గొంతులు నిరాకరించబడ్డ అక్షరాలు. పొల్లుపొల్లైన నేలతల్లి
దుబాయిల వొర్గిన పొద్దు తెలంగాణల రేకలు వార్తదన్న ఆశ
ఎప్పుడో మళ్లీ పొద్దును చూసేదీ? ఇగ గీ పరిగె బతుకులు మారవా?
చిల్లులు వడ్డ ఆశ గాయాల లోకం తెలంగాణా ప్రపంచం
ధారలు దారలైన నెత్తురు రక్తపు మడుగులోంచి మొలకెత్తిన హస్తాలు
జై తెలంగాణ! జై తెలంగాణా!! అంటున్నై

-కదిరె కృష్ణ

# తెలంగాణ సెమట పువ్వే అవ్వల్ దర్జా హైద్రాబాద్

వారీ వలస రాబందూ...
నీవల్లనే హైద్రాబాదు పట్నం సీరె రైకె గట్టిందని
బొట్టుబోనం బెట్టిందని
నేను రాకముందు గీడ జిల్లేల్లు పల్లేర్లని
గబ్బిలాల దుబ్బులుండేయని
రాజిర్కములున్నవని నీ నాలికెకు నరమే లేకపాయె
నోరున్నదని కిందాకు మీద మీదాకు కిందజేస్తే యెట్లయితది
కోటల సోంటి కొండల్ని, గుమ్మల గుట్టల్ని
ముత్యాల్ని, రత్నాల్ని రాసులు బోసుకున్న బజార్లని
వూరేగించిన భాగ్యశాలిని, బరిజాతల జేస్తివి
యెన్నెల మడుగుల సెరువు కుంటల్ని
కాంక్రీటు ఎస్టేటు జేస్తివి
హైద్రాబాదంత అలుముకున్న పచ్చటి ప్రాణకోటిని
కంకెరవనంల సాముహికంగా సమాది కడితివి
బువ్వ పెడ్డలసొంటి బూముల్ని బోకరోడై మింగితివి
మా చెమట పువ్వైన అవ్వల్ దర్జా హైద్రాబాద్‌ని
నాశనం పదారుబాల్లు జేస్తివి
ఎవరి శోకాలు ఎవరికి షోకులాయె
మా తాతమ్మల సెమట పారితేనే
మా తండ్రుల నెత్తురు పోరితేనే
హైద్రాబాదమ్మ సలువ పందిరైంది
కాటికెలు బట్టిన మా పేగుల్ని కట్టలు బోస్తేనే
గీ నేలకు మాళిగలైతేనే
గీ పట్నవమ్మ పైలాయించింది
మా పొయిల పిడికెడు బూడిదెక్కువైతే
బువ్వ బగ్గ తింటండ్రని శిస్తు మస్తుగ బెంచితే
రకాలు కట్టి కట్టి మా రెక్కలు బొక్కలు తెల్లగైతేనే
అత్తరు సాయెబోలే హైద్రాబాదు గుబాలిచ్చింది
మా పంచనీడకొచ్చి యెన్న బడ్డదని యెక్కిరిస్తివి
మా నోటికాడి బుక్కల్ని రోటికాడి కుక్కల్ని జేస్తివి
మా నీళ్లను నీ పూల్లకు వురికిస్తివి
కట్టినింట్లకు పెట్టిన పొయిలకు రడీగొచ్చి
యిక్కడి బువ్వనీళ్లు తాగి, గాలి గతికి, నౌకరీలను నాకి
కవిత్వాల కనకమేడలు గట్టుకొని
బిరుదుల బురుజులెక్కి
చత్ నీయవ్వా.... గీ హైద్రాబాద్ లంజది దొంగది
బట్టెబాజిదని బద్నామ్ జేస్తివి 'బేమాన్'
వూరిడ్సి నోడికి వుపాయాలెక్కువట
వామ్మో తుర్కదేశమని, బాబోయ్ నక్సలైటేరియన్న దొంగబుగుల్లు
కేంద్రపాలితం జెయ్యాలన్న ఆంధ్రట్రిక్కులు
మా హైద్రాబాద్ పాదాలకాడ పానసరం బడనీకె
యిప్పుడు ఫ్రీజోన్ పడగలూదినా
నీ వూదుగాలది పప్పుడుకది బిడ్డా...
బాజాప్తుగ భాగ్యనగరమ్మాదే
గీ అవ్వల్ దర్జా హైద్రాబాద్
మా వీర తెలంగాణది
పోరు తెలంగాణది, మా వేరు తెలంగాణది

**- జూపాక సుభద్ర**

## ఏలాన్

హం షికాయత్ కర్తే హై
కభీ నఫ్రత్ నహీం కర్తే!

హం గుస్సాతో కర్తే హై
మగర్ బద్నాం నహీం కర్తే!

హం రూఠ్ భీ జాతే హై
లేకిన్ బే ఇజ్జత్ నహీం కర్తే!

మాం ఆఖిర్ మాం హోతీ హై
హమ్ నీలాం నహీం కర్తే!

యే సప్నా హమ్నే సజాయా హై
కిసీ కా భీక్ నహీం!

హమ్ హైద్రాబాదీ హై
హైద్రాబాద్ సే ప్యార్ హీ కర్తే!

**- రాజా హైద్రాబాదీ**



# కవిత్వం

# జాగో..జగావో

# నా పేరు తెలంగానా

అరవైరెండేళ్ల క్రితంముందు అరవైరెండేళ్ల క్రితం అరవైరెండు నెలల క్రితం అరవై రెండు వారాల క్రితం నన్ను చంపేశారు. అరవై రెండు రోజుల క్రితం అరవై రెండు గంటల క్రితం అరవై రెండు నిముషాల క్రితం అరవై రెండు ఘడియల క్రితం నన్ను చంపేశారు. రేపూ ఎల్లుండీ వచ్చేవారమూ వచ్చేనెలా వచ్చేసంవ త్సరమూ చంపేస్తారు నన్ను

నిన్నెందుకు చంపలేదని నేనెవర్నీ అడగను. పోలీసోడంటే సైనికుడంటే జీతంకోసం చంపేవాడో చంపించేవాడో అనీ, నాయకుడంటే వెనకనడిచేవాడో తూటాల్ని తప్పించుకునేవాడో అనీ శవాలమెట్ల నిచ్చెనల మీంచి నడిచి సూర్యుణ్ణి చేరేవాడో అనిగానీ ఇప్పుడు నేనెవరికీ చెప్పను.

నీ పద్మభూషణ జ్ఞానపీఠాదుల్నీ బిలియన్ల రూపాయలడాలర్లనీ పార్లమెంట్ అసెంబ్లీల్నీ, నువ్ కష్టపడి ఖాళీగా కూర్చొని వేదవేదాల సైన్స్ సాహిత్య కళా సిద్ధాంతాల రాజ్యాంగ హక్కుల్ని మథించి పెంచుకున్న మేథస్సునూ, ప్రాణాయామంతోనో పగటి అంధత్వంతోనో సంపాదించుకున్న సంపూర్ణ శాంతినీ, ప్రతిభ ప్రాంతాలతోనో పై కులపు మహాత్మాభిమానంతోనో క్రిందికులపు రిజర్వేషన్‌తోనో తెచ్చుకున్న వుద్యోగ భద్రరక్షణనీ, మెట్రిమోనియల్ డాట్ కాం ద్వారానో మేనమామ ద్వారానో దొరికిన వంటమనీషి ఐటి బానిస భార్యనో లేక క్రెడిట్ కార్డుల కండలకండల భర్తనో, వాయాగ్రా వొలంపిక్ తర్వాతి ఆనందక్షణాన హఠాత్తుగా గుండాగినట్టు ఆలోచనలన్నింటినీ అంతం చేసుకొని సుఖిస్తున్న నీ అదృష్టాన్నీ, ఏకకాలంలో అమ్రికా పిల్లల తండ్రివీ సామ్రాజ్యధిపత్యవ్యతిరేక ఉద్యమాధ్యక్షుడివీ అయిన నీ జన్మ రహస్యాన్నీ తగలబెట్టమని చెప్పను నేనెవరికీ ఇప్పుడు. నేను మరణించినంక అంతా అయిపోయినంక.

తెరనిండా పరిచి మానవాళిని బ్రెయిన్‌డెడ్ చేసిన నీ మార్కెట్ అంగసౌష్టవాన్నీ, జంతు చర్మాల్ని నిలువెత్తునా ధరించి నువ్ బోధిస్తున్న జీవహింసా పాఠాల్నీ, ప్రకృతికి యాసిడ్ దీపాలతో పూజలు చేసినట్టు ఆదివాసి

శవాల్ని అందమైన బొమ్మలుగా మార్చినట్టు మనుషులు గబ్బిలాలై వేలాడుతున్నచోట ఉన్నొక్కబస్సునూ బర్రెలకంపెనీకి అద్దెకిచ్చినట్టు ఒకవైపు కోటివాహనాల్ని రోడ్డుపై దింపి మరొకవైపు క్షత్రగాత్రులకు 24 గంటల శవవాహనాన్ని దానం చేసినట్టు స్వదేశీలు సరిపోక సరస్వతిని చెరిచి అమ్మడానికి విదేశీల్ని రప్పిస్తున్న నీ ఆధునికతనూ, నా ఇంటినీ పొలాన్నీ పాతాళంలో పూడ్చి వాటిపై కట్టిన ప్రాజెక్టుల్లో నన్ను స్కావెంజర్‌ను చేసిన నీ అభివృద్ధినీ, వున్న వుద్యోగాలు అంకుల్ గద్దలెత్కపోతుంటే ఆరుబయట కొట్లాడే నీ కోడిపుంజుల ఐకమత్యాన్నీ, అడివికీ మైదానానికీ మధ్య హింసా ప్రతిహింస సందిగ్ధసంధ్యలలో రక్తం రాలకుండానే అమాయక జీవుల్ని నిర్జీవులుగా మార్చే నీ నైపుణ్యాన్నీ, చిట్టచివరి నావద్దకు రాని నీ స్థానిక జాతీయ అంతర్జాతీయ సేవాశకారుల్నీ... తుపాకులతో... సరిగ్గా నన్ను చంపినట్టేచంపమని నా భార్యనూ నా సంతతినీ నా కులాన్నీ నా జాతినీ నేనెప్పటికీ ఎప్పటికీ కోరను.

సరిగ్గా నన్ను చంపినట్టే

హిరోషిమాలో వియత్నాంలో

జలియన్‌వాలాలో లాహోర్‌లో

చుండూరులో కారంచేడులో

అఫ్ఘాన్ బాగ్దాద్‌లో

గుజరాత్ రాజస్థానలో

నందిగ్రామ్‌లో ముదిగొండలో, చెంబుబర్మూర్‌లో హైద్రాబాద్‌లో

సరిగ్గా నన్ను చంపినట్టే చంపమని నేనెవ్వర్నీ ఎప్పుడూ కోరను. కోరను. కోరను.

- శ్రీనివాస్ దెంచనాల

# అన్నీ వున్నయ్...

తెలంగాణల ఆయుధాలు కరువైనాయా?

తెలంగాణ పదిజిల్లాలు రాళ్ళగుట్టలు
కంప పారకలు.. మట్టిదుబ్బలు..
రాళ్ళు పట్టండ్రీ
కంపపారకతో ఎదురెళ్ళండడి
దోసిళ్ళనిండా దుబ్బపట్టి నిలబడుండ్రీ...

కొడవలి సుత్తే రంపం గడ్డపార పారా
ప్రతిరైతు ఇంట్ల ఆయుధాలే-
కూలోల్లు పనోళ్ళు చేతిపని కళాకారులు
అందరి చేతిలో ఆయుధాలే -

అన్నీవున్నయ్ తెలంగాణల
ఒక్క గుండెధైర్యం తప్ప -

తెలంగాణల వొర్రేనోరు.. పొగరు..

విర్రవీగడం.. ఉరుకురుకి తన్నడం.. లఢాయ్ జేసుడు
యాడ సచ్చినయో ఏందో...
యాడగూడా సూద్దామన్నా కనపడతలే -

కట్టే సాములేమయిండ్లో... కత్తిసాము లేమయిండ్లో...
బాగాలేసేటోళ్లు వలలేసేటోళ్లు
వడిసెల ఇసిరేటోళ్లు షికారు చేసేటోళ్లు ఏమయిండ్లో?
పదిమందలి సాము సావీదుకనీ
దమ్మున్న నలుగురు
తొడకొట్టి బుసకొట్టి పగబట్టి నిలబడుండ్రీ...

చార్మినార్ ఎవ్వర్ని బలిత్తరో సూడబట్టింది
గోల్కొండల ఒక్కడ్ని బొందపెట్టకపోతిరి
హుస్సేన్‌సాగర్‌ల ఒక్క శవమన్నా తేల్తలేదు..
పిడికిలెత్తి నిలబడ్డదీ...

రక్తమో పాణమో తియ్యండి
తెలంగాణ వస్తదా ఏందీ...?

- అన్వర్

# దోఖా

మట్టిముట్టూరా మంటలు
గాయాలై కారుతున్న నెత్తుటి ధారలు
శియ్యలు కాల్సుక తినే రాజకీయ జీవులు
తెలంగాణ గడ్డమీద గమ్మతి ఇది

బయిటోని బట్టే బాజితనం బ్యాడ
ఇంటోనిది ఏర్పడకుండ ఇరవై పైసలు ఇస్స
నిత్తె ఎక్కెక్కి పడుతున్న ఏడుపుల కొలుపు
ఎగతడుతున్న ఊపిరి
నలభై ఆరు నుంచే కడుపుల పెరిగిన మోసం

ఏ మూల మలుపు సూడబోయినా
పోరాటం అని బొచ్చె సరుసుకునుడు నాదైతే
రాయి మీద రాసుకున్న గెలుపు నీదైంది
నెత్తురు కన్నీళ్ల పారకం ఓ పక్క
ఒడుపుగా జెండా పాతుడు మరో పక్క

పేరు పెద్దిర్కమై తెలంగాణ సాయుధ పోరు
నైజాం రాజిర్కం, దొరతనం తోలు తీసిన కాలం
మూడు వేల పైచిలుకు ప్రాణాలు తృణప్రాయం
భూమి మనిషి విముక్తి అయ్యే ధీమా

అంతలోనే ఢిల్లీ సైన్యంతో కమ్ముకున్న నేల
శిరస్సు వంచిన రాజుతోని అలయ్ బలయ్
పారిపోయిన భూస్వామ్యం
ఎప్పటి చిప్ప ఎనుగులనే
నలభై ఆరునుంచి యాభై ఒక్కటిదాకా
అణచివేత కాల్చివేత ఊచకోత
మదరాసాంధ్రుల జిట్టికండ్లు శిమ శిమన్నయి
భాషా రాష్ట్రాల సమైక్యత చీడ బుట్టింది
ఆంధ్ర హైదరాబాద్ విషవిలీన మంత్రం
బట్టపులికి మ్యాక పిల్లకు పొత్తు కలిపింద్రు
పెద్ద మనుషుల ఒప్పందం గద్దల పాలైంది
భుజాలమీదెక్కి సవారి చేస్తంద్రు



యాబై ఆరు నవంబర్ ఒకటి కటిక చీకటి
గోబ్యాక్ గోబ్యాక్... ఒర్లుతున్న బొండిగలు
వాడ వాడల్ల పడుసు పడుసోళ్ల లొల్లి
వలస కొడుకులమీద ఇనుప పిడికిలి
మూడు వందల అరవై మంది అమరత్వం
పొన్ను కర్ర పటేల్ పోటు పొడిసిండు
మల్లా వైఫల్యం మల్లోసారి దోఖాబాజితనం
పందొమ్మిది వందల అరవై తొమ్మిది
ఇచ్చ లీరి పచ్చ బడ్డది

పీడనపై కలెబడిన చేతులు
నేలకోసం అడుగుల వెనుక అడుగులు
ఆకలికోసం అందుకున్న బందూకులు
జైత్రయాత్రలు అరణ్య అలజడి రహస్య జీవితం
నిర్బంధం... నిర్బంధం విధ్వంసం విధ్వంసం
నాది నాది అన్న భూమి దక్కలేదు
వేలాదిమంది వీరుల రక్తం వరదైంది
ఎనభై తొంభై అయిదు సందు
ఏపుగా పెరిగి విరిగిన రోజులు

అరవై ఏండ్ల నుంచి తన్నులు గుద్దులు
బాధలు ఏడుపులు పుండ్లు రగుతం
ఈ నేల మొత్తం పోరాటాల సలపరింత
తరలించుకు పోయే నది నిలుస్తది
కరిగిపోయే ఖనిజం ఆగుతది
ఊడిపోయిన ఉద్యోగాలన్నా ఉంటాయి
సత్తె నాశనమైన సంస్కృతి చిగురిస్తది
వలస పొగ ఎల్లిపోయి
కండ్లకు ఎలుగులు కురిపిస్తాయనుకుంటే
పదేండ్లుగ రగిలిన ఆకాంక్షల్ని
అందిన కాడికి తరాజుల పెట్టి అమ్ముడు
తెలంగాణ నేల శాపగ్రస్త భూమా!
ఇంకా- తెలంగాణ ఒడవని దుక్కం
ఎక్కెక్కి పడుతున్న రాగం

**- అన్నవరం దేవేందర్**

# తెలుగు మాది - తెలంగాణ మాది

తెలంగాణ గొంతు పెగలంగనే
తెలుగుభాష తియ్యగైతదెందుకు?
శ్రీ శ్రీ కవితలు కృష్ణశాస్త్రి పాటలు ప్రవహిస్తాయెందుకు?
హఠాత్తుగా తెలుగుతల్లిని అభిషేకిస్తరెందుకు?
సమైఖ్యాంధ్ర సంఘాలు, సవట పార్టీలు
అగ్గిమీద గుగ్గిలాలైతాయెందుకు?
కచ్చెకైనా కుట్రపూరిత సభలు చేస్తరెందుకు?
సన్నాసి కొడుకులు గోడమీద పిల్లోలె గూసుంటరెందుకు?

కాళ్ళకింది నేల కదలిపోతదని
ముడ్డికింద పీఠం జారిపోతదని
మనని తెలివిదక్కువోల్లని తెర్లు తెర్లు జేస్తుంటే
వాడు జెప్పినట్టు తోకాడిస్తరెందుకు?
వలస వాదులకు గులాములై వర్రె కూతలు గూస్తరెందుకు?

ఇదేనా... నిజాం నిరంకుషత్వాన్ని ఎదరించిన వీరత్వం
ఇదేనా... రజాకార్లను తరిమికొట్టిన త్యాగాల అమరత్వం
కన్నతల్లిని నోటికొచ్చినట్టంటుంటే నోరు మెదపరెందుకు?

ఏండ్ల కొద్దిగ గూడుగట్టుకున్న దుఃఖం బతుకంతా నిత్తె పోరాటం
శత్రువు సేతులెత్తితే - ఇంటోడు కత్తి దూసినట్టుంది
చేవజచ్చిన కొడుకులు బతికుండంగనే కొరివి బెడ్తట్టుంది
పనికిమల్లె కొడుకులు ఉంటేంది - లేకుంటేంది?
తల్లి గోస జూడనోడు ఎన్ని దేశాలకు రాజైతేంది?

నిజంగా మనదెంత సిగ్గులేని జన్మ
ఇంతకాలం మౌనంగా ఉంటే నివురుగప్పుకున్నరనుకున్న
మాట్లాడకుంటుంటే పోట్లాటకు సిద్ధమైతుండ్రనుకున్న
ఆత్మగౌరవాన్ని అమ్ముకుంటున్న కొడుకులారా
అమ్మని తాకట్టు బెడుతన్న బిడ్డలారా సల్లగ బతుకురి
ఆంధ్రోల్ల ఎంగిలి మెతుకులు తిని
ఆల్ల మోచేతి నీల్లు తాగి ఎయ్యేండ్లు వర్దిల్లురి
ఆల్లెప్పటికీ పడుసోల్లే... ఇప్పటికింకా పదహారే
ఆల్ల కాల్లు బట్టుకోరి - కాలనీల సుట్టు తిరుగురి
అపార్టుమెంట్లు గట్టియిరి - హైద్రాబాద్ రాసియ్యరి
అమ్మ అడ్క తింటేంది - కన్నబిడ్డల్ని అమ్ముకుంటేంది
ఉన్న ఉద్యోగాలు ఊడితేంది - అన్నదమ్ములు దుబాయ్‌ల సస్తేంది?
ఏమన్న గానీ... ఎట్టనన్నబోనీ..
ఆల్లని పల్లెత్తు మాటనకురి
మీ పదవులు బోతయ్ - పానాలు బోతయ్

తెల్లారి సుక్క బొడ్సింది
వేకువజామున వెలుగురేకలు బారింది
తెల్లవార్లు మెల్కతోనున్న ఈ కొడుకులేరి?
అమ్మకోసం అసువులు బాసిన నా బిడ్డలేరి?
సమ్మక్క సారక్కలేరి?
ఎములాడ రాజన్న కొమురెల్లి మల్లన్న కొరివీరన్న ఏడున్నరు?

ఇన్ని బాధలకన్నా యుద్ధమే మేలు
ఏడి నాబిడ్డ కొమరం భీముడేడి ఆడొక్కడు జాలు
ఆరుట్ల కమలమ్మ, బందగి, ఐలమ్మలుండనే ఉండ్రు
హన్మంతు, యాదగిరీ ఎనుకకకు మల్లి సూడొద్దు
కదనరంగంలో నేనూ ఒకన్ని
చివరి నెత్తుటిచుక్క నేలరాలేదాకా....

**- అంబటి వెంకన్న**

# ఎయ్యేండ్లయిన యేరు తప్పదు

కడుపుల కాలిపడక గుండెల గూడువడక
అడవిలో ఇల్లాయె ఆగమ్మ పచ్చులమైతిమి
సొమ్ము పాయే దుమ్ముపడే
ఆయం తీసుకొని గాయంల పొడిస్తిరి

ఎవని గండం ఎవని పిండం
పోరాటాలు మావాయే ఆరాటాలు మీవాయే
కామ గొడ్డలిలో దూరి
తన కులాన్ని నరికినట్టు జేస్తిరి
దూడను చీకమంటుండ్రి
బర్రెను తన్నమంటుండ్రి
ఎందుకంటె ఏం చెప్పం?
ముల్లె మోసేటోనికి తెల్సు
లెక్క రాసేటోనికి తెల్సు
గుడ్డికన్ను రాత్రి ప్రయాణం
చెల్లని బంగారం ఏడికి పోతది?

రెక్కలున్నాయ్...
కొండలొస్తాయ్
తెప్పల్ తేల్తాయ్
పైసకు పైస ఆసరా
పన్నుకు పాసాసరా
తరిగైనా తెగబడైనా
తెలంగాణ తేక తప్పదు
ఫ్రీజోనని ఆసాలు లెక్కపెడ్తండ్రు- కూసాలు దీస్తాం
ఇరుసుని సూసుకుని పురుషున్ని పోగొట్టుకోకుండ్రి
నూరేండ్లయిన సావు తప్పదు
ఎయ్యేండ్లయిన యేరు తప్పదు

- గాదె వెంకటేష్



# తెలంగాణ స్కూల్ అసెంబ్లీ

వందేమాతరం, బందీమాతరం
నిర్జలాం నిష్ఫలాం
రోజూ ప్రార్థన చేస్తనే వున్నం, వినేదెవరు?

మా తెలుగుతల్లికి మల్లెపూదండ
గలగలా గోదారి కదలిపోతుంటేను
విలవిలా మానేల ఎండిపోతుంటేను
బిరబిరా కృష్ణమ్మ పరుగులిడుతుంటేను
కటకటా కరువమ్మ వచ్చి నిలుచుంటేను
... ... ... ... ... ... ...
మాభూమి మా నీళ్ళు దక్కి తీరేదాక
మా ఆటలే ఆడుతాం! మా పాటలే పాడుతాం
జై తెలంగాణా! జై తెలంగాణా!!

తలెత్తుకుని ప్రతిజ్ఞ చేస్తున్నం
ఆంధ్రరాష్ట్రము నా జన్మభూమి
ఆంధ్రులంతా నా సహోదరులా?
సుసంపన్నమైన బహువిధమైన
ఆంధ్రవారసత్వ సంపద మాకు సర్వనాశనం!
వారి శ్రేయోభివృద్ధులే మా దుఃఖానికి మూలం

వార్తలు
తెలంగాణ నీళ్ళకు గండికొట్టిన ఆంధ్ర
సారవంతమైన భూముల ఆక్రమణ
రైతులకు మరొకసారి కరెంట్ షాక్
కిరాయి క్రీడల్లో వీరాంధ్ర!

సూక్తులు
1. వెయ్యేండ్లున్నా వేరుదప్పది
నూరేండ్లు బతికినా సావుదప్పది
2. నీరు ఆంధ్ర నెరుగు
నిజము తెలంగాణమెరుగు

అతిథి సందేశం
తవ్వేడిచ్చిన కాడ తంగేళ్ల పీకాలని
ఎక్కడోళ్ళక్కడ బతుకవోయిండ్రు
ఏమ్మాట్లాడాలె! ఇండ్లన్ని బల్లిపాతర్లు వట్టినయ్
పెద్దలను యాది జేసుకొని ఏడుద్దామంటె
పెత్తరమాసనాడు ఇంట్ల 'శారెడు' బియ్యం లేవు
బతుకు అంగడికీ, యింటికీ మధ్య దూరమయింది
ఉప్పేసి పొత్తుగూడిన పాలోడా!
నర్రెంగ జెట్టుకింద నూకలు జల్లి వలపన్నిన మోసగాడా!
గొర్రెంకలు నీ పన్నాగాన్ని పసిగట్టినయ్
అది బంగారి కత్తని మెడగోసుకుంటమా?
ఎవనికి బంగారమైందో, ఎవల మెడమీద కత్తైందో ఎరుకైపాయె
తెలుగుతల్లీ! ఎన్నిగాయాలు పూసినా
మాకు దక్కని రాజ్యం దుఃఖమే యిచ్చింది
ఇన్ని గోసలు మా గోటి చుట్టు పోటెత్తినపుడు
ఇగ మా రోటికాడ మా పాటలే పాడుకుంటం

ప్రధానోపాధ్యాయుని సందేశం
మనదిగాని భాషల చదువుతున్నం
పాలిభాషల పాఠమెట్ల అర్థమైతది?
తెలుగు పాఠం చెపుదామంటె
మన జానపద దుఃఖాలు వినబడుతున్నయ్
గణిత పాఠ్యాంశపు లాభనష్టాల లెక్కల్లో
మా నష్టాలే ఎక్కువ
ఇక నుంచి అట్లగాదు
సాంఘిక శాస్త్ర ప్రశ్నాపత్రంలో
తెలంగాణా సంస్కృతిని గురించి రాయండి అని
వందమార్కులూ ఒకటే ప్రశ్న అడుగుతాం
ఆఖరి పీరియడులో నల్లబల్లమీద
గుండెపటం గీద్దామంటే
అది తెలంగాణా చిత్రపటమయింది.

ముగింపు
జనగణమన తెలంగాణా జయహే!

- తైదల అంజయ్య



# ఒక తిట్టు పద్యం

ఇప్పుడు - తిట్టు కూడా నాకు ఆయుధమే!
మీడియా మిత్రులారా! చర్చకు సిద్ధం కండి
మీ మీ పండితులతో నా భాష మీదా భావం మీదా
బహిరంగ వాదనలకు రండి!
నా బతుకంతా అల్లుకున్న తేనెల భాషను బజారుకీడ్చి
హాస్యం పండించుకున్నవాళ్లు
కాసులు కురిపించుకున్నవాళ్ళు
విషం చిమ్ముతున్నవాళ్ళను తిట్టకుండా ఎట్లా ఉండగలను
ఇప్పుడు - తిట్టు నాకు ఆయుధం!
అన్ని మూలలకూ విస్తరించి
ఒప్పందాలూ సూత్రాలకూ వక్రభాష్యం చెప్పి
కొలువులు కొల్లగొడుతున్న దౌష్టీకాన్ని
తిట్టకుండా ఎట్లా ఉండగలను
తిట్టు - ఇప్పుడు నాకో ఆయుధం!
ఇసుంట రమ్మన్న పాపానికి ఇంటి వాసాలు లెక్కించి
నట్టింట్లో తిష్టవేసిన వాన్ని
నీటినీ, గనుల్నీ, వనాల్నీ మేస్తున్నవాన్ని
తిట్టడం నేరమెట్లా అవుతుంది
నా అస్తిత్వాన్ని ముక్కలుగా కోసి
వ్యాపారమై విస్తరించుకుంటున్నవాని
రాక్షస పదఘట్టనల కింద
నా రాజధానిలో నా ఉనికి ప్రశ్నార్థకం చేసినవాన్ని
తిట్టకుండా ఎట్లా ఉండగలను
అవును - ఇప్పుడు తిట్టు నా ఆయుధం
తిట్టు అమాయకుని ఆర్తనాదం తిట్టు నిస్సహాయుని అస్త్రం
తిట్టు ఆసరా కోల్పోయినవాని ఆక్రోషం.. పీడితుని దుఃఖం
బలవంతుని అహంకారానికి బలహీనుని నిరసన తిట్టు!
అయితే నాదొక ప్రశ్న - యాభైయేండ్లుగా తిడుతున్నా
దశాబ్దాలుగా వద్దు పొమ్మంటున్నా
నా ఇంటి చూరుకు గబ్బిలమై ఎంతకాలం వేలాడుతావురా

- వి. శంకర్

# మాట

మాటంటే మంత్రం
సమ్మోహనాస్త్రం
రంగు రుచి వాసన
మాటంటే- పచ్చని చెట్టుకింద ఒట్టు వేయడం
మాటంటే దేవుని గుడిలో ప్రమాణం చేయడం
మాటంటే నాలుక మీద నిప్పురవ్వ
మాటిచ్చి మలుపుకున్నవు
మాట నీకు అంగడ సరుకు
నీళ్ళు నములుతవు
తొత్తిరి తొత్తిరి మాట్లాడతవు
నవంబర్ ఒకటిని మా నెత్తిమీద గుది బండను చేస్తవు
దింపుకుందామంటే దినమొక్క వేషమేస్తవు
నీతిలేదు నియ్యతు లేదు
పోరా నాయనా, పో
పొమ్మనలేక పొగపెట్టలేం
ఉండుమని తూగుటుయ్యాలలు ఊపలేం
యాభై ఏళ్ళ తప్పుడు మాటల కూతలు వినలేం
పోరా అయ్యా, పో
మా బతుకునెంచేవాడు
మాకు బుద్ధులు చెప్పేవాడు
బెత్తం పట్టుకుని బెదిరించేవాడు
మాకొద్దుగాక వద్దు
నీ ఉద్ధరింపు వ్యూహాలు
మాకీ ఊడిగాలు వద్దు
పోరా అయ్యా పో
కోపం కోటి గొంతుకవుతున్నది
నువ్విక ఉండలేవు.. ఊసులు చెప్పలేవు
పోరా, నాయనా పో

- కాసుల ప్రతాపరెడ్డి



# ఎడారి చెట్టు కొమ్మ

ఒరంగట్టుపై రైతు శవాన్ని మోస్తున్న
పగిలిన ఒరిమడినిదాటి
స్మశానం ఊళ్ళోకి ప్రవేశించింది
ఆపద్బాంధువుడై వలస
తలుపుముందర నిలబడింది
గాలి కత్తులు ధరించి
మిగిలిన జీవాలకోసం గాలిస్తోంది
ఇంటికేసిన తాళం కప్ప
పగలే అమావాస్యను కురుస్తోంది
సానిపిచల్లని వాకిలి- సచ్చిన మా నాయ్నమ్మ ముఖమే
మా వూరొక ఎడారి చెట్టుకొమ్మ
పూలు రాలిన అనాథ జాడ
కలల శవాలు వేలాడుతున్న మొండిగోడలు
గతం జ్ఞాపకాలను భద్రపరుస్తున్నాయి
గూట్లో కోయిలమ్మ శవంలా దీపం
జవసత్వాలు లేక ఆరిపోయింది
ఊరెనక దుబ్బ తొవ్వలో
పరుచుకున్న అడవుల నిండా
కన్నీటి పుష్పాలు వికసిస్తున్నాయి
పుల్లరి పొదల నీడ గుండెకు హత్తుకుంటోంది
లేగచూపుల్ని నెమరువేస్తున్న బర్ల కొట్టంలో
తోడేల్ల ఆవులింతలు
నల్లకుక్కకు కాన్పు చేసిన
సగం కూలిన ఇంటిగోడ
వదిలిపోతూ విడిచి వెళ్ళిన చివరి చూపుల్ని
కళ్ళనిండా నింపుకొని ఎదురుచూసే
తలుపు సందులు కనుపాపలు
గాయం మానని కాయం ఇంటి గడప
తనకు తానే పెకిలించుకొని
యుద్ధానికి సిద్ధం అవుతోంది

- దానక్క ఉదయ్ భాను

# ముల్కీ

దాగుడు మూతలు దండాకోర్
పిల్లీ వచ్చే ఎలుకా భద్రం...
ఇంగెంతకని మేం
గీ పాటల ఎల్కోల్లె బద్రం లేకుంట వుండాలే?
గీ దండాకోర్ పాటల దిల్లగీ ఏంద్రా అంటె
ఆటల అరటిపండన్కుంట శాత్రాలు ఎయ్య బడ్తివి
అదేందోగని అరటిపండెప్పుడూ అర్గీజ్ మా నోటి కందదు
శాత్రం యిసిరేసిన తొక్క మీద, కాలు జారిపడటం తప్ప.
మొక్కజొన్న తోపతోని మేకపాల జిగిరీ దోస్తీ
ఎన్ని జన్మలెత్తితే నీకర్తమయితది?
సద్దగట్క మీన కూకోని ఎల్లిపాయ కారం, మీసం దువ్వుడు
పిర్కి పిత్తులోనివి - నీకెట్ల కండ్ల బడ్తది?
బగ బగ మండే అంబటాల్లను
సల్లమెత్కులు సల్లబర్చటం
కడుపుల సల్ల గదలనోల్లకేం ఎర్కైతది?
దినాం గివ్విటి తోటి సోబతి కట్టెటోల్లకు
సన్నబియ్యం ముచ్చెట్లు సమజైతయా?
కన్నతల్లి పురిటివాసనసుంటిది
మా బాస, యాస
పెంపుడు తల్లి నేవళం అత్తరు మాకెట్ల అంటుతది?
మా అవ్వ గుండెల్ల గడ్డపారలు దింపి
'సెజ్'లని బోర్డులు గట్టితే
నిలబడేటందుకు జాగ లేక
దిక్కులేని పచ్చులెక్క ఆగమాగమైపోతున్నం
మేం చెమటోడ్చి కట్టుకున్న పుట్టల
నువ్వు బుస్సు మంట పడగెత్తితే
చీమలెక్క అగ్గం బగ్గమై చెదిరిపోతున్నం.
తెగ్గోసిన మా తల్లి నరాల కెల్లి
పారే నెత్తుటి నదులకు
క్రస్ట్ గేట్లు ఎత్తి, దారి మళ్ళిత్తే
బొక్కలు దేలిన అవ్వ గోస సూసి



అల్లడం తల్లడం అయితన్నం
దొంగలు దొంగలు వూళ్ళు పంచుకున్నట్టు
'ఫిరీజోన్' ముసుగులో దొడ్డిదారంట
మూటలు దాటేత్తుంటె
మాటలు రాక కామోష్‌గ తండ్లాడుతున్నం
మా మెడకు ఆరోనంబరు బిళ్ళ తగిలిత్తే
పడిపోటానికి మేం మూర్ఛరోగులం గాదు
పిర్ర గిల్లి జోల పాడే నీ యికమతులకు
పాడెగట్టి పడ్కోబెట్టే దినం దగ్గర బడ్తాంది
నువ్వు మంత్ర నగరి సరిహద్దులు ముట్టినవ్
ఇంగ సూస్కో బిడ్డా!
పది పక్కన సున్నాను నూకిపారేసి
ఒక్కటై ఎదిరిత్తే
గాదెకింది పందికొక్కులన్ని ఫరార్ గావాలె
ఉప్పు బెర్రలాడినప్పుడే
మా వుప్పు మేం ఎట్ల పుట్టిచ్చుకోవాల్నో తెల్సినోల్లం
మీ లెక్క, మా ఉప్పు తిని
మా ముడ్డికిందే ఎసరు పెట్టే
బే యిమాన్ గాల్లం గాదు
గిప్పుడు మేం నెత్తురు తోడేసిన
ఉత్త బొక్కల గూళ్ళం గాదు
నువ్వు అగ్గిలో దింపడానికి
మేం తీగలు తెగిన వీణలం గాదు
కడుపు మంటతో రగిలే మా పేగులన్నీ
గిప్పుడు రుద్రవీణలే!
ఇగ అల్లోడు బంతి యిల్లోడు బంతులాట బందువెట్టు
నీ నోరు - దాస్కో మూస్కో సాంబారు బుడ్డీ
గిన్నాళ్ళ సంది యాది మర్సి
సందూకలో దాసిపెట్టిన
ముల్కీ జెండాగుడ్డ యిప్పి దుమ్ము దులుపుతున్నం
మా వతన్, మా ముల్క్ మాకు గావాలె నన్న
మా తల్లి గుండె సప్పుళ్ళు దిక్కులు పిక్కటిల్లంగ
'జై తెలంగాన' అనుకుంట జంగ్ షురూ జేత్తన్నం

**- దిలావర్**

# జాగో... భగావో !

జాగో జగావో! సరిపోదు !
జాగో... భగావో అనాలె !
మనం మనం మాట్లాడుకునుడే కాదు
జనం మనం జమగావాలె
ఓట్ల కొట్లాటలు, సిద్ధాంత రాద్ధాంతాల కాన్నే ఆగుడు కాదు
జాగో....లగావో అనాలె....
మనదేందో మనకున్నదన్నప్పుడు
అడుక్కతినుడెందుకు? ఆగమవుడెందుకు?
ఆవో హాత్ మిలావో.....
పొద్దు గూకింది...తెల్లారింది....
మిట్ట మధ్యాహ్నం నట్టనడుమణ్నే వుంది
కాకమ్మ కబుర్లు కోకిల గానాలు ఇనిపిస్తనే వున్నయి...
బాయిల బడ్డ బతుకు బొందల గడ్డకెక్కింది
తెలివిదెచ్చుకున్నం ఇగ తెగబడుడే మిగిలింది
అందుకే జాగో.... జగావో సరిపోదు
జాగో భగావో ! అనాలె....

- రమేష్ హజారి

# నువ్ నా తల్లివి కావ్...!

అవ్! నువ్ నా తల్లివి కావ్
నేను నీ కొడ్కును కాన్
నా తల్లి కడుపుల పుట్టినా- నా తల్లి ఒడిల పెర్గినా
ఆయమ్మ గురించి పట్టించుకోకుండానే బత్కిన
అసలు ఆయమ్మ ఉందనే సంగతే మర్సిన
యాభయ్యేండ్ల కింద నువ్వొస్తివి
నన్ను కొడుకా అంటివి
నన్నూ నీ కొడ్కునూ ఒకే తీర్గ సూస్తనని మాటిస్తివి
మనుషుల నమ్మే తల్లికి పుట్టినోన్ని
కన్కనే నీ మాటలు నమ్మితి
నువ్వే నా తల్లివని కొలిస్తి
నీ కొడ్కునూ సొంత అన్నలెక్కనే సూస్తి
కానీ వానికి నేను తమ్ముని లెక్క కన్పియ్యలే
మనం కల్సినప్పట్సుంది వాడు
నన్ను లూటీ చేయవట్టె
నా పాలి భాగం గుంజుకోవట్టె
నాకు బాస రాదనవట్టె- నా వంశాన్నే ఎక్కిరియ్యవట్టె
నీ ఒడిలెకొచ్చి యాభయ్యేండ్లు దాటె
అయినా ఇంగా నీవు నోరిప్పవ్
నీ కొడ్కుకు బుద్ధి చెప్పవ్
ఎండిపోయిన నా కడుపు నింపవ్
దెబ్బతిన్న నా మనసుకు మలాం పూయవ్
నన్ను లూటీ చేయనీకె నాతానికొచ్చిండ్రని
నేను సచ్చినా మీరు పట్టించుకోరని గిప్పుడర్థమైతుంది
అందుకే నువ్వు నా తల్లివి కావ్
నన్ను గన్న తల్లి
నేను నవ్వితే నవ్వే తల్లి
నేనేడిస్తే ఊకుంచే తల్లి వేరే ఉంది
గిప్పుడు ఆ తల్లి తానికే పోత
గిప్పట్సుంది ఆ తల్లినే కొలుస్త

- లింగాకారి మహేష్

# నీ అయ్య జాగిరా?

ముడ్డిమీద ముల్లుగట్టెతోని దండె పొడిత్తె
పోనీ తియ్ నావల్లో అనుకున్న
గుండును పేను గొరిగినట్టు కొరిగితే
అయితేవాయె తియ్ అన్నదమ్ములం
అందరమొక్కతల్లి బిడ్డలమనుకున్న
నా తలగొట్టి పీటెత్తే
గద్దె పొందించిన బేమాన్లు
బొచ్చె తలంల మఱ్ఱిఊడలై దిగవడి
హైద్రాబాదును అర్నమడిగితె
సూది మొనల వదికి కనుగుడ్ల కొలికిల
కలుక్కున రక్తం యింకిపోయింది
దించి పోసిన చంద్రదీపమోలె
బతుకే గుడ్డంగడయింది
నెరిగీలవడ్డ సూపు
అలుకు పిడిసెల అట్టకట్టింది
నరం మీద పుండు మానక
తెలంగాణ తల్లి నుదుట రాసిన దుఃఖం
గవ్వల కండ్లల్ల నిప్పురవ్వలై సిమ్మింది
పరుల సొమ్ముకు పంచలపొంటి కైరత్
పెయ్యం నరం లేని నాలుకల రాజేంద్రుడు
పాయిరాల గుట్టల్ల తలపండు వలిగిన
నిలువెత్తు అహం
అయినా సేపోయోల్లు సెడ నీల్లుతుంద్రు
మా తావులల్ల సర్కారు తుమ్మలై
ఇసుర్కపోయింద్రు
ఎగవడి పాల్దాగి తుంటకొక్కులై బలిసింద్రు
మా నౌకర్లల్ల బూములల్ల
పాములై బుస కొడుతుంద్రు
ఆయువు పట్నంల కాల్లు పాతుకొని
ఎర్రికుక్కల ఎగబెట్ట తెలంగాణను కొల్లగొట్ట
ఫ్రీజోన్‌తో పిసపిస జేత్తంద్రు
అయినా రోకలి దాటిన ఆలాపనలా?
లొట్టి మీని కాకోలె వుట్టి గొర్రుడేనా?
ల్యాత పేగులు లోతుల వడి
డప్పు సెక్కలైన కడుపుల
తలవంచని తంగెడు పువ్వులు
మొదలారని మోతుకు సెట్లు
దుబ్బక తుత్తుర్ల అగ్గిసెండ్లు
దుల్దుమ్మ దివిటీలు
ముల్కసెట్ల కింద ఇన్నూరు సీమల బాటలు
తప్ప ఎటో తేలేదాకా!
తెలంగాణ వానయ్య జాగిరా అని
కాకెక్కిన ఇసిరెల ఆగ్గెలుంచుకొని
ఈసమెత్తు జాగనిడువక
మర్మం దెల్సిన మన మట్టికోసం
మన్ను బుక్కయినా కొట్లాడుదాం

**- పొన్నాల బాలయ్య**

# ఇల్లంత తెర్లయింది కొడ్కా...

ఒకటి చిన్న గీరె, ఇంకోటి పెద్ద గీరె
బండి నడ్వది.. కూలబడ్డది
ఒకటి దున్నపోతు, మరోటి గుర్రం
కాడి సాగది... ఇర్గిపోయింది
కల్సుండాలంటే మనసుల ఇసముండొద్దు
వీనియి దొంగసూపులు
వానియి న్యాల సూపులు
వంగుతె మాయం చేద్దమని వీడు
పెయ్యిమీది అంగిని దొబ్బినా
సోయి లేనోడు వాడు
మరె... ఇగేం కల్సుంటరు బిడ్డా...
లాభం లేదు -
దేవుడు సల్లగుండ... మాగిచ్చిండు
పచ్చని అడవులను, పాలనీళ్ల నదులను
తరతరాలకు తర్గని బొగ్గును
పనంటే పానంబెట్టే గుణమును
కని ఇగురమే లేదు కొడ్కా,
ఇదివరకు ఇంటి దొంగలు దోసి తినిరి
ఇప్పుడు బైటి దొంగలు బరిబాత జేత్తాండ్రి
తెలంగాణ దొంగలుపడ్డ ఇల్లయింది బిడ్డా
ఇగ ఎట్లయితే గట్లయింది
పొత్తు పొస్గనప్పుడు పోరుకంటే వేరే మేలని...
గా పెద్దోడు భీష్ముడు చెప్పలే
గట్లనే చేద్దాం పటు!

**- రామా చంద్రమౌళి**



# నా తెలంగాణ పన్నెండు కెరటాలు

తెలంగాణ తుఫాన్ రాబోతుంది
జాగ్రత్త
మేఘాలు లేకుండానే వర్షం రావచ్చు
ఉరుములు లేకుండానే మెరుపులు మండచ్చు
మేడలు మిద్దెలు గాలికి కొట్టుకపోతాయి
ఫ్రీజోన్‌ల గొడుగులు చట్టాల రెయిన్‌కోట్లు ఏం చేస్తాయి
జాగో... జగావో అంటూ ప్రభంజనం వీస్తుంది
ఇల్లు సర్దుకొండి!
మనసు బూజు దులుపుకొండి
మీ దారి మీరు వెళ్ళండి!

2

పూరికే అలా చూస్తారని
ఎవరో వస్తారని
తెలంగాణ తెస్తారని
పదేపదే తూర్పు చూడటం విసుగేయటం లేదూ
మనమే సూర్యులం కాకూడదు

3

ఫ్రీజోన్ ఏ జోన్
అన్నీ జోనులు మావే
అంగీ చింపి ధోవతి లాగి
ఎంతకాలం అవమానిస్తారు
పట్నమే మాదయినపుడు
ఉద్యోగాలు మీకెందుకూ?

4

కర్తవ్యం చెప్పు
సిద్ధాంతం వద్దు
తెలంగాణ మండుతున్న కొలిమి
మాటలొద్దు
చేతలు చెప్పు

5
ప్రశాంతంగా వుందని ప్రక్క దారి చెప్పకు
నీవు దారి తప్పి మమ్ముల అంగట్లో పెట్టకు
నీ అడుగులో అడుగు వేయటం తప్పు
మాకు దొరల తెలంగాణ వద్దు
జనం తెలంగాణ ముద్దు
6
కాలు కాలిన పిల్లిలా
అలా గంతులేస్తే
తెలంగాణ రాదు
బురద మాటలతో బేరం బెదిరింపులతో
తెలంగాణ రాదు
ఓట్లతో తెలంగాణ లెక్కలొద్దు
నోట్లతో తెలంగాణ బేరమొద్దు
జనం కనులు చింతనిప్పులు
వుడకవిక ఏ పప్పులు
7
మాటలు కోటలు దాటితే
ఏ ఉద్యమం రాదు
గోటితో ఇలా అలా అంటే
పోరాటం కాదు
తెలంగాణ పడి లేస్తున్న సముద్రం
నేడు కెరటం
రేపు ఉద్యమం
8
ద్రోహాలు మోసాలు
అటూ ఇటూ వున్నవే
అసలు శత్రువు నాకు అంతు చిక్కటం లేదు
నా యింట్లో నా ఎలుకలు
తెలంగాణ పేరుతో
పంది కొక్కులయ్యాయి
వేటాడకుండా ఆట గెలిచేదెలా
గోటితో ఆట గెలువదు
గొడ్డలితో సాన చెపుతాను



9
ఆశనిరాశల మధ్య
తెలంగాణ సూర్యుడు
తూర్పుకొండల్లో వున్నాడు
నినాదాలతో కొండలు బండలు కావు
ఆయుధం అనివార్యమైతే
జనం చేతులే ఆయుధాలవుతాయి
10
రక్తం చిందొద్దు
ఏదీ బూడిద కావద్దు
గాంధీకాలం కాదే ఇది
ఆకు కదలటం లేదు
పూవు రాలటం లేదు
అమ్ముడు బోయేది సిద్ధాంతం కాదు
జోల పట్టితే
విస్తరేసి వడ్డించరు
పవిత్రత
పడి లేచినా ముళ్లకెరటమవుతుంది
11
పొత్తులు జిత్తులు
మా ఎత్తు గడలలో లేవు
కత్తులు కటార్లు
నా ఆయుధాలు కావు
మూడున్నర కోట్ల జనం
ఏడుకోట్ల ఆయుధాలు
12
బీళ్లు మావి నీళ్లు మావి
ఎప్పుడో ఓడిపోయావు నీవు
చెట్టుమాది విత్తుమాది
నీడ నీదంటా వేమిటీ
ధర్మం ఓడిపోదు
తెలంగాణ గెలుస్తుంది

- సిహెచ్. మధు

# తెలంగాణ కావాల్నని మంకుపట్టు పడతం

పొట్టి శ్రీరాములు ఆత్మార్పణం
ఆంధ్రరాష్ట్ర నిర్మాణంకై అక్కరకు వస్తే
నాలుగువందల మంది
విద్యార్థి పోరగాండ్ల పానాలు తీసినా
తెలంగాణ ఇయ్యడానికి అక్కరకు రాలేదేంది?
తెలంగాణ సాయుధ పోరాటం
జగమంత మెచ్చుకున్నరు
మీరెప్పుడైన మెచ్చుకున్నరా?
దుగ్గిరాల, ప్రకాశం పంతులును
ఎంత మంచిగా ఆంధ్రరత్న, ఆంధ్రకేసరి
అనుకుంటు సదువుకొని పరీక్షలు రాసినం
ఇప్పుడన్నా మీరు
కోమురం భీమ్‌ను యోధుడని
చాకలి అయిలమ్మను తెలంగాణ సంస్కరణవాదని
ఎందుకు చదువులో పెట్టుతలేరు?
లొల్లి మాదైతే
పంచాయితీ మీరు జేయబడితిరి
సమస్య మాదైతే చట్టాలు మీరు చేయబడితిరి
మీరు ఎప్పుడైన
మా దూప గురించి
మా ఆకలి గురించి పట్టించుకున్నరా
వనరులను కలుపుకోవటానికి
మీరు విశాలాంధ్ర అన్నరుగానీ
మా భాషను కలుపుకున్నరా
మా త్యాగాలను గుర్తించిండ్రా
అంతెందుకు మమ్మల్ని కనీసం పాలివాండ్లుగా చూసిండ్రా
పగోళ్లుగానే చూడబడితిరి
నిజమే కడుపులో బంగారమే
ఆదిలాబాద్ నుండి ఖమ్మం దాక
నల్లబంగారం తరలించుకుపోయి
చిరునవ్వుల్లో మీరు
కై చీకట్లో మేమున్నాం
నిజమే గలాగలా గోదారి
బిర బిరా క్రిష్ణమ్మ పరుగులిడుతుంటే
బంగారు పంటలు మీకు
బంజరు భూములు మాకు!
అమరావతి అందాలు
అద్దాల మేడలో మెరిసిపోతుంటే
మా కోటిలింగాల, ధూళికట్ట
దుమ్ముకొట్టుకొని పోవట్టే
ఇవ్వన్ని మీకు చెప్పుడేంది
అంబేడ్కర్ ఏమన్నడో ఎరికేనా
"ఆత్మ గౌరవం ఆయుధమన్నడు"
అందుకే ఇంగ మేము మంకుపట్టు పడుతం
తెలంగాణ కావాల్నని

**- దొంత భద్రయ్య**

# ఎదురు చూపు

బెదురుచూపుల కోసం కాదు
నా ఎదురు చూపు
పగులుతున్న మనస్సు
రగుతులున్న గుండె
రెండూ ఏకమై
లక్షల టన్నుల శక్తితో
బడుగు జీవుల ఆకలి విముక్తికై
పిడికిలి బిగించి
పిడుగులు కురిపించే
పోరాట యోధుడి కోసం
బెదురు చూపుల కోసం కాదు
నా ఎదురుచూపు
పడుకున్నవాణ్ణి మేల్కొలిపి
కూర్చున్నవాణ్ణి నిలబెట్టి
ఉసూరుమంటున్న జీవితాల్లో
జవసత్వాలు నింపి
జనజాగృతికై ఆకృతి దాల్చి
వికృత మనస్తత్వాలను చీల్చి
ప్రకృతిని పరవశింపజేసే
పవిత్ర ఉగ్రనేత్రుడి కోసం
బెదురు చూపుల కోసం కాదు
నా ఎదురుచూపు
వెనుదిరిగిన వాణ్ణి అదిలించి
తలదించినవాణ్ణి మందలించి
కలవరించేవాణ్ణి కదిలించి
అణచబడ్డ ప్రతి ఒక్కడిలో
అణువణువు రగిలించే
చైతన్య గీతం వినిపించి
స్వార్థపరుల కుత్తుకలపై
తెలంగాణ సైన్యాన్ని కవాతు చేయించి
చంద్రనిప్పులు కురిపించే
ప్రచండ భానుడి కోసం



బెదురు చూపుల కోసం కాదు
నా ఎదురుచూపు
మిణుగురు పురుగుల వెలుగుల్లో
ఉద్గ్రంథాలు చదివేవాడు
మనోనేత్రంతో మోసాన్ని దర్శించి
ధిక్కారగీతం పాడేవాడు
శతఘ్నులకు ఎదురునిలచి
నవశకాన్ని చూపించేవాడు
కోర్కెల సంద్రంలో కొలువుండిన వాడిని
సూర్యకిరణమై నిద్రలేపే వైతాళికుడి కోసం
బెదురు చూపుల కోసం కాదు
నా ఎదురుచూపు
కరుణను మరచినవాడికి
అరుణారుణ కిరణాలను ప్రసరించే వాడు
జారిపోతున్న జగాన్ని
ఉక్కుపిడికిళ్ళలో బంధించేవాడు
పిరికితనంతో బిగుసుకుపోయిన వాడికి
ఖడ్గరాగాలు వినిపించేవాడు
మత్తులో చిత్తయిపోతున్నవాడికి
కర్తవ్య బోధన చేసేవాడి కోసం
బెదురు చూపుల కోసం కాదు
నా ఎదురుచూపు
బతుకుపోరులో చితికినవాడిని
ఆనంద నావ ఎక్కించేవాడు
నవ్వులపాలు అవుతున్నవాడిని
పువ్వుల దారిలో నడిపించేవాడు
గర్భస్థ శిశువుకు సైతం
లోకం పోకడ తెలిపేవాడు
ఆలోచించే వాడికి ఆజ్యంపోసి
అగ్నిపర్వతాన్ని చేసేవాడి కోసం
బెదురు చూపుల కోసం కాదు
నా ఎదురుచూపు

**- మౌనశ్రీ మల్లిక్**

# జంగ్ - ఏ - ఆజాదీ

పిడికెడు మెతుకులే ఆశ
ఆశ ఆకుపచ్చదనం
పచ్చదనం మట్టిలో నీల్లు
నీల్లే బతుకు
బతుకులు ఆగమయినయి -
పటాలున బలిగిన భూమిల కలలు బీటలు బారినయి -
పారే చెమట నొసటి గీతలుగా
మన "కర్మ" బానిసలుగ రాసుకొన్నం -
నమ్మితే ప్రాణాలిస్తం!
నాల్క తీపి జాసిన మనకు విషం సంగతి తెల్వది -
చీమల ఆరాటం బతుకుదెరువు
వాడు వామనుడై పడగెత్తిండు
తలారి ముసుగేసుకొని అమాయకుల్ని ఉరిదీస్తుండు
సావో రేవో అన్నప్పుడు కొట్లాడకపోతే దండగ!
ఈడ కాళ్ళకింద మట్టిగూడా తిరగబడితె కండ్లల్ల బడతది...
ఇప్పుడు మనసుల లోగుట్టు తెల్వాలే -
మంచితనానికి హద్దులు తెల్వాలే -
మనం అధికారం అడుగుతలేం
బతికే అధికారం ఇమ్మంటున్నాం!
తలాపునున్న నీల్లు మనయి...
కండ్ల కనపడి చేతికందినప్పుడు లడాయి జేయాలే -
తల్లిని తిడితే రక్తం సలసల కాగాలే -
నోటికాడి బువ్వను గుంజుకొంటే చేతులే నరకాలే -
నిలువ నీడలేకుంట జేస్తే వాడో మనమో తేల్చుకోవాలే!
పాముల్ని జంప చీమలు జర జర జర వస్తాన్నయి -
పోరుగడ్డ మట్టిని జండాగా ఎగరేద్దాం!
వాళ్ళది అధికారం మనది తిరుగుబాటు -
గెలుపు మనది రేపు మనది -
చలోరే, చలో...
జంగే-ఏ-ఆజాద్! జంగే-ఏ-ఆజాద్!
జై తెలంగాణ! జైజై తెలంగాణ!!

**- విప్లవ్ దత్ శుక్లా**

# గరుడుడి ఆన

శ్వేతాశ్వానికి నల్ల తోక!
మోసంతోనే మొదలయిన బంధనం
బంధుత్వం ఒక మేలిముసుగు
అది రెండు నాలుకల నైజం

బానిసత్వ విముక్తికి ఎన్ని మెలికలు
అమృతభాండమే కావాలట!
మా అణువణువు విస్ఫోటం చేస్తాం
అర అంగుళమైనా రాజీపడతామా

అమ్మా
వీరమాతా!

ఎంతకాలమీ బానిస బతుకు
ఎంతకాలమని ఈ విషనాగులను
వీపున మోయడం

సర్పయాగం సాగించయినా
సంకెళ్ళు తెంచుతాం
నువ్వు స్వేచ్ఛాగానం చేస్తుంటే
మేం ఆకాశంలో చక్కర్లు కొడతాం!

**- పి.వేణుగోపాల స్వామి**

# రండీ.. ఒక యుద్ధం చేద్దాం

మౌనమే అనుకుంటా.. మనల్ని మనల్ని కాకుండా చేసింది
విడిపోని మౌనానికి కాస్తా నీళ్లు వదులుద్దాం
వద్దులే- రెండు అర్థభాషల ఆలింగనం
ఒకానొక సాకీలేని పాటకు పల్లవై
మయూరి బొమ్మయై
కంప్యూటర్ కాపలాగా కొత్త కొయ్య పుష్పమైంది
కళ్లు కాయలు కాసినట్లు నోరు పడిపోయినట్లు
నీడ కూడా లేని ఒంటిని
ఇంటి కప్పుకింద గబ్బిలం రెక్కలయినా
వాక్యసరళీకృతంలో అండర్‌లైన్ చేయబడ్డ
రసాత్మక అక్షర సమూహ మయింది -
వద్దులే సమూహాలు
అన్ని పాయలుగా విడిపోయిన తోవలో
మనిషి ఒంటరి శవాల తోటనే
పరుగెత్తే కాలం ఆహ్వానించింది
పోయేకాలం గ్లోబల్ కాలం ఏమిన్నా
మౌనమే అనుకుంటా మనల్ని మనల్ని కాకుండా
కలవరబడ్డట్లు... కలహబడ్డట్లు...
కలసి వుండకుండా చేసింది-
అవును... ఆహ్వానాన్నీ... అవమానాన్నీ చూశాం
దగ్ధమైన జీవితాన్నీ... నైరాశ నడకను
ఛిద్రమైన బ్రతుకు పతనాన్నీ చూశాం
బాగుంది అనుకంటే, ఇలాగే కానీ
ఒకటికి అటో ఇటో ఎగిరినా సున్నానే మిగలనీ-
వద్దు అనుకుంటె, కాలానికి ముందు పరుగెత్తుదాం
గుర్రం కూడా వెనకబడనీ
వెనుకబాటుతనం... వెకిలితనం... ఇకిలితనం...
లేకితనం... వీటన్నింటి మీద కసితో యుద్ధం చేద్దాం
మనిషిగా బ్రతకడానికి ఒక యుద్ధం చేద్దాం
సాహసంగా, సమూహంగా ఒక యుద్ధం చేద్దాం
రండీ... ఒక యుద్ధం చేద్దాం!

**- జనజ్వాల**



# ఇక మీ కథ ముగిసింది

కోటి లింగాల సంస్కృతి మాది
వేయి స్థంభాల బలం మాది
రాజ్యం మాది... బంగారు భూములు మావి
నీళ్ళుమావి నదులు మావి గనులు మావి ఓట్లుమావి
ఇక ఈ ప్రాంతం వదలండిరా
ప్రాణాలు కాపాడుకోండి.. ఖబడ్దార్...ఖబడ్దార్..
ఇక మీ కథ ముగిసింది ఇక్కడ
తలవంచుకు వెళ్ళిపొండి
మొండెంతో వెళ్ళకండి
హైద్రాబాద్ మాదేరా
హైద్రాబాద్ మాదేరా
ఇది మా గుండెకాయరా
ఇది మా ఆత్మరా
మీ చరిత్రలో ఏమున్నది గర్వకారణం
మా తెలంగాణను మీరు దోచుకోవడం తప్ప
తలవంచుకుని వెళ్ళిపొండిరా!
రాజశేఖర్రెడ్డి, చంద్రబాబు, చిరంజీవి..
ఒక్కొక్కడు మా తెలంగాణా విద్రోహులే
నీళ్లు మావి ప్రాజెక్టులు మీవి
ఓట్లు మావి అధికారం మీది
ఇక మీ ఆటలు సాగవు
ఇక తెలంగాణ కురుక్షేత్రం
కనుమరుగవుతారు మీరు
గల్లుగల్లు గజ్జెలు కడతాం
మీ గుండెల్లో గుబులు పుట్టిస్తాం
ఇది ఫ్రీజోన్ కాదురా.. ఇది మా స్వర్గసీమరా
బంగారు తేనెపట్టు మాది
దాన్ని కదుపు తెలుస్తుంది ఏమిటో
ఖబడ్దార్...ఖబడ్దార్... ఇక ఇక్కడ్నుంచి వెళ్లిపొండి
తలవొంచుకు వెళ్ళండి.. మొండెంతో వెళ్లకండి

**- మియ్యాపురం శ్రీనివాస్**

# ఒక కలం

నేను మాట్లాడటం మానేసినప్పుడు
నా వేళ్ళ సందున శబ్దాన్ని ప్రసవిస్తుందొక కలం
కొన్ని అక్షరాలను ఇంకొన్ని ఆశయాలను
నెమలి ఈక ముద్దాడిన ఏదో పేజీలో వదిలిపోతుంది
మోదుగు పువ్వు పెదవులపై వాలిన
సీతాకోక చిలుకలా గుండె పొరల్లో నిలబడి
నాతో సంభాషిస్తుంది
ఒక వెన్నెల కురిసిన రాతిరి
చుక్కలకు వేలాడి మృత్యువును ప్రేమగా ముద్దాడిన
వీరులకోసం సూర్యున్ని గొంతెత్తి పిలుస్తుంది
దగ్ధ స్వప్నాల బూడిద నుంచి
పైకి లేస్తున్న అక్షరాలను
తెలంగాణ రక్తనాళాలలో విత్తనాలుగా చల్లుతుంది
రెప్పలమీద తుంగభద్ర
కనుగుడ్డు తల వాకిట దీపం పెట్టిన కృష్ణమ్మ
కాని- శిథిలమైన బావుల్లో నీళ్లేవి?
కాలిపోతున్న వరి మడిలో నీటికోసం
వేపచెట్టుకు వేలాడుతున్న పాలమూరు
నడిరేయి వాకిట్లో
ఇంటికి రాని బిడ్డలకోసం
తల్లుల నిరీక్షణ
జొన్న కంకులపై కురుస్తున్న
నిషిద్ధ దుఃఖం తెలంగాణ ముఖచిత్రం
విద్రోహానికి చిగురించిన విషపు నవ్వు
రాసిపోసిన మినుగురు పువ్వులపై మట్టి చల్లింది
ఇపుడు- సింగరేణి వెలుతురు పిట్టకోసం వెతుకులాట
కాలిపోయిన చందమామ
నుసినుసిగా చేతులపై రాలుతుంది
మంచు దుప్పటి పారేసుకొని ఫ్రీజోన్ గడ్డ కట్టింది
ఇక- నిప్పును గురిపెట్టే వేలుకోసం
తెలంగాణ దేవులాట

**- కాశీం**

# అవ్వ గోస

తెలంగాణ బిడ్డెలాలా...! జర రోకు వెట్టుండ్రి....
ఇగనన్న సోయి దెచ్చుకోండ్రి నాయిన!
ఇగురం గల్ల బిడ్డెలు మీరు- వీరపుట్టుక మీది -
ఇంకెన్ని దినాలు తౌసు దీస్తరు కొడుకా....!
ఎన్ని దినాలు గీ ఎంగిలి మంగళం జేసుడు?
అయిందానికి కానిదానికి ఏండ్లకొలె ఎంత నౌశిండ్రు బిడ్డా..!
మాటు వెట్టిన శిత్రకన్ను తోటి
గీడ తావురాలె గాదు, నొష్ట రాతలు మారిపోవట్టె
మాట తియ్యగనే గా మన్సే పాయిదార్లది...
బోల పోకడవొయ్యి బోకెలు శేతికి దెచ్చుకుంటిరి నాయినా...!
పానం మీదికచ్చినా పజీతకు దండ్లాడ్తిరి;
లోగుట్టు దెల్వకపాయె.. దోస్కునే మత్లాబులు దెల్వకపాయె..
నాడివట్టి నానవెట్టే ఇక్మాతులు దెల్వకపాయె...
యాళ్ళపూట గీ బట్టెబాజితనం పశిగట్టక పోతిరి కొడుకా...!
బైరూపులేశాలేశి బద్దుమాశి తొవ్వ దొక్కినోల్లెవలు?
పొత్తుల సంసారం బెట్టి పొగవెట్టిందెవలు?
ముడ్డికి సురుకువెట్టి మూతులు గట్టేస్తున్నదెవలు?
గిప్పుడు తిట్టుగ్గాడ నీభాష నోసుకోలేదంటరా నాయనా!
ఏమన్నంటే 'లొల్లి' కింద వడగొడ్తుండ్రు-
నీళ్ళ గురించి మాట్లాడద్దు, ఎటన్న మల్పుకుంటరు
మనమంత మన్ను బుక్కల్నా!
భూమి గురించి నోరుదెర్వద్దు, యాడైనా అమ్ముకుంటరు
బూడ్డి బూస్కుంటమా!
నౌకిర్ల సంగతెత్తద్దు, యోలనన్న జొర్రగొడ్తరు
అడ్విల బత్కుతమా?
తెలంగాణ ముంచనీకి తొవ్వలన్నీ సాపుంటయి నాయినా...!
అందుకునే జాగల్లనే కాళ్ళల్ల కట్టెలు- మనకేది దక్కది-
ఊరిచ్చుకుంటనే ఏండ్లుగడుస్తయి!
గీ నక్కలెన్నిదినాలు? గీ నక్రాలెన్ని దినాలు?
సాల్‌బిడ్డా సాలు- గీ పాయిదార్లతనం మస్తయింది
ఇగనన్న ఉశారుగండ్రి బిడ్డా...! మనది మనకు దక్కాలె
మునుం బట్టే బరువంతా మీ శేతుల్ల ఉన్నది కొడుకా...!
గిప్పుడిది ఇజ్జత్ కా సవాల్ -

**- మోతుకూరి అశోక్‌కుమార్**

# మరో స్వాతంత్ర్య పోరాటం

చిల్లులు పడ్డది ఓజోన్ కేనా...
తెలంగాణ బతుకు జోన్‌కూ..
ఫ్రీజోన్ ముసుగులో...
అది.. ప్రభుత్వం సెక్యూరిటీ జోన్ !
అధికారం కుట్రంతా
తెలంగాణను అంధకారం జేసుడే..!!
భాగ్యనగరం జోన్ మారినా..
తెలంగాణ 'జీన్స్' మార్తయా...?!
ప్రాంతీయ తత్వం ఎట్లైతది...
దురాక్రమణ పై తిరుగుబాటు బావుటా...!
దేశ స్వాతంత్ర్యం కోసం పోరాడితే- మహాత్ములు
మా నేల తల్లి విముక్తికై
పోరాడితే దేశ ద్రోహులమా...?!
తెలంగాణ రైతాంగ పోరాటం
ప్రపంచ విప్లవ చరిత్రలో ఓ అధ్యాయం !
నాలుగొందలేండ్ల నా హైద్రాబాదు...
నా పూర్వీకుల బహుమానం!
నా ఇలకా.. నా ఖాందనీ ఇనామ్ !
జాన్..జానీ..జనార్ధన్... అన్నదమ్ములం!
తెలంగాణ జాతే మనది !
తెలంగాణా తల్లి పాలు తాగి రొమ్ము గుద్దకుండ్రి!
'జాగో.. తెలంగాణవాదులారా!
భాగో.. కబ్జాదారులారా..!'
జన్మభూమి కోసం.. జన్మహక్కు కోసం
జన్మనిచ్చిన తల్లికోసం జన్మంతా పోరాటం!
మరో స్వాతంత్ర్య పోరాటం!!
మన కూడు తెలంగాణ! మన గూడు తెలంగాణ!
జయహో తెలంగాణ! జయజయహో తెలంగాణ!!

**- సరికొండ నరసింహరాజు**



# 'నడిమిట్లకు తెగాలె'

"నవంబర్ 1 - ఆంధ్రప్రదేశ్ అవతరణ
పొట్టి శ్రీరాములు నిరాహారదీక్ష - ప్రాణత్యాగం"
తెలిసీ తెలియని వయస్సులో ఈ పాఠం వింటే
ఉత్తేజంగా సార్ బోధిస్తుంటే ఒంట్లో రక్తం పరుగెత్తేది
శరీరంపై రోమాలన్నీ నిలుచునేవి
ఏదో చేయాలి ఏదేదో చేసేయాలి
ఉద్ధరించాలి, మంచిపేరు తెచ్చుకోవాలి- ఒకటే తపన
తర్వాతర్వాత- ఆంధ్రా, తెలంగాణ ఒప్పందాలు
'అమాయకురాలితో ఛాలూ బాజిగాడి పెళ్లి' - విడాకులు
తెలిశాక తుస్సుమంది నీరుగారిపోయింది
నీళ్ళన్నింటిని చాపకింద నీరులా గుంజేసుకొని
ఉద్యోగాలన్నింటినీ మన తాన, మనకే ఒక్కొక్క బొక్కేసుకుంట
నమ్మకంగా గుంజేసుకొన్రి సుత్లీ లెక్క వచ్చి - ఛాంతాడయి
ఉరిపోసేదాకా తెల్వకపాయె
నల్లికుట్ల లెక్కచ్చి మంచమంత నాదేనన్రి
అరె! గప్పుడు ఎడ్డోళ్ళమయిపోయినం
ఏమీ తెల్వకపాయే! మనదంటే కాలం ఎల్లిపాయే!
మన కడుపుల పుట్టిన పోరగాండ్లు ఆగమైతుండ్రు
ఏం చేసేదున్నది?
కాదు ఏదన్నా జేయాలె ఏదన్నా జేయాలె
మన పోరగాండ్లను ముందుకెయ్యాల
ఆళ్లైనక మనముండాల
ఇగ్గుడే, ఇగ్గుడు
నడిమిట్లకు తెగాలె!
అటుదటు, ఇటుదిటు

**- తుర్లపాటి లక్ష్మి**

# పదహారో సదికి మళ్లీ చలో!

కొన్ని శతాబ్దాలుగా అబద్ధంగానే బతుకుతున్నా
ఇప్పుడు నిజం చెబ్తున్నా
నేను పదహారణా పదహారో శతాబ్దం బిడ్డని
జర సంజో.. అంట గాని
సంజాయిషీలు చెప్పను
నిన్న మొన్న గాలికి కొట్టుకొచ్చిన నీకు
ఈ గల్లీల గుండె చప్పుళ్లు వినిపిస్తయా?
ఈ మసీదు గోపురాల మీద గిరికీలు కొట్టి
ఆజాదీని నిజం చేసుకున్నవాణ్ణి
నీ డబ్బు మొహం మోహాలతో ముంచెత్తలేవు
రాజ్యానికి మతం రంగు పులిమినప్పుడల్లా
నా పేగుల్ని ఎర్ర తాయెత్తుగా కట్టుకొని
గోలకొండ గుండెల్లో కూడా నిద్రపోయిన వాణ్ణి
నీ కులం కూతలతో నిద్రపుచ్చలేవు
జాగారాలు మస్తు చేసినవాణ్ణి బిడ్డా,
జాగో అని ఢంకా బజాయించేవాణ్ణే కాని
నిద్ర మత్తులో జోగేవాణ్ణి కాను
కాస్త కాస్త అంటూ నువ్వు జరజర పాకిన వెయ్యికాళ్ల పాము
కొంచెం కొంచెం అని బిక్క మొహంతో వచ్చి
నా వొళ్లూ, ఇల్లూ దిగమింగిన వాడివి నువ్వు
నవ్వు మొహం చిందిస్తూ
నా నెత్తుటితో పండగ చేసుకున్న వాడివి నువ్వు
నా మాటల్లో నా అక్షరాల్లో
నీ విషమే రంగరించిన వాడివి నువ్వు
ఇప్పుడు నా గుండె కాయని తెంపి
హైదరాబాద్ నజరానా చేస్తావా?
సంజాయిషీలు చెప్పను సముదాయించి అడగను
కొన్ని శతాబ్దాల అబద్ధాలకి ఇంక సెలవు
పదహారో సదికి మళ్లీ చలో!

- అఫ్సర్

# ఇక్కడ

ప్రపంచంల ఏ మనిషికైన దుఃఖమొక్కటి
ఇక్కడి దుఃఖం వేరు
ప్రపంచల ఏ మనిషైన ఒక్కసారే చస్తడు
ఇక్కడి చావు వేరు
ఇక్కడ తల్లీ పిల్లను
ఊరూవాడను కంటిరెప్పల్ల దాసుకొని
దుబాయికెళ్లే దుఃఖం వేరు
ఇక్కడి ప్రతిభ అడివిపాలవుతున్న సందర్భాలు వేరు
ఇక్కడి మట్టిల బొంగురాలై తిరిగే మనుషులు
ఇక్కడి సొంచెల్ల జీవచ్ఛవాలయ్యే మనుషులు
ఇక్కడి బూమ్మీద అష్టవంకరల బొమికెల మనుషులు
ఈటువడ్డ చేన్లల్ల గొలుకలేరుకుంటున్న మనుషులు
ఎంత మనిషితనం మట్టిపాలైందిక్కడ
మాటకు ప్రామాణిక కత్తిరింపులు వెట్టి
పాటకు యాసల చురకత్తులు చూపి
నదుల నడకలు మలుపుడు
ఎగిరే పిట్ట రెక్కలు ఇరుసుడు

ఎంత భవితవ్యం అగ్నిలో దించబడ్డ దిక్కడ
అందుకే ఈ గడ్డనొప్పిని
గుండెలమీద మోస్తున్న కళాకారు డొక్కడు
జనం తలల మీద
స్వరాష్ట్రకాంక్షా దీపాలు వెలిగిస్తున్నడు

- బూర్ల వెంకటేశ్వర్లు

# మట్టివాసన

మట్టిలో పుట్టి మట్టిలో పెరిగి
మట్టిలోనే బతుకుతున్నోళ్లం
మట్టినే నమ్ముకున్న శ్రమజీవులం
మట్టివాసననే పీల్చుతున్నోళ్లం
సెమటసుక్కలతో సేద తీరుస్తున్నోళ్లం
దారిద్ర్యరేఖకు దిగువన
బానిసలుగా బతుకుతున్నోళ్లం
బాంచన్ దొర! అంటు బతుకుబండిని లాగుతున్నోళ్లం
బడాబాబుల చెప్పులకింద
రహస్యంగా జీవిస్తున్నోళ్ళం
మట్టినే నమ్ముకున్నోళ్లం
మట్టి మా అమ్మ
అన్నం పెడుతుంది ఆకలి తీరుస్తుంది
ఈ భూమి మీద పుట్టినందుకు
అన్నివిధాల ఆదుకుంటుంది
అమావాస్య నిశిలా మా బతుకులు అలుముకున్నయ్
చీకటి బతుకులు మావి ఛిద్రమైన జీవితాలు మావి
కాలే కడుపుకు కాసిన్ని
గంజి మెతుకులను అంటుకుంటున్నోళ్లం
గరీబోల్ల జీవితాలతో నిత్యం పోటీపడుతున్నోళ్ళం
మా జీవితాలు ఇపుడు కురుక్షేత్ర సంగ్రామాలు
మా బతుకులు ఎపుడూ బక్కచిక్కిన అవశేషాలు
నిరంతరం జీవితంతో మా పోరాటం
నిత్యం ఆకలికి ఆరాటం
కళ్లెదుట కరువు విలయతాండవం
కలికాలం మేము శాపగ్రస్తులం
బాధలను భరిస్తున్న బాధా సర్పదష్టులం
మోడు జీవితాలను భారంగా మోసే బీడు పొలాలం!
కరువు జిల్లా కసాయితనానికి
కాటేసిన వలసకూలీలం!!

**- భీంపల్లి శ్రీకాంత్**



# విశాలత్వం మరీ విశాలమయ్యింది

దేశపు గుండెకు మౌనపు పుండు పుట్టింది
అదృశ్యపు చీమలు గుట్టు చప్పుడు కాకుండా
వేర్ల కళ్ళముందే చిగుర్లు కొరికేసినయి

ఎడారి గుడారంలో దూరిన ఒంటె తల
దేహాన్నంతటిని దూర్చి ఫ్రీజోన్ అంటుంది
కాకులను కొట్టి గద్దలకేసిన గ్రామసింహాలు
ఊరును వల్లకాడు చేస్తుంటే
నక్కలు నడినగరంలో గడ్డపారలు నా మీసాలంటున్నాయి

విశాలత్వం మరీ విశాలమై
పిర్ర గిల్లి జోల పాడుతుంటే
నొప్పికి ఊరట తెలవనట్టు
మనలో మనం తన్నుకుంటున్నం
జుట్లు పీక్కొని, పీకల దాకా తిని
'ఓజోన్' పొర రక్షణ ఎంతవరకు
భక్షణ ఎక్కడివరకో తేల్చుకోలేక
కోడి కాళ్ళను కొరుకుతున్నం
కన్నెల కాళ్లు తొక్కుతున్నం
పుట్నాలు నువ్వు తే.. పొట్టు నేను తెస్త
ఇద్దరం కలిసి ఊదుకొని తిందాం అంటే
గొర్రెలోలిగ నమ్మినం
తిన్న పుట్నాలు తిన్న చోటు నాదే అంటూ
పీతాంబరం లేదని ఒకసారి
పిర్రలు లేవని ఒకసారి బొంకుకుంట
దీవెన్ల పేర వంగ దీసి వెన్నుపూసకు
మత్తిచ్చేది కానట్లేదు
గొర్రెలు గోదలు మేకలు మేధలు మనయి
ఫ్రీజోనంట మనింట్ల కుర్చేస్తున్నడు
ఇల్లు ఇలాక చేలు పొలాలు
పోగొట్టుకున్నోళ్ళం

నీటిధార కింద సాలెగూడల్లుతున్నం
గోసల బుడ్డగోసితో మిగిలినం
అన్నిట్ల 'స్టెఫినీ' ఎతుక్కొనేటోడు
బ్లేడ్లమ్ముకోనొచ్చి గుత్తేదారయిండు

మన ఇల్లాలు అందంగుందని
వాడికి సంతు కరువంటే
స్వంత తల్లిని సంతల నిలబెట్టె
సమైక్య వాదులు శాంతికాముకులు
తెలంగాణ పేరుతో సీట్లు అమ్ముకున్నోళ్ల
సిగలు కాదు నాలుకలు తరగాలి
మా జుట్టు నీ చేతికిచ్చినమంటె
నా చూపు నీ ఆయువుపట్టు మీదని తేల్చాలి
అంబను పలికించాలి,
తలకెక్కిన జేజమ్మను దింపాలి
కలపండి కలం గళం
పోరే కాయం లేదు మరోదారి

- జ్వలిత



# ఖబర్దార్

నాలుగు వందల ఏళ్ళ మడమతిప్పని
చరిత్రున్న తెలంగాణా మళ్ళీ కదం తొక్కుతోంది
కాలుతున్న కమ్మరి కొలిమిలా....
మూడున్నర కోట్ల తెలంగాణా ప్రజల
గుండె చప్పుళ్ళు, నగారా మోతలు ఇక చూడు
బోధన్ చక్కెర కార్ఖానా కప్పుడు
వచ్చి తిష్టవేసిన వలసవాదులు ముల్కీలెట్లవుతరు?
మా మంటిలో మట్టెట్లయి కలుత్తరు?
గాజు ముక్కలు మీరు, ఎంగిలి తొక్కలు మీరు
తెలంగాణా బువ్వపై, నీళ్ళపై, మనుషులపై
కన్నెత్తే గతంలోలాగే ముక్కుమూసుకుని
మౌనం వహించే ఎడ్డోళ్ళం కాదుసుమా! తరిమి తరిమి కొడతం
తెగిన బొక్కెన నూతిలదాకా అన్నట్టు మా తడాఖా చూపిస్తం
అరవై ఏళ్ళు అన్నీ అష్టకష్టాలే మాకు
పచ్చదనాలు మీకు ఎండిపోయిన గడ్డి మాకైంది
మందులిచ్చి ఆకలి కాకుండా మా సద్దిబువ్వ
గుంజుకుంటమంటే ఇక నడవది, నడవనే నడవదు కొడుకా?
కాలుతున్న కడుపుమంటల ఆర్తనాదమిది!
మంచో చెడో, చావోరేవో తేల్చుకునే జీవనాదమిది!
ఉద్యోగాల్లో శూన్యహస్తాలు చూపిస్తారా?
రకరకాల మోసాలతో పిల్లనగోవులు ఊదితే
ఇక మేం తలలూపం?
నల్లనాగులై తిరగబడతం, ఎగబడతం? కరుత్తం, కాటేత్తం
పోరాడుతం, మా నేల తల్లికి రక్తాభిషేకం చేస్తం,
మా తెలంగాణా అవ్వకు అండగ నిలబడుతం,
కడిగిపారేత్తం, పిడికిలి బిగించి జై తెలంగాణా అంటం
గుండె లోతుల్లో నుండి ఫైరయితం
ఆఖరి యుద్ధం కోసమైనా రడీగున్నం!!
కాయకష్టం చేసి గటుకతిన్న గట్టిపడ్డ చేతులివి
మీ నాలుగు మాటలకు, నకురాలకు అసలికే కరిగేదిలేదు
మీ మూతులు బిగిత్తం, పిడికిళ్ళు సరిచేసుకుంటున్నం!

-సంకేపల్లి నాగేంద్రశర్మ

# జరా పైలం బిడ్డో!

ఎంత పని చేసితివిరా!
మా ఇంటికొచ్చి
మా బువ్వతిని
మా ఇంటి ఆసాలు లెక్కి పెడితివి గదరా!
మంచోడని పెద్దిరికమిస్తే -
గద్ద ఎత్తుకు పోయినట్టు
మా బుడ్డోళ్ల నౌకరీలు తన్నుకుపోయినవు గదరా!
నీ యవ్వ కడుపుకాలా -
మా కడుపుల్లో మన్నేస్తివి గదరా!

తెల్లదొరలు కడ్డుగాళ్లు అన్నాడు మా తాతా
మీ కంటే బద్మాష్‌గాళ్లా ఆల్లూ?
సూడూ - బాగా సోచాయించుకో
ఈడా నీ నూకలు ఒడిషినయి
ఇప్పుడన్నా నోర్మూసుకొని పో
మా మొగోళ్లు, మా పోరగాండ్లు
మా అక్కసెల్లెల్లు బాగా ఉషారైన్‌రు
నిన్ను గదిమి గదిమి కొడ్తారు
బడ్తలు పట్టింద్రు
జరా పైలం బిడ్డో!

**- యండి ఖలీల్ అహ్మద్**



# వెయ్యి విద్రోహాలు నీకోసం వెతుకుతన్నయ్

జర పైలం కొడుకో, నా కొడుకో కొమ్రన్న
ఒక్క విద్రోహానికే విలవిలలాడిన తెలంగానోడివి
ఇపుడు వేలవిద్రోహాలు నిన్ను వేటాడబోతున్నయ్
రెడ్లకు దడుసుకున్న బ్రాహ్మణ ముఖ్యమంత్రి
ఆగమాగమాయ్యి తెలంగాణను పొత్తులగలిపిండు
తెలంగాణ నిలువకపోతే మాయే, కాని ఒక మంచిపని జరిగింది
ఇక్కడ చిన్నకులపోల్లు సదవకుండజేసే కుట్ర తప్పింది
తెలంగాణ పేరు మీద మున్నూట అరవైమంది
ముక్కుపచ్చలారని తెలంగాణ పోరల పానంబోతే
తెలంగాణ అన్న రెడ్డిదొర తెడ్డు సూపిచ్చిండు
తెలంగాణ రాకపోతే మాయే, ఒక మంచి పని జరిగింది
రాష్ట్రమంత రాజకీయ హత్యలకు ఆలవాలమాయే
అణగారిన కులాల వ్యతిరేక కుట్ర తప్పింది
ఔమల్ల ఇప్పుడు గావాలె అవ్వల్ దర్జా తెలంగాణ
అయినోడు కానోడు అంతో ఇంతో ఇక్కడ సోయికొచ్చింద్రు
దొరల ముచ్చట్లు, దొంగల ముచ్చెట్లు
మాయల ఫకీర్ల మంచి మంచి ముచ్చట్లు
మర్మం తెలుసుకొని మలుగుడు నేర్చుకున్నరు
తెలంగాణ గరీబోళ్ళది, గాయిదోళ్ళది
ఇక్కడ జర ఉబ్బితే ఉత్తగానే సత్తరు
దునియాల గిట్లా ఎక్కడ సావరు, గిక్కన్నె సత్తరు
రైతాంగ పోరాటమని, పది లక్షల ఎకరాలు పంచినమంటే
ఎక్కడున్నదో అని ఎన్కులాడితే ఒక్క ఎకురం దొరుకలే
దీని పొడుగాను-నాలుగు వేలమంది సచ్చింద్రు
భూమని భుక్తని విముక్తని మళ్ళ మొదలు బెట్టిన్రు

ఎక్కువ కులపోల్ల భూమిల ఎర్రజెండాలు పాతిన
చిన్నకులపోల్లకు చిటికెడు భూమి దక్కలే
దీని కడుపు గాల- మూడువేల మంది సచ్చింర్రు
ఇప్పుడు తెలంగాణల గమ్మతి, గమ్మతి జరుగుతున్నది
ఎవ్వడెందుకు తెలంగాణంటాండో ఎవ్వనికి తెల్వది
తెలంగాణ తొవ్వల్ల నాయకుల నసీబు దొరుకుతాంది
జీతగాళ్ళతో బతుకమ్మలు మోయించిన దొరుసాన్లు
ఇపుడు వాళ్ళె మోసుకుంట బజాట్ల తిరుగుతాండ్లు
మందుబందుపెట్టి, మంచినీళ్ళు కూడా బందుబెట్టి ఏతంపడితే
వార్నీ! లక్షమంది కావలంట, ఇరవైవేలు సచ్చుడట
అవును, ఇక్కడ దివానగాళ్ళు పుక్కడికే దొరుకుతరు
నరకుమంటే నరుకుతరు, ఉరుకుమంటే ఉరుకుతరు
చల్, బాగో అంటే బాగో, జాగో అంటే జాగో

పైలం కొడుకో కొమ్రన్న, లొల్లెట్లనో తిరుగుతాంది
ఉచ్చిలోనివి నువ్వు, ఉత్తగనే ఆగమాగం కాకు
ఆంధ్రోళ్ళంత కలిసి హైదరాబాదును ఆగం జేస్తే
ఫ్రీజోనని అన్ని పక్కలనుంచి ఆంధ్రమంత్రులు నూక్కొస్తుంటే
మరి తెలంగాణ నాయకులంతా ఏం జేత్తాండ్లు
వాళ్ళకు నోరులేదా లేక సిగ్గులేదా?
జెర నడిబజాట్ల నిలేసి కదులుబిడ్డా లడాయికి

-కొమ్రన్న



## తెలంగాణ జాతి

ఆకలి! అని ఆర్యులొచ్చి అడుక్కుంటే
రొండు దోసిళ్ల బియ్యం పెట్టింది తెలంగాణ
భూక్ భూక్ అని ఆకలితో నోరు తెర్సినోళ్లకు
బుక్కెడు బువ్వ వెట్టింది తెలంగాణ
వందల రకాల వడ్లను ప్రపంచం మీద సల్లింది
వడ్లకోసం ప్రపంచమంతా తరతరాలుగా తెలంగాణలనే
అడ్డ జమాయించింర్రు
ఆర్యులైనా ఔరంగజేబైనా
బ్రిటిషోల్లయినా అమెరికోల్లయినా
నిజాములైనా ఆంధ్రులైనా
వడ్ల సొమ్ముమే వడ్డీలుగా గుంజి
సామ్రాజ్యవాదులైంర్రు
పెళ్లికైనా బియ్యం అక్షింతలే
సావుకైనా బియ్యం ప్యాలాలే
పాములకైనా ప్యాలాలే
బిచ్చమెయ్యాలన్నా బియ్యమె
ఎవ్వరింటి ముందు నిలవడి అడిగినా
దోసెడు బియ్యమో.. అన్నమో..
మన గొల్ల కొండే! ఈ గోల్కొండ
ఫలక్‌నుమా! తొవ్వలనే బియ్యం బండ్ల బాటలను
కట్టింర్రు తెలంగానోళ్లు
బ్రిటీషోని అడ్డలైన కలకత్తా మద్రాసు నిండా
బియ్యం బండ్ల బాటలే! అడ్డలె!
ఇంట్లోళ్ల కాలం దీరి కన్నుమూస్తే
సావుకు బంగారు వెండి పువ్వులు జల్లుకున్నది
వాల్ల రుణం తీర్చుకోనికే తెలంగాణ
బట్టలు లేకుండా క్లాన్లుగా
వచ్చిన ఇండో యూరపియన్లకు

అయ్యో పాపం బట్ట లేదని
మగ్గం నేత బట్టలిచ్చింది తెలంగాణ
వాలి పక్కన జేరి విశాలాంధ్ర అన్నవారి
మత్లబేందని ఆరా తీసింది తెలంగాణ
ఆంధ్ర అన్నది తెలుగేనా?
మరి 'ఆండే' యాడికెల్లొచ్చె
దెవులాడుకు పోంఢ్రి' అని పురమాయించింది
ఆంధ్ర తెలుగు భాష ఉద్దండులూ
విశాలాంధ్ర కమ్యునిష్టులూ మిమ్లనే అడిగేది!
తెలంగాణ ఒక జాతి
జంబూ ద్వీపపు మూలవాసుల వారసత్వం తెలంగాణ
మూలవాసులదే తెలంగాణ
మూలవాసులంటే తెలంగాణ ప్రజలే
తెలంగాణకు టెరిటరి ఉన్నది
సొంత నాగరికత ఉన్నది
సొంత ఉనికి చైతన్యమున్నది
సొంత తెలుగు అక్షరాల దండ ఉన్నది
అన్నింటిని ఈ ఖండపు మూలవాసులే నిర్మించుకున్నరు
ఎట్లంటవా? ఇక్కడి భూములన్ని మూలవాసులవే
భూమిలో పనిచేసే నైపుణ్యం వారిదే! పనిముట్లు వారివే!
చెమటతో సిరులు, ధాన్యరాసులు పోసేది వారే!
వీరే భూమి బిడ్డలు
వీల్లే కదా జినోసైడు సంపుడుకు గురైతున్నరు
వెయ్యి సంవత్సరాల జిజియా పన్నుల పాలన
తోలుతీసి డోలు కట్టి పన్నులు వసూలు జేసిన పాలనల బతికింద్రు
స్వతంత్రమైనంక సెవులో సీసం పోసి
నాలుక తెగ్గోసి భూమి గుంజుకునె మిత పాలనొచ్చింది
మనువు రాజకీయ పార్టీలన్ని మూలవాసులను
జినోసైడు జేస్తనె ఉన్నయి
సాయుద పోరాటం జమ్మిచెట్టు తొర్రల
ఆయుధాల కథలు ఎన్ని లేవు
సంస్తానాలుగా ఉన్న తుర్క రాజులను జాగిర్లను ఎల్లగొట్టి
మూలవాసుల నుండి గుంజుకున్న భూములకు యజమానులమైదమని
'వీర తెలంగాణ విప్లవ పోరాట పంథా'
పార్లమెంటు అసెంబ్లీలో అవతారమెత్తింది
పార్లమెంటులో మనువు కోడి అయి పొడుగుడు వడ్డది
ముల్కీ రూల్లను పెద్ద మనుషుల ఒప్పందాన్ని
బుర్దల తొక్కి విశాలాంధ్రాక్షోపసయింది
పచ్చల్ల నమ్ముకుంట అగ్గసగ్గ భూముల బ్యారం బెట్టుకుంట
మా భూములను గుంజుకున్నరు
అసెంబ్లీ పార్లమెంటు జుడీషియరి, మిడియాల
దురాక్రమణ చేసిన పెరాసైట్ ఒకటి రెండు కులాలే
మూలవాసులను జినోసైడు చేస్తున్నవి ఈ కులాలే
తెలంగాణకు మేమే రాజులం
భూమంతా మాదేనంటున్న కార్పొరేటు కులాలు ఇవే
భూములను గుంజుకున్న వామన దొంగలు
తెలంగాణ గుర్చి మాట్లాడుడేంది?
ఈ వామనులు రాకముందు భూమంతా
తెలంగాణ మూలవాసి బలి చక్రవర్తులదే
వసల యాస క్లాస్ల కోసమే భాషాప్రయుక్త రాష్ట్రాలా?
హైటెక్, గ్రేటర్, ఫ్రీజోన్ జూటా పెంపుడు పేర్లా?
సమైక్యాంధ్రా, విశాలాంధ్ర విరి సిద్ధాంతాలా?
ఈ సిద్ధాంత సాదన కోసం పోరాటాలా?
పోరాటానికి ప్రాణాలు, నెత్తురు తెలంగాణది కావాల్నా?
వీరు తెలంగాణకూ, దేశానికీ ఎప్పుడూ శత్రువులే
తెలంగాణ ఎప్పుడూ భూమి బిడ్డలదే!
హైదరబాదుతో సహా!!
అరేయ్... తెలంగాణ ఒక జాతిరా!!!

- గోగు శ్యామల

# మొలకెత్తడమంటే...

గుమ్మిలో గుట్టుగా వున్నప్పుడు
ఎంత ఉబలాట పడ్డానో...
బయటి ప్రపంచాన్ని చూడాలని -

గుమ్మిలోంచి
విత్తనాల బుట్టలోకి మార్చిన అలికిడైనప్పుడు
ఎన్నెన్ని కలలు గన్నానో...
చల్లని గాలి పీల్చాలని -

విత్తనాల బుట్టలోంచి
కూలి తల్లి వళ్ళోకి
వళ్ళోంచి ఆమె వెచ్చని పిడికిట్లోకి మారి
నాగేటి చాళ్ళల్లో కలిసిపోతున్నప్పుడు
నా ఆనందానికి అంతేలేదు -
మొలకెత్తే భాగ్యం కోసం
నేను కన్న కలలన్నీ నిజాలౌతున్నాయని

నాలుగు చినుకులు పడి
నా చుట్టూ నేల
తేమతో బిగుసుకుపోతున్నప్పుడు తెల్సింది
మొలకెత్తడమంటే
సర్దుకుపోవడం కాదు!
సంఘర్షించడమని...!!

అవును
తెలంగాణ గావాలంటే
"లాబీ'' జేయడం గాదు
"లడాయి'' జెయ్యాలె!!

- ఇక్బాల్



# మమ్మల్ని మేం ఏలుకుంటం

షెడిపోయి తెగిన గాలిపటమైనోడు
తెర్లయిన బతుకుతోటి
మా పంచెన జేరాలని పాకులాడుతున్నపుడు
పిడ్కెడు పెట్టెతందుకు పిల్చి చేరదీసినం

తిన్నింటి వాసాలు లెక్కవెట్టె తంతరని
యికమాతుగా మనమ్మనమ్మొక్కటని
నీదనీ, నాదనీ తేడా ఎందుకనీ
మైండ్‌సెట్‌కు సమైక్యాంధ్ర వైండింగ్ జేస్తుంటే
మంచితనమే మనదనుకున్నం

మనదంతా తెలుగు గణమని
భాష పేరు మీద బవురూపుల యేషం కట్టి
జోకర్‌గాని తరీక బొంకెచ్చి
తియ్యటి మాటల్తోటి బోర్లకొట్టించింద్రు
యిమానం పమానంలకు యిలువిచ్చేటోల్ల దాతువట్టి
కడుపుల కత్తెర్లు దాసి నోట్లె బెల్లాలతో
కాయిదాలకు ఒట్లు దినిపించి
కల్సుందామని కయిత్కాలాడి
పెట్టిన దస్కత్‌లు ఆరకముందే ఉట్టిది జేసి
యిమానం యిడిసి పమానం పాతర పెట్టిరి

తొక్కుడు బండకున్న ఓపికతోటి
ఒక్క దగ్గరున్నందుకు ఓర్సుకుంటుంటే
మా మంచితనం ఆసరతోటి నిలువూత ముంచుతుంద్రు
రామగుండం బొగ్గుబాయిల్ని పల్లగజేరి
శమట దోసిల్లతో ఎత్తి
యెలుగుల కోసం యెగజల్లుతునే ఉన్నం

నీళ్లు నిలువెల్ల వారుతున్న మా జాగల
బాకీల బాదకు తటారిపోయిన చేన్ల
పాణం కక్క వోసిన ఎంట్రీన్ డబ్బా
రుంగ జట్టుకపోయిన వరి ఉరితాళ్లై
కుటుంబ కుతికెలన్నిటిని హత్య జేసినా
ఊకుంటే ఉసురే సాలనుకుంటున్నం

మా నోటికాడి బుక్కలైన కొలువుల్ని
పీతిరి గద్దలై తన్నుక వోతుంటే
తెలంగాణోల్లమై తెల్లవోతన్నం
ఇంట్ల కటకట కొన ఎట్లతలేదనీ
బిందాసుగ యిడుపు కాయిదం జేసుకొని
ఎవల బతుకు వాళ్లు బతుకవొచ్చునని
చాచా చెప్పిన మాటల్ని యాది తెచ్చుకుంటున్నం

మా బతుకు మాగ్గావాలని
మా బాషను మా యాసను వెతుకుతూ
వీర తెలంగాణ కోసం పోరు జేత్తన్నం

మాది వేర్పాటువాద ఉద్యమమని వెకెల చేష్టలు జేస్తూ
సమైక్యవాదంతో ఓండ్రపెడుతూ
అభివృద్ధి పేరు మీద తెలంగాణ భూములు అమ్ముతూ ఆగంజెయ్యవడ్తిరి

మీతో పొత్తుకూడింది మాది తప్పేఅయింది
గుడ్డు దొంగతనం జేసిన్నాడు
గుంజికొట్టందే బేకారైంది

మా ముల్కిరవాల్ల తల్కాయేదీసిన,
నౌకర్లు దోసుకునుడు సురువు జేసిన్నాడు
నడ్డిరుగ తన్ని బట్టి శేతుల పెట్టందే పాపమైంది

అటెండర్ల నుంచి అధికార్లదాకా అంతామీరై
610ని అమలుగాకుంట తొక్కి పట్టినపుడు
అధికారాన్ని కసరెల్ల తొక్కరిదే కష్టమైతంది



పొత్తుకూడి ఎట్లాడినా
నౌకర్లు, గుంజుకొని
నిధులు నీళ్లు మలుపుకుపోయినా
అన్నింటికి అన్ని దోసుకపోయినా ఊకున్నం
అన్నింట్లా మమ్మల్నే దోషులనగా నిలవెట్టి
హైద్రాబాద్ ప్రజానంటే ఎట్లూకుంటాం

పదవుల పంగనాదూల కోసం
వొంగి వొంగి దండం పెడ్తూ
ముక్యమంత్రి మూతులు నాక్కుంట
అధికారం సంకల జొచ్చి తెలంగాణ తెర్లుజేసే మావాల్లకు
కోదండమేసి ముంత పొగవెడ్తరి
రోకలి బండలతో కొళ్లగుజయేసిపిడికెల తంపిల కాల్చిన కొంకలతో
కమురువాసన రాంగా తెలంగాణ సురుకు వెడ్తం

మీ తాత ముత్తాతల సంతటిల కల్తి లేకుంట వుడ్తే
వాళ్ల మాయిముంతల తావు కాడ్కి పొండ్రి
పొమని పొక్కల తావురమైన పామోలె మలుసుకపంటే
పొగవెట్టి యెల్లగొడ్త
పొగరుతోటి బుసకొడ్తే శిలకొయ్యతోటి బల్లపొడుస్తం

తెలంగాణ సాధనలో
గురిచూసి కొట్టె వొడిసెల బండ్ల, రువ్వడి అవుతం
369 మంది అమరుల సాక్షిగా...
3 కోట్ల తుపాకులమై తెలంగాణ సాధిస్తం
వద్దని అడ్డుపడెటోని తెగ్గొడ్తం
తెలంగాణా గుంజుకొని
మాది మేం ఏలుకుంటం
ఖబడ్దార్ వలసవాది ఖబడ్దార్

- సిద్దెంకి యాదగిరి

# ప్రశ్న - సమాధానం

మిత్రమా!
తెలంగాణ ఆవశ్యకతను ప్రశ్నించావు కదూ!

కాశగడ్డి గుడిశెకు
నిట్టాడైన తెలంగాణోని
కంటిచెరువు దాచిన
రెప్పల కింది అలల
నిశ్శబ్దపు మోత
నీ ప్రశ్నకు సమాధానం

పాలమూరు
లేబర్ వీపులపై లేచిన
అపార్టుమెంట్లను కదిలిస్తే
తడారిన గొంతుక పలికించే మూగరోదనే
నీ ప్రశ్నకు సమాధానం

వలసలతో ఒంటరైన
తెలంగాణ బొండాయి
పదే పదే చెప్పినా నీ చెవికెక్కదు
అందుకే...

మీ మర్రివేళ్ళను
పెకిలించటానికి
ఆ చెట్టుకు అవతలి గట్టునున్న మొలక
తుపాకులను చిగురుస్తోంది
సమాధానపు తూటా నెక్కుపెడుతోంది

- ఎన్. చంద్రయ్య



# తెలంగాణను అమ్మేస్తుండ్రు!

నివద్దిగ మాట్లాడుతున్న
మనం ఇంకేం అకడాయిస్తం
మన జుట్టు ఆళ్ళ సేతుల్ల పట్టుకుండ్రు
గొర్రెల్లెక్క తలలు అంచుకొని
ఇంకా మీ బాంచెనందామా
మీ కాళ్లు మొక్తమందామా
గప్పుడు మన ఇండ్లల్ల అర్రలనిండా అడ్లుండేవి
తెలంగాణల గిప్పుడు కరువు తాండవమాడుతున్నది
ఒట్టొట్టినే ఆగమాగమైపోతున్నం
బిల్‌కుల్ ఇమ్మత్ కోల్పోతున్నం
మన కడ్డు లీడర్లకు ఒర్లుడెక్కువ ఓపిక తక్కువ
ఏక్‌దం అభివృద్ధి జేస్తమంటరు ఎన్నికలప్పుడు
ఎవరు కుర్సీలో ఉంటే ఆళ్ల సంకకెక్కుతరు
ఎన్నికలప్పుడు తెలంగాణా పాట పాడ్తరు
గెలిసినంక పార్టీ మారి
రెండు సేతులా దండుకుంటరు
గెల్సేదాకనే తెలంగాణా
గెల్సినంక ముఖ్యమంత్రికి తానతందాన
కోషిష్ జేస్తరు కుర్సీ ఎక్కి ఖుషీ జేస్తరు
కామయించుట్ల కపాయించిపోతరు
ఎన్నికలల్ల సెడదిట్టి ఎన్నికలైనంక ఆళ్ళల్ల షరీక్ ఐతరు
కీల్సెయ్యి ఆళ్లకు అప్పగించి
మిడిగుడ్లు బెట్టి మిట్కరిస్తరు
గెల్వంగనె టెంపర్ టెక్కు గమండి పెర్గుతది
భూములను అగ్గ సగ్గ కొట్టేస్తరు
దావత్ జేస్తుంటరు
గిప్పుడు ఎమ్మెల్యేలు మంత్రులు తోడెంతో దింటలేరు
లప్పలప్ప దినుకుంట ఎక్కడలేని పోకడ పోతరు
బొంబాటుగ బతుకుతరు
అగడుమల్లోల్లు లొక్కిడాడ్తరు
మాటలన్నీ బరాబరే
మునాఫా లేంది ఏ పనీ సెయ్యరు

వజన్ పెట్టినోళ్లకే పనిజేస్తరు
మాటలతో కడ్పు నింపి సమ్జాయిస్తరు
ఇదేం తరీక
ఏదన్న మంచి చెయ్యంటే చీడ్కొస్తరు
ఒట్టొట్టిగనే నారాజైతరు యాష్టకొస్తరు
ధుమధుమలాడ్తరు పరేషాన్ జేస్తరు
"నీ లెక్కెంత నీ బిసాతెంత" అంటరు
మిడ్సుల్ల మీద సెయ్యేసి నూకేత్తరు
"గింత నీల్గుడా" అని తిరగబడి అడిగినోడికి
గా దాండ్లకు దాండ్ల అమీన్ సాబును పిల్సి
మెత్తగా తన్నించి తాట దీస్తరు
జనం అమీన్ సాబుకు బుగులువడ్తరు
గెల్సినోన్ని సూసి బుగులు వడ్తరు
గెల్సినోడు కొవ్వుబట్టి బలుస్తున్నడు
జాగో జగావో
తెలంగాణ ఓట్లకోసం
ఎన్నికలైందాక పొత్తు పెట్టుకుంటారు
అయిపోంగనే ఒకరిమీదొకరు కత్తులు దూస్తుంటరు
పొద్గాల్నే మందు గావాలె
పొద్మీకి మందు గావాలె
జనానికి దూపైతే మంచిలీల్లు లేవు
ఆకలైతే రోకలి మింగాల
దొడ్డుబియ్యం సుక దొర్కుతలేవు
ఎవుసమంతా లుక్సానే
బీమార్ పడ్తే సర్కార్ దవాఖాన్ల మందుల్లేవు
అన్నదమ్ముల తగాదాలకు భూకొట్లాటలకు తశ్వ జేస్తరు
ఎక్కడి భూములూ కబ్జ జేస్తరు
నేతలు బొక్కసంకు పొక్క బొడుస్తరు
లంగ దందలు జేస్తరు
దండుకున్నోడికి దండుకున్నంత
తమ కుటుంబాల కడ్పులే గాని
ఎన్నుకున్నోళ్ల కడ్పులు జూడరు
తెలంగాణల కైకిళ్లా దొర్కుతలేవు
బీదోళ్లు ఏం దినాలి ఎట్ల బత్కాల
జనాలు తరాస్ కొస్తుండ్రు
సచ్చీసెడీ సదువుకున్నోళ్లకు
కొలువులు దొర్కుతలేవు
గద్దల్లా తన్నుకపోతున్నరు
ఏమనుకోకుండ్రి బై నేను జర కడక్‌గా మాట్లాడ్త
అది నా ఆదత్
తెలంగాణను అమ్మేస్తుండ్రు
సెజ్జులకు కార్పోరేట్లకు
తెలంగాణను అమ్మేస్తుండ్రు
సూస్తూపోతుంటే మేస్తూ పోతున్నరు
సడక్‌లను గుడ్క అమ్మి పారేస్తున్నరు
సడక్‌ల మీద బస్సులల్ల బోయినా
పన్ను కట్టి తీరాల!
గిప్పుడు హైదరాబాద్‌ను ఫ్రీజోన్ అంటుండ్రు
గిది తెలంగాణ విద్రోహం
హైదరాబాద్ ఆత్మను సంపేస్తుండ్రు
హైదరాబాద్ మీ తాత జాగీరు కాదు
మన నాయకులు మజ్జుగాళ్లు సోయిదప్పినోళ్లు
లంగగాళ్లు లత్తుకోరుగాళ్లు సన్కి నా కొడుకులు
కుక్కలకు బొక్కలేసినట్టు
కుర్సీలిచ్చి కూర్సుండ బెడ్తే
తెలంగాణ లేదు గిలంగాణా లేదు
తెలంగాణ బొప్పలు మంచోళ్లు గమండితనం లేదు
అలాయి బలాయి జేస్తరు ఒట్టొట్టిగ గుస్సాడరు
మర్లబడి బడితెలు తిరగేసేదాకా సూడొద్దు
సిన్న రాష్ట్రాలిస్తే కేంద్రం కొంపేం మున్గిపోదు
నువ్వెన్నన్న జెప్పు
గిప్పుడున్న నాయకుల్తోని తెలంగాణ రాదు
తెలంగాణ పుణ్యానికి రాదు
అందరూ లగాయించి లాసిన ఒక్క కంఠంతో
తెలంగాణ కావాలని అరిస్తే అస్తది
ఐకోల్లు నడుం కట్టి రంగంలో దిగి
కంద్రెర జేసి రక్తం సుక్కలు ఒడిపి ఉద్యమం జేస్తే అస్తది!

- ఎ. సూర్యప్రకాశ్

# గిట్ల తెల్లారబట్టే

గాలె పనిముట్ల సప్పుడుకి
మా సంటిది నిద్ర లేత్తది
ఎంత లొల్లి జేసిన
గుక్కెడు పాలు ఇయ్యదాయె
ఏందే? కూసిన్నియ్యరాదె! నా నోట్లోకెళ్లి రాకముందే
బల్లున ఏడుత్తది ఏమున్నయని, ఏమియ్యనే..
నారగతమంతా ఇంకిపాయె
పిడికెడు ముద్దకు కరువాయె
ఛీ! గీ బతుకుపాడ్గాను
ఒక్కసారే సత్తెబాగు పానానికి ఆయిగుండు

ఫీచరులేదు ఫ్యూచరూలేదు
ఫాస్ట్-ప్రజెంట్ ఏంజెప్పాలె?
ఏముందని ఏంజెప్పాలె?
అన్నింటకీ కామన్గా కరువేనాయె

"నానెత్తి మీదుగా గానాల్గు పస్పుగింజలు పడ్డసంది
గిదిగో గీతల ముగ్గు బుట్టయ్యేదాక
గుక్కెడు గంజి మెతుకులైనా
ఏరోజుకారోజు ఎతుక్కోకుండా
కంచంలో చూసామె?
నెత్తిమీద తట్ట మోసిమోసి
ఎంటికలూడి పిచ్చిదానిలా
చావనే బతుకుతున్న తూ: నాదీ బతుకేనా?''



నెత్తి నోరు కొట్టుకుంట
మాట్లాడ్తది మాఇంటిది
మౌనమే సమాధానమవుతెందెప్పుడూ

తొందరగా తెమలవే చుక్క గూకింది
పొలంబోయేసరికి తెల్లంగా తెల్లారుద్ది
ఎండ సురువు జేత్తున్న రోజులాయె
మధ్యాహ్నం ఒల్లు బెట్టకొట్టినట్టు
పానమంత ఆగమవుతది
కుడి బుజానికేస్కున్న నాగలిని
ఎనుకనుంచి యెనుక నుంచి
ఎడం బుజానికి మార్చిండ్లు ఆ పల్లెంకులు
చెప్పుకోడానికి మనిసే మరి చూడ్డానకి...???
ఎముకలు కొన్ని పోగేసి
గొంగడి కప్పినట్లున్నడు
చస్తూ గూడ, పొలం బొయ్యేస్తడు
పొలంల పంటై మొలకెత్తిన వాడినోట్లో
ఏనాడు నాల్గు మెతుకులు పడ్డ పాపాన పోలే

బతుకులన్నీ గిట్ల తెల్లారబట్టే
వూరికొక కుంపటి పొలాలన్నీ బీడుపడి
బతుకులన్నీ చిద్రమాయె
ఏఇంట్లో సూసినా పిల్లిలేవని పొయ్యిలే
కట-కట కన్నీళ్ళు కార్చుకుంట
మౌనరతం చేస్తుండె తెలంగాన తల్లులు గిదీ తెల్లారని
తెలంగాణ పల్లె గోస

**- ఐనాల సైదులు**

# పాకే రహేంగే తెలంగాణ!

మాన్ తా హూఁ... మై
ఏక్‌హీ కితాబ్... ఏక్ హీ ఖుదా...
చాహ్‌తాహూఁ... మై
ఇస్ ధర్తీ కో సబ్‌సే జ్యాదా...
ఏ మిర్తీ హమారీ
హజారోఁ.. లాఖోఁ... షహీదోఁసే భరీ హై...
ఏ లాడాయీ హమారీ బహుత్ హీ పురానీ హై....
బరితెగించి దొరలతో బరిలో నిల్చి పోరాడిన
'బందగీ' వారసత్వం మాది!
కలాన్ని కత్తిలా మలచిన
'షోయబ్' స్ఫూర్తిని ఆక్సిజన్‌లా నింపుకున్న జాతి మాది!
క్యా బద్ నసీబీ హై! హమారీ?
మా నేల మాక్కాకుండా పోయింది
మా కళ్ళ ముందే పేకముక్కల్లా పంపిణీ జరుగుతోంది
మా నీళ్లు - మా బీళ్లకు దూరమైనాయి
పక్కవారి పొలాల్లో బంగారాన్ని పండిస్తున్నారు
మా భాషను గోస పెడ్తున్నారు మా యాసను వెక్కిరిస్తున్నారు
మా వేషానికి ముద్రలు వేస్తున్నారు
'సెజ్'లంటూ షోకులు పడ్తూ మా సేద్యాన్ని సంకనాకిస్తున్నారు
'అభివృద్ధి' అంటూ మా భూముల్ని, మా పోరల ఉద్యోగాల్ని
కార్పోరేట్ కంపెనీలకిస్తున్నారు
మేము - మా భూమికోసం - భుక్తికోసం తెలంగాణ విముక్తి కోసం
నిలబడి కలబడితే ప్రత్యేకవాదం ప్రమాదమంటూ
సమైక్యతే సౌభాగ్యమంటూ సొల్లుకబుర్లు చెప్తున్నారు
అబ్ నహీఁ చలేగా! నహీఁ చలేగా...!
కష్టాలు కన్నీళ్లూ మాకిచ్చి కలర్‌ఫుల్ కథలు చెప్పే కొడుకా!
కలిసుందామనే మీ కుట్రల్ని కూకటివేళ్ళతో చీల్చేస్తాం!
నీ కల్లబొల్లి కబుర్ల కోటను కూల్చివేస్తాం!
అబ్, లేకే హీ రహెంగే తెలంగాణ!
పాకే హీ రహెంగే తెలంగాణ!

**- సయ్యద్ ఖుర్షీద్**

# రండి రణములో దిగుదాం

అందరమొకటయిన అతిగాను నమ్మించి
మాయమాట చెప్పి మభ్యపెట్టి
దరికి చేర్చుకొనియె తెలంగాణ ప్రాంతాన్ని
వలసవచ్చినట్టి వలసవారు!

బ్రతుకు దెరువు కొరకు మెతుకు లేకను వారు
ఏరుదెంచెవారు జాగులేక
తల్లిపాలు లేక తాలలేకను బిడ్డ
సవతి తల్లిపాలు చీకినట్లు!

మొదట మెతుకు కొరకు మన దరిన చేరి
అటు పిదపగ అవని నాక్రమించి
మనదు వనరులన్ని మోసుకెళ్తునువుంటె
చూసుటేల మనము గుడ్డమాలి!

జలము కొరకు వారు జలయజ్ఞమును పెట్టి
తీసుకెళ్తుండె తెలివితోటి
బొగ్గు కొరకు వారు భూమిని తోడుతూ
మంట గల్పుతుండె మనదు బ్రతుకు!

భాగ్యనగరము మన భూమిన ఉండగ
వారి దనియు వారు విర్రవీగి
పరిపరివిధముల ఫ్రీజోను పేరుతో
తీసుకుంటు వుండె తల్లి భువిని

ఆంధ్రవారి వల్ల అన్ని విధంబుల
పొంచి ఉండెమనకు ప్రాణహాని!
తరిమికొట్టుదాము తొందరపాటుగా
తెల్లదొరల మనము తరిమినట్లు...

రండి రండి వేగరణములో దిగుదాము
చాకలైలును మనకేక జేసి..!
కొత్త నెత్తురు మన కాళన్నదిగజేసి
దొడ్డికొమరును మనకడ్డి చేసి..!

**- జంగిడి రాజేందర్**

# మసిబారిన జాడ

నా ప్రాంతం స్వేచ్ఛారాజ్యం రెక్కలు దాల్చకమునుపే
నిండుగర్భంలో పురుడు పోసుకోవటానికి
సిద్ధమైన ఆశల పిండం
పురటినొప్పితో అలసిన నేల
పుండుబారి రోదిస్తున్నా పట్టించుకునే
నాధులు లేక అనాధై మిగిలిన కేక నా ప్రాంతం
కాలం విసిరిన బాణా సంచాలు
పేలి మిగిల్చిన బూడిద చాటున
మసిబారిన నల్లని గాయం నా ప్రాంతం
కుట్రలతో రగిలిపడ్డ రాళ్ల దెబ్బలకు
వీపు అడ్డుపెట్టి తలదాచుకున్న
కమిలిన ఎర్రటి దేహం నా ప్రాంతం
మోజుబారిన కొత్తబూట్లు
నడిచి నడిచి తూట్లు పడ్డ
పాత ఇంటి పాక్కిలి నేల నా ప్రాంతం
రాత్రి పగలు నిదురకాసి కేకలేస్తూ అలసిపోయిన
బొంగురు గొంతుక నా ప్రాంతం
విషజీవులు క్రూరమృగాలు కొరికిపట్టి కాట్లు విడిచిన
కన్నీటి గాథ నా ప్రాంతం
హృదయ రోదన కక్కుతున్నా ఓదార్పు లేక
వెక్కి వెక్కి ఏడుస్తూ తప్పిపోయిన మార్గం నా ప్రాంతం
విషప్రళయపు చిక్కుముడులను
పెకల్చడానికి వ్రేళ్లు చాచిన హస్తపు కేడెం నా ప్రాంతం
వెలుగు జాడకు ఎడారైన తడారిన నాలుకపౌ
గుచ్చుకున్న సూదుల పోట్లను ఎదురోడిన
శ్రమ గుండెల రక్తపు జాడ నా ప్రాంతం
గతమంతా మొరతు తనమై
పసి పాపలకు ఉక్కుబలమై
నిప్పు కణాలపై నడుస్తున్న
వెండి ఆశల సౌధం నా ప్రాంతం

**- పి.వనజ**

# గుత్పనందుకుందాం

రండి - అందరూ రండి! పరిగెత్తక రండి!!
ఉద్యోగాలు పందేరం
హైద్రాబాద్ ఫ్రీజోన్!
హైదరాబాదీలే కావల్సినవసరంలేదు
ఎవరైనా రావచ్చు
లోకల్, నాన్‌లోకల్ వర్తించదు
దీనికొక్కదానికే మినహాయింపు
పోలీసులతో మొదలు
నోరెత్తకపోతే - నోరు తెర్వకపోతే అన్ని శాఖల్లో అమలు
కనీసం లాఠీ పట్టుకుందామన్నా టోపీ పెట్టుకుందామన్నా
వీలులేదు - తెలంగాణకు రాదు
"తినుడు లేదు - పంటల కాలం లేదు
బాడీ వీక్ - హైట్ లేదు
పరుగెత్తరాదు - పని చెయ్యరాదు తెలివికి లేరు
పైసల్లేవు - పెద్ద స్కూళ్ళలో సదువులేదు
ఏడ సెలక్టయితరు!? అనుకుంటాం"
ఎండ్ల పనికిరావని ఎల్లగొట్టుడే!
ఏందండి? అట్లా మాట్లాడతారు?
మాకు మాత్రం జ్ఞానం లేదండీ?
అయ్యో! మళ్ళీ గదే భాస రావట్టే!
అండి - తొండి అనవడ్తిని!
మరి- పుట్టినసంది సచ్చేదాక
గాళ్ళ సోపతేనాయే!
గదే ముచ్చటాయె - గదే మాటాయె
ఇగ - యాడికి మందలవడ్తం?
అందుకే క్యాలికద్దాం
గుత్పనందుకుందాం
దునియా సూపిద్దాం
'ఫ్రీజోన్' అన్నమాట
ఫియర్ జోన్ చేద్దాం

**- ఎనిశెట్టి శంకర్**

# తల్లీ... నీ పాట పాడలేను!

తెలుగు తల్లీ, నువ్వే మా తల్లివని
సల్లంగ చూస్తవనీ తన్మయంతో
ప్రార్థన్లో మా పిల్లలు నీరసంతో
నేలకూలుతున్నా ఆలపిస్తూనే వున్నరు....
ఎన్నోసార్లు నీ రూపం చూస్తున్నప్పుడల్లా
ఎక్కడన్నా మా అవ్వ పోలిక లేవనిపిస్తూనే వుంది
మా కడుపునింపని నీ సవతి తల్లి ప్రేమతో
ఆంధ్రుల కల్పవల్లిగా మారిపోయినవ్
నీ తలపై దగ దగా మెరిసే ఆ కిరీటం విశాలాంధ్ర విషకౌగిలిలో
తెగిపడ్డ తెలంగాణ ఆడపడుచుల తాళిబొట్ల కాంకర్యమే ననిపిస్తున్నాది...
సమైక్యాంధ్రలో కొల్లగొట్టుకుపోయిన మా తెలంగాణ సిరులన్నీ నీ మెడలో
ముత్యాల హారాలై మిరుమిట్లు గొలుపుతున్నవి!!
నీ చేతుల్లోని పూర్ణకుంభం తరలించుకుపోయిన కృష్ణాగోదారి జలాలతో
పండించుకున్న బంగారు పంటలేనని
బీడుపడి వలసపోయిన నా పాలమూరు
ఫ్లోరిన్ నీళ్ళ విషాన్ని మింగిన నా నల్లగొండ
వెన్ను పూసలన్నీ నీ నడుముకు వడ్డాణమైతే
ఎండిన డొక్కల్ని చీర కొంగుల్తో
గుంజి కడుతున్నది నా తెలంగాణ తల్లి...
నీ ఆటపాటలతో మా చెవులు రింగుమంటూ మా యాస
వెక్కిరింతై మా పాట ఏవగింపై
మా రుచులన్నీ ఆంధ్రా మెస్సుల్లో
ప్రియా పచ్చళ్ళలో సాంబారు పౌడర్లలో ఆవిరైపోయినయ్
పోలవరాలు, పోతిరెడ్డిపాడులు, పులిచింతలలు చింతల్లేని
మీ బతుకు కోసమైతే
పోలేపల్లి సెజ్‌లు, రింగురోడ్డులు, ఓపెన్‌కాస్ట్‌లు, సిక్స్‌టెన్‌లు
ఫ్రీజోన్లూ తెలంగాణ తల్లికి ఉరితాళ్ళైతుంటే
తెలుగుతల్లీ! నీ పాటనే పాడలేను!
తెలంగాణ తల్లి గుండె గాయాల్ని మరిచిపోలేను!!!
ఆంగ్లాంధ్రాపత్యాన్ని సహించలేను!!

- సహచరి



# హెచ్చరిక

ప్రత్యేక హెచ్చరికలతో
అహింసా మార్గదర్శకత్వంలో సాగి
దుందుభి జయశంఖారావా నాదాలతో విజృంభించి
ఆంధ్రప్రదేశ్ అగ్నిగుండంగా మార్చుతాం!
'జాగో - జగావో' - మా కృతనిశ్చయ నినాదం!
తెలంగాణ కోసం చావో రేవో తేల్చుకుంటాం!
మా మాటలే తూటాలై వదులుతూ
జాగో - భాగో  నినాదమిస్తూ -
తెలంగాణవాలో చలో అంటూ
మా తడాఖా ఏమిటో నిరూపిస్తాం!
మన విజయభేరి జయశంఖారావ
నినాదాలతో హెచ్చరికలు చేస్తూ
ప్రత్యేక తెలంగాణ సాదిద్దాం -
ఇదే మా ప్రమాణం
తెలంగాణ ఇవాళ గర్జిస్తున్న గడ్డ
ఇంకా సహించడం మా వల్ల కాదు

- నమిలికొండ జగన్ మాధవరావు

# చలేజావ్... చలేజావ్

నా కంట్లో కారం కొట్టి నా నోట్లో మన్ను బోసి
నా జమీన్లకు అధిక ధరలు ఎర తొడిగి నన్నాక్రమిస్తున్రూ
కాలు మీద కాలేసుకొని తొడగొట్టీ మీసాలు తిప్పుతున్రు
నన్ను గులమును చేసుకొని దర్జాగా చలామణి అవుతున్రు
తెలంగాణ ఎవడిదిరా! హైద్రాబాద్ ఎవడిదిరా! నాదేరా...నాదేరా
తెలంగాణ మేరా హై చార్మినార్ మాదేరా
హైకోర్టు... ఉస్మానియా దవాఖానా
పురానాపూల్... లకడికపుల్ మదీనా మేరా హై అసెంబ్లీహాలు...జూబ్లిహాలు
ఉస్మానియా, నిజాం కాలేజీ నా చదువులకు నిషానీలేరా
నాది-నాదికాక నీదట్ల అవుతుంది?
అంసాతం నాది...పంతం నాది చివరికి విజయం నాదేరా
చలే జావ్... చలేజావ్
ఏ జాగీరు హమారా హై
ఏ మేరా హై జమీన్ నాది నాకిచ్చెయ్
చలే జావ్... చలేజావ్
ఇమ్లీబన్ మేరా హై బాగే ఆమ్ మేరే హై
హుస్సేన్‌సాగర్... టాంక్‌బండ్ మాదేరా... మాదేరా
మూసీనది మీద భాగ్యనగరం మాదేరా... మాదేరా
గోల్‌కొండ హమారా హై గోల్‌మాల్ తేరా హై
ఇక రాజకీయ చదరంగం ఆటలొద్దు
చలేజావ్.. చలేజావ్
కరువు రాక్షస కాటుకు బలై పచ్చదనం - ఎండిన మా పల్లెలు
మాడి మసైనా కొమ్మల మీద రెమ్మలు
బీడై ఎరుపెక్కే పడావ్ భూములు సబ్‌కుచ్ మేరా హై
చలేజావ్.. చలేజావ్
పెద్ద మనుషుల్లో ఒప్పందం పెండ్లి నాడే కుదిరింది
మన మధ్య సంసారం ఇక పొసగదు
మంచి ఘడియలొచ్చాయి- ఇక విడిపోదాం -
చలే జావ్! చలే జావ్!

**- మహమ్మద్ హనీఫ్ అలీ**

# పసిడినవ్వుల తెలంగాణ

అడగడుగునా సంకెళ్లు... ఆత్మ క్షోభకిది అగ్నిపరీక్ష
ఆక్రోషం ఆగ్రహం ఆశయస్ఫూర్తికి ఆరాటం
విసిగి వేసారిన విద్యార్థి గళం విలయతాండవము
కన్నతల్లుల కడుపుశోకాలు తెలుగు తల్లికి మౌనపరీక్ష
రాజుకున్నది రణరంగపు కుంపటి...

**- వేముల రమాదేవి**

# సునామి

తెలంగాణ గడ్డను పుట్టిన గడ్డి పోసను నేను
తెలంగాణ రాష్ట్ర సాధనకై మారనున్న గండ్ర గొడ్డలి నేను
తెలంగాణ చెలకల సెలిమెల నీటి బిందువు నేను
తెలంగాణ రాష్ట్ర సాధనకై మారనున్న సునామిని నేను

**- బి.శ్యామ్‌సుందర్ గౌడ్**

# తెలంగాణ శాపం

మొన్నటివరకు యాదికొస్తుండేది
పల్లె యాతరలు,
పీర్ల పండుగలో హిందూ, ముస్లింల
ఐక్యత యాది కొస్తుండేది!
మా నిజాం సాగర్ అందాల
సోయగాలు సూస్తుంటే పసందుగా ఉండేది!
ఇయ్యాల నిజాంసాగర్‌లో నీళ్ళు లేకుండా చూస్తున్నా!
కల్లు ఈదులు పోయి రాజకీయ కబ్జాలైనవి
పరాయి ప్రాంత పాలనమయమై
తెలంగాణకు అన్యాయం సేస్తున్న
వారి తోలు తీయాలి
తోడుకలు యేలాడ ఎయాలే

**- అయ్యవారు మురళి**

# నేల స్వేచ్ఛకోసం

నీళ్ళు నింపిన మోతుకు దొప్పలల్ల
మన ముఖం అస్పష్టమైన చోట
మేల్కొనడం యుద్ధం చేసిన బరాబరి
కండ్లల్ల కలల తడి ఆరిపోయిన చోట
నినాదాల తొవ్వెంబడి గుంపులు గుంపులుగా నడవడం
మట్టి రెండు చేతుల్ని చాపి
స్వాతంత్ర్యం కోసం విలపిస్తున్నప్పుడు
అనుభవాల్ని నిజం చేసుకోకపోవడం నేరమే అవుతుంది
ఇంకా ఎంత కాలం దుఃఖపు పాటల్ని
గాయపడ్డ పావురంలా భుజంమీద మోసుకొని తిరుగుదాం?
కాష్టం మంటల మధ్య నిలబడి
కన్నీటి ధారల్ని అర్పిద్దాం?
ఈ నేలను పొక్కిలి చేసి లేపిన
ఆకాశ హర్మ్యాల మధ్య
పిట్ట పిల్లల లెక్క ముడుచుకొని పండుకుందామా?
పట్టుకోవాల్సిన సమయంల
దివిటీని చేతులల్ల ధరించకుండా
ప్రమిదలోని వత్తులమై కాలిపోవడమేనా
స్వప్నాల్ని దాచేసుకొని
మనసుకు గాయాలు చేసుకుంటూ
సమూహాలు కూడలిలో కూడుతున్న చోట
నిలబడక జారుకోవడం మట్టికి చేసే ద్రోహమే
నా సారవంతమైన పచ్చదనాన్ని మేస్తూ తిరుగుతున్న
ఎండ్రకాయల మధ్య సహజీవనం చేయడమంటే
గొంతుల్లోకి గడ్డపారలను గుచ్చుకోవడమే
ఇకనైనా స్వేచ్ఛా పరిమళం కోసం
దర్వాజల్ని తెరుద్దం
అరల్ని ఒడిసి పట్టుకొని కలల సాకారం దిక్కున నడుద్దాం
గొంతెండ బెట్టుకుంటున్న జీవికింత
తడందిద్దాం

**- వేముగంటి మురళీకృష్ణ**



# love at regional milestone

హైద్రాబాద్ - 2007
ఒక పాత సాయంకాలం
పసుపు పచ్చని కాంతిలో ఆమెను చూసినప్పుడు
మా బాల్కనీలో బంతి చెట్టులా కన్పించింది
ఎవడేసిన విత్తనమో గానీ
'బాప్రే... ఐటమ్ బోలేతో ఐసా రెహనారే' అనుకున్నాను
ఆ తర్వాత - పరిచయం - కాఫీ షాప్ -
ఫోన్ చాటింగ్ - అండర్‌స్టాండింగ్ - లవ్
ఆమె నాతో డేటింగ్ కొచ్చినప్పుడల్లా
పచ్చి 'వొడ్కా' ఎత్తి కొడ్తున్నట్లుండేది!
ఆ తేనె పెదాలు విచ్చుకున్నప్పుడల్లా
నా మనసంతా మత్తుగమ్మి - మంత్రించినట్లుండేది!
షార్ట్‌కట్ జమానాలో మా లాంగ్‌టర్మ్ గోల్స్ ఎన్నో...
ఆ రోజులు చాలా ఇష్టం... చాలా చాలా ఇష్టం!

ప్రి - మారిటల్ సెక్స్ గురించి నే గిల్లితే -
'పో... ఛే, త్వరగా పెళ్ళి చేస్కో, ట్విన్స్‌ని కందాం' అనేది
'మూన్‌లైట్‌లో మీ గోదావరిని చూడాలని ఉంది' అంటే
'చలం - మైదానం చదివావుగా' అనేది
ఎప్పటికీ తెలవరాని తెలంగాణా కథ తనకి చెబితే
తల్లడిల్లిపోయేది!
'ఫ్యూచర్ మీదేపో' అని నల్లజాతిని ఉదహరించింది
మీరు 'లోకల్ బ్లాక్స్' అని ప్రకటించింది!
అప్పుడామె నాకు ఓ లేడీ నోస్ట్రాడామస్‌లా కన్పించింది.
ఎప్పుడైనా సపరేషన్ గురించి టాపిక్ వస్తే మాత్రం -
'హే.. కమాన్ యార్, ఐయామ్ ఎ గ్లోబల్ పర్సన్' అనేది

మా వాళ్ళతో వరుసలు కలిపేది
మా ఇంటి బతుకమ్మలో తంగేడు పూవునవుతాననేది
'అత్తమ్మగారూ... ఆరోగ్యం జాగ్రత్తండీ'
అనే తన ఫోన్ పలకరింపుకు -
అమ్మ తెగ సంబరపడిపోయేది!

హైద్రాబాద్ - 2009
ఒక కొత్త సాయంకాలానికల్లా
సగం కూసిన ఆ కోయిల -
ఏ చెట్టు మీదికో ఎగురుతూ వెళ్తోంది
నేనెవర్నో తెలీనట్లే - తిప్పుకుంటూ వెళ్తోంది!
మై ఫుట్
వంద ప్లాస్టిక్ సర్జరీలు కావాలి -
ఆమె చెంపలపైనున్న నా ముద్దుల తడి ఆరడానికి!
ఏడు సముద్రాలు కావాలి -
నేను మాత్రమే కన్పించే ఆ రెండు కళ్లని కడుక్కోడానికి!
'హనీ... వాట్జప్...?' .. అని లెక్కలేనన్ని సార్లు అడిగాను
అడిగినప్పుడల్లా ఏడ్చింది!
వెయ్యి 'సారీ'లు చెప్పింది
రీజన్ మాత్రం ఒక్కటే చెప్పింది
'నీది మా ఏరియానే అయితే ఈ గొడవే ఉండేది కాదు
నాలా మా నాన్నగారు గ్లోబల్ పర్సన్ కాదు
గాడ్ నోస్ ఎవ్రీథింగ్... ఇట్స్ మై ఫేట్,
మనకు రాసిపెట్టిలేదు అంతే!' అని
తన రీజన్‌కి ఓ ఫిలాసఫికల్ అవుట్‌లైన్ గీసింది
సాలా... ఖేల్ ఖతమ్ దుకాన్ బంద్!

**- ఊడుగుల వేణు గౌడ్**



# కర్వుమొకం

మొదలే తెలంగాణ రైతు బతుకు జల్లెడలెక్క తూట్లువడ్డట్టు
ఆగమాగం అత్లాకుత్లం ముంగట్కివోతె బాయి
ఎన్నకు వోతె శెర్వన్నట్లు న్యాల మీద కాలువెడ్తె
మల్ల ల్యావట్టకుంటాయే!
దెబ్బమీద దెబ్బన్నట్టు పుండుమీద కారం జల్లినట్టు...
మొగులు మీద్కిసూస్తే సూడరానంత యెండ
యెండ దెబ్బకు శెక్కరచ్చి గిరగిర దిర్గవట్టె
పానంమీద తీపి కోసం వోట్లే యేంపం జేస్కోవాల్నే
గాల్లు గాపంజేస్కుంట తక్షేమ బత్కులు బత్కవట్రి
గిదివానకాలం రైతుకు బూతల్లికి కన్న పేగు సంబంధమంతకుత
మొదటానులు ముర్వించంగనే యాల్లపొద్దుగాల్ల
దుక్కి దున్ను కొని పాలం నాటేసుకుందు
బోరు నీల తోటి కల్పుసుత్క కల్పిండు
వానపత్తాలేకుండ పాయే నోరెండినట్టు బోరెండి పాయే
పచ్చని పొలం జేస్తె బీళ్లు వారి బూతల్లి నోరుదెర్వవట్టె
సూస్తుండగానే వరితారి పాయె
రైతు గుండె దబుక్కున జారిపోయినట్టాయె
ముక్కోటి దేవుండ్లకు బోర్లవడి దండాల్ ఎవట్రి
ఆన్కండ్ల గుల్లను నీల్లతోటి నింపేసిరి
దేవుడనేటోడుంటే గానికి కర్పనన్నరాకపాయె
కండ్లమొంగల నోరులేని జీవాలకు నీల్లు లేక పానాలివ్వవట్లె
పానమసుంటి ఎద్దు జచ్చిపోతే రైతుపానం బోయినంతపని గావట్టె
మొగులు యిన్పగోడ లెక్కమొకమడ్గం బెట్టింది
వాన శిన్కుల కోసం ఎదురి సూసిన రైతు కండ్లల్ల నిరింకిపావట్టె
ఎండిపోయ్న యెద బొచ్చమిదలబోదిబో గుద్దుకోవట్టె
చెట్టుమీది కెల్లి పిట్టల్ రాలినట్టు రైతులు రాలిపోవట్రి

తిండికోసం శీమల్ దారివట్నట్టు రైతు పట్నాలకు దారివట్టె
గీయతకుతి వోలైన దీర్చేటట్టు లేకపారి
రైతు కరువుగోస జూస్తే
పొత్తి కడుపుల గడ్డ పారవెట్టి పెకిలిచ్చినట్టుగావట్టె
గిది మామూలు కర్వుగాదు! ఏ పైర్లను ఎండిపోయ్న దాకలాలే మిగిలె...
కరువు తల్లి ఒంటి కాలుమీద
చెట్టుకొమ్మల్ లెక్క రెక్కల్‌జాపి సయ్యాట లాడవట్టె
గదాన్కి తోడు దప్పుదర్వెయ్య వట్టె ఎండినదొక్కలన్ని దిలెటట్లు
ఏర్లెండిపాయె బోర్లెండిపాయె కాల్వలెండిపాయె కుంట లెండిపాయె
ఆకర్కు శెర్లెండిపాయె...
దూప జల్లార్చు కువెతందుకు దోశడు నిల్లులెకపాయె
కార్లల్ల దిర్గిటోల్లు సూత్కయిటింకల్ల పత్తాలేకపైరి
గిల్ల బద్కాశీతనం మీద మున్నువదని... గీల్ల దుర్మార్గం మీద రాయివడని
అంతాలుచ్చలంపంగల రాజ్యమాయె వోడుయెత్తి యెముందిగడని
రైతు సమాజానికి వెన్నుపూసంటరు గాన్కిపానం బొసె&ందుకు
వోదుముంగల కస్తడు
అచానగ్గా రైతు వురికొయ్య మీద వుట్టి పూగినట్టాగవట్టె
గీరా బందుల రాజ్యంల రక్తం బార్తదిగని
నిట్లు వార్తాయె?! గీల్లు వొన్ని వుద్కార్కంజేసింద్రని...

- ఏలేశ్వర నాగభూషణాచార్య

# నూరు తప్పులు...

విస్ఫోటకాలు వెదజల్లుతూ
సుదర్శనచక్రం దుష్టుల తలఖండించును!
కళ్ళకు గంతలతో అన్యాయాలన్నీ ఆపవచ్చా?
కానీ,
ఒక్కో తప్పును కోటి కళ్ళు చూస్తున్నాయి!
చివరినుండి వందకు చేరే దిశగా
తప్పుమీద తప్పులు చేస్తుందెవరో?
"దీక్షకు" ముందే అరెస్ట్!
ప్రజాస్వామ్యం తలదించుకుంది!
భక్షించడమే అలవాటయిన నాయకుల్లారా
లెక్కించుకోండి మీ తప్పుల చిట్టాలను
విద్యార్థి శాంతి ఉద్యమాల్ని
కఠినమైన లాఠీలు భగ్నం చేశాయి
కుటిల నీతికి బలి చెయ్యాలనుకున్నారే -
అదిగో - అప్పుడే అంటుకుంది యువశక్తికి నిప్పు
అదే మీ మరో తప్పు
తప్పుమీద తప్పు చేయడం ఎప్పటినుండో చూస్తున్నాయి
నిప్పులు చెరిగే ఆ కళ్ళు
అకారణంగా కాలేజీలకు సెలవులనే
పాచికలేమీ పారలేదు!
చిచ్చు రేపిందదిగో - అదే మీ పెద్ద తప్పు!
నిన్ను కాచేదెవరిప్పుడు?
అదిగో మా తెలంగాణా తల్లీ!
తెలంగాణా రాష్ట్ర ఏర్పాటు చేయని మీ నూరవ తప్పు!
ఎట్లు తప్పించుకుంటారు? ఆ దగద్ధగాయ యువజ్వాల నుండి?

- నీహారిణి

# తెలంగాణ మట్టిపాలు

మట్టికోట రేణువుల కూటమి పాట
ఉట్టిపడెను హుయత్సాంగ్ యాత్రికుని నోట
విలసిల్లిన ప్రజారక్షణతో
విరిసిన ఆనందం నాది!
తుమ్మెదల పాటలతో
తమ్మి పూరిక్కలు
వేల గొంతులు - సుస్వరాల
నాలపించిన సంకీర్తన నాది

ప్రేమ ముద్దులతో
పెంచినాను లతాతరుమొక్కల
పుక్కిట పోలవరాన్ని
పులిచింతలను పుకిలించినాను
దోసిలితో నాగార్జునసాగరాన్ని
దొర్లించిన అర్పణము నాది

బీట వారిన సీమ జాగ సర్పాలు
కాటేసెను తెలంగాణను
తేలి ఆడు రామప్ప ఇటుకల
శిల్పి నేర్పు చేతి (గుది) బొమ్మల
తలపించు మధురానుభూతి నాది

సాయుధ పోరాటాల యోధుల
చాటు అమరధామము కళ నాది
సెజ్‌ల భూతాలు నములుచున్నవి
చెట్టు చేమల కొండలను
పంట పొలాలను కాల్చుచున్నవి
పాడి పశువుల కొట్టాలను

ముంపు భూముల నిరాశ్రయులకు
మూతికి చిక్కము వేయుచున్నవి

దేవాదుల పుణ్యతీర్థము
తెలంగాణ విశ్వవిద్యాలయ చదువు
నైవేద్యము భాగమతికి
నేటి తెలంగాణ కల నాది
సింగరేణి దాచుకున్న - నల్ల
బంగారము గుప్తధనము నాది

మెరసిపోతున్నది రామోజీ తెర
ఆరాకళల పరంపర
తెరచాటున మొదలవుచున్నది
తెలంగాణ నాటకము నాది
పాలమూరు కూలిబిడ్డల కథ అది

అలిగిరి సూరీడు ఆంజనేయులు
ధూళి శత్రు కంట్లో కారం చిమ్మిరి!
బాబ్లీ గోదావరికి హైజెంప్
దుముకు మాయ నేర్పుచున్నది
బాసర మంత్రశక్తి చూపు
తోయకున్నది మన మైత్రియన్నది!

ఎర్రమట్టి బండెద్దుల గజ్జెలపాట
ఇల్లలుకగ మేల్కొల్పును
మట్టిబురద రైతు చందనము పాట
మసిబొగ్గు కూలి కృష్ణుని ఆట
మనీషి పోతన కవి చరిత్ర నాది!

**- ఆవాల దామోదర్‌రెడ్డి**

## తెలం'గానం'

భాష పేరుతో జరిగింది మోసం
వదులుకో తమ్మీ
కపట సావాసం
నీ కంట్లో వాడివేలు
వాడి నోట్లో నీ వేలు
ఉభయత్రా వాడికే మేలు
పప్పు నీది
పొట్ట వాడిది
పంచితే పొట్టు గాలికి
పప్పులో భాగం వాడికి
నే నేలలో పారే నదీ జలాలు
తడిపేది మాత్రం
వాడి పొలాలు
సీమకు కృష్ణ నీళ్ళు
కోస్తాకు గోదారి నీళ్ళు
తెలంగాణ ఏడిస్తే కన్నీళ్ళు
పోలవరం కోస్తాకు వరం
పోతిరెడ్డిపాడు
తెలంగాణ బీడు
మొన్నటి ఆరొందల పది జీవో
అమలుకు నోచుకోని జమ్మికింది రాత
ప్రతిపక్షంలో వుంటే తెలంగాణ పులి
అధికారం వస్తే గోడమీది పిల్లి
ఇల్లలికితే కుడుమిస్తే
కాదు పండుగ
పంజరం నుండి విముక్తే పండుగ
ఆత్మగౌరవం కోసం
యాభై ఏళ్ళుగా
మండుతున్న నిత్యాగ్ని హోత్రం
తెలంగాణ

**- పానుగోటి నరసింహారావు**

## మనకెందుకు స్వాతంత్ర్యం?

బానిసలం బానిసలం తెలంగాణ బానిసలం
తెలివిలేని బానిసలం తెగువలేని బానిసలం
మన తప్పులె ఎన్నుకుందాం
మనలో మనం తన్నుకుందాం
పరప్రభువుల పల్లకీలు పరవశంతో మోస్తుందాం

పరాయీల పాలనలో యుగాలైన పడి ఉందాం
మనకెందుకు మంచినీళ్ళు మనకెందుకు తాగునీళ్ళు
మనకెందుకు వాగునీళ్ళు మనకెందుకు సాగునీళ్ళు
మనకెందుకు మనకెందుకు ఉద్యోగాల్ సద్యోగాల్
పరాయీల పాలననే తెగమెచ్చుతు ఉందాము
పరప్రాంతపు ఏలికలకు పాదసేవ చేద్దాము
భూములెన్ని కాజేసిన నీళ్ళనెన్ని మలుపుకున్న
చీమునెత్తురే మనలో లేకుండజేసినా...

ఉలుకలేదు పలుకులేదు
మనలో చలనం లేదు
కంపెనీలు వస్తయంటే భూములన్ని యిచ్చేద్దాం
ప్రాజెక్టులు కడ్తమంటే పల్లెలు ఖాళీ చేద్దాం
పనిలేకుండబోయి బతుకు భారమే అయినా
ఉన్న ఊరు నిడిసిపెట్టి ఉరికంబాలెక్కుదాం
బానిసలం బానిసలం మనకెందుకు స్వాతంత్రం

**-ఆర్. చందా**

# సాధిద్దాం!

సభలు పెట్టేద్దాం
గుబులు పుట్టిద్దాం
చైతన్యాన్ని తెప్పిద్దాం
అందరినీ ఒప్పిద్దాం
పార్టీలన్నింటిని కలిపేద్దాం
నయవంచకుల దుమ్ము దులిపేద్దాం
స్వార్థపరుల పని పట్టేద్దాం
బజారులో వారిని నిలబెట్టేద్దాం
తెలంగాణ ఆవశ్యకతను తెలిపేద్దాం
అందరినీ మనవైపుకు మలిపేద్దాం
మోసగాళ్ళను ఏరేద్దాం
వేషగాళ్ళను తరిమేద్దాం
పెన్నును గన్నులా పేల్చేద్దాం
మాటను తూటాలా మార్చేద్దాం
నీళ్ళ లెక్కల్ని తేల్చేద్దాం
వద్దన్న నాల్కల్ని చీల్చేద్దాం
అవకాశవాదులను అదరగొట్టేద్దాం
అడ్డుపడేవాళ్ళను చెదరగొట్టేద్దాం
ఫ్రీజోన్ వాదాన్ని చీల్చేద్దాం
సమైక్యతానాదాన్ని కూల్చేద్దాం
ప్రభుత్వాల కళ్ళ తెరిపిద్దాం
వ్యతిరేక వాదుల నోళ్ళు మూపిద్దాం
కుటిల రాజకీయాల్ని ఛేదిద్దాం
మన రాష్ట్రాన్ని మనం సాధిద్దాం తెలంగాణను

**- జె. బాలవర్ధిరాజు**



# సరాయింపు

మాటలు మార్చుడు
సాగదీసుడు
గద్దెకోసం కోటియిద్దెలు
ఎప్పుడొస్తదంటే చెప్పకపోవుడు
తేనెమాటల యిసం

భూములు నీళ్ళు
నోటికాడి బువ్వ అందకుండా చేసిన వైనం
పట్నమంతా పరాయినీడ
మా ఉద్యోగాలకు ఉరి

ఇంకేంది మంచిగనే ఎసరు
చాపకింది నీళ్ళు
సోపతి జేసి సోపతి జేసి సారికెలు
మావోళ్లను మల్పుకొని మాకేనా శఠగోపం

బిడ్డా నీ యికమతుకో సలాం
పెత్తనం శాశ్వతం కాదు
బర్రెజెనిగె ఏషాలు వద్దు
బహురూపులాటలు వొద్దు నరంలేని నాలికె

అయ్యా! నీ యిగురానికో దండం
నా జాగకు నువ్వు జాగీర్దారువా
బాగలేని మా బత్కులు సయిజేస్కునేది మేమే
మా తొవ్వ ఏందో మాకెరికె

భాగ్యనగరం మా తెలంగాణ గుండె
మీ సొంటువద్దు మీ యంటు వద్దు
బత్కు బత్కితే యింత గోర్జ ముండాలె
యీ కైలాట్కాలింకెంత కాలం

**- పప్పుల రాజిరెడ్డి**

# సనమ్, జమీన్ ఔర్ మౌత్

క్యుం మర్తేహో బేవఫా సనమ్ కే లియే
దో గజ్ జమీన్ నహీఁ మిలేగి తెరె దఫన్ కె లియే
మర్నా హోతో మరో తెలంగాణ రాజ్‌కె లియే
హసీనా భీ దుపట్టా ఉతార్ దేగీ తెరె కఫన్ కె లియే

- సిద్దెనబోయిన వెంకట్ యాదవ్



# గింత అంధేరా 'సేతన్న' బతుకు...!

రోజులు మారవట్టె... రాజులు మారవట్టే...!
రాజ్యాలు మారవట్టె... రాజకీయాలు మారవట్టే...!
కానీ నేతన్నల బతుకులు మాత్రం మారకచ్చ్య
మొగ్గుంమీద నేసిన శీర్సను అగ్గిపెట్టెల వెట్టి
దేశముకు జూపించినాడు వీడు గొప్పగ్గనిపిచ్చిండు
మర్యదె మొగ్గంమీద ఇయాలనేశిన
పితాంబ్రం శీర్యను జూపిస్తే సప్పగనిపిస్తుండు
ఖద్దరు మిల్లుల కస్తూరి వాసనలు
కట్టెల యంత్రాలగతులను ముందుకు సాగనియ్యకచ్చ్య
ఆడుమోసిన బట్టల గట్టలే ఆన్ని క్యాల్యోన్ని జెయ్యవట్టే
ఆడు నేసిన బట్ట పేల్కలే వాన్ని బరివాతల జెయ్యవట్టె
భువనగిరి శీర్స గడితే మాయవ్వ భూలచ్చి మొల్యుంటది
సిరిసిల్ల, సిద్ధిపేటల శీర్యలను గడితే నా పెండ్లాం శ్రీలాచ్చి మొల్సుంటది
అసుంటిది...!  సిరిసిల్ల శీర్జలెటువాయే...?
భువనగిరి దోతుల జోల్లెటువాయే...?
కండ్ల జూతామంటె ఆ ఖాదీ పెల్కలను
కండ్లకే గనిపియ్యనిస్తలేరు
ఇంత అందేరు బతుకూ ఒగ బతుకేనా...!
నాడు రావణుల మనుసాగలేదు. ఈ శీర్సలను జూచి
రాజుల వయసర్గలేదు ఈ బట్టలను వేసి
అట్లాంటిది...!
వాడు దోడిన మొగ్గం గుంటవే
వాడిపాలిట బొందపొక్క గావట్టె
వాడు వట్టిన లాకబద్ధలే వానికి 'కంప్రం' కట్టెలు తావట్టే
ఆడు జుట్టిన శీర్సదోన్గులే వాని చితి మీద బేరవట్ట
వాడద్దిన రంగుల నూలు పోగులే వాడి పాలిట ఉరితాళ్లు గావట్ట
చివరకు వాడు నేసిన బంగారంచుల సీర్స, దోతులే
వాని గుడిసెమీద తాట్యాకులై సంసారం జెయ్యవట్టే.
యాడునేశిన బట్టలు జూపిస్తే లోకంకు రోజూ పండుగేగాని
అసలు పండుగస్తే యానింట్ల దండుగే -
అయ్యలారా! దొరలారా! సూడుండ్రి బతుకు లెట్లున్నయ్

పొద్దంతా రెక్కాడితే గానీ పొద్దిమీకి నోట్లకు ముద్దరాదు
మా భాగోతం రోజూ జూస్తుండ్రుగాని
ఆ అయ్యలకు కనికరం రాదు
ఇట్లా రెక్కాడితేగాని డొక్కాడని బతుకులను ఎందుకు పుట్టించాడీ దేవుడు
గడియ పురుసతద్దు, గవ్వ అమ్మానద్దు
బట్టలకు బంగారు రంగేలేశి
యాడు లోకంను మరిపించిండుగాని...
యాని బతుకుల రంగులు నింపి
యాన్ని మురిపించెటోల్లే కరువయ్యినట్టున్నరు
కంపిండ్లకు వోతే
అద్దాల అర్రలకెల్లి సిల్కు స్యారీలను ముంగట వడేస్తే
వాడు జెప్పిందరకు మురుసుకుంట దీసుకుంటరు
యాడు నేశిన న్యాతబట్టలను అమ్మతందుకు వోతే
గంజీలీగ్యను దీసేసినట్టు గుంజి గుంజి ధరలడుగుతరు.
ఊళ్ళనేమొ ఇళ్లు లేకపాయే,
అడివిల ఇశ్యడు గుంటలేకపాయే
సాలె బతుకే సన్నాశి బతుకాయే
నేతనేసుడే పాతుకమూ పాయే
ఇట్లయితే 'నేతన్న' గతి ఎట్ల మరి...?
అట్లగాదట్లగాదు... పల్కవట్టిన చేత పర్మన్నందినాల
పాలచెక్కలు దొక్కిన పాదాలు బంగారు బాటల నడాల
పోగులల్లుకు పోయినట్లవాని పేరు వాకాల
అంచుకు వేసిన పింజరలతిర్గ, చీరలనడుమ బుట్టాల తిర్గ,
అని బతుకుల కొత్తమొగ్గలు మొల్వాల
మరిమీ తతంగునమంతా ఎప్పుడు గావాలా...?
రాజుల పెద్ద సూపు వీరిమీదున్నప్పుడే
ఒక పక్క చెడుగొట్టానలచ్చి
వాళ్ళ మొగ్గాల సడుగులిర్గ దీయవట్టె.
కనుమరుగవుతున్న పల్లెల్లో ఈ వృత్తి కంపు గొట్టిపోవట్టె
జెననేతలయినవాళ్లు ఈ నేతగాళ్లను మరువద్దు
ఇట్లా అయినప్పుడే... నేతన్నల శాత ఖ్యాతిగా నిలుస్తుంది...!
వాడు నేసిన బట్టలమోత కంపిండ్లల్ల బంగారమై మెరుస్తుంది...!!

**- సుప్పని సత్యనారాయణ**

# బికార్లని చేసిన సోపతి

అమ్మకాదు!
ఆమె ఓ ప్లాస్టిక్
అడిగినప్పుడల్లా
ఓదార్చేందుకు చూపిస్తావు!?

నా తెలంగాణా
ఆకలితో నిద్రలేసిన పసిపాప
అనుకునేవు
గల్లీలన్నీ యువశక్తి
నినాదమై ప్రవహిస్తుంది

ఇన్నాళ్ళ మర్మం తెలియని బతుకు
గోడల పెచ్చులూడగొడుతుందని
బికార్లని చేసి వీధిల నిలబెడుతుందని
సోపతిని చూసి సోయి మర్చిన
గొబ్బెమ్మల అందం చూసినం గని
పేడ ముఖానికి పూస్తున్నరని
పసికట్టలేక పోయినాం

కోర్కెలు తీరాలని
పీర్లకు ముడుపులు కడతం
చేతుల్ల కత్తులున్న పీర్లై
పాలూ నెయ్యిల కాదు
రక్తపు టేర్లు దాటొచ్చిన వీరులు వాళ్ళు

కోర్కెలు నివేదిస్తం
వినకుంటే
కారం కళ్ళల్లో గొడుతం
జై తెలంగాణ

**- హనీఫ్**

# 29 వ రాష్ట్రం

ఇంకా ఎన్నిసార్లు క్షమించమంటావు...?
నాగార్జునసాగర్ నీళ్ళు
దారి మళ్ళించినప్పుడు
సింగూరు జలాన్ని నీ దాహార్తి కోసం
తీప్పుకున్నప్పుడు
హైదరాబాదంతా నీ విశ్వరూపం
ప్రదర్శించినప్పుడు
మెల్లమెల్లగా పరిశ్రమల పేరిట
నా గ్రామాల్ని సొంతం చుట్టేస్తున్నప్పుడు క్షమించాను

యాస పేరిట నా భాషతో ఆడుకున్నప్పుడల్లా
పోనీలే అనుకున్నా...
బిడ్డా... ఇప్పుడు నా భాషనే కాదు -
సంస్కృతినే కాదు -
నా ఉనికిని సైతం ఏమార్చుతున్నావ్
ఇంకా ఎలా క్షమించమంటావు...?
మా తుఝే సలాం...!
ఈ పొత్తు నాకొద్దు-
నా తెలంగాణ నాకిచ్చేయ్!!
మరో సంక్రాంతి పండుగకల్లా
సరికొత్త రాజకీయ చిత్రపటం నిర్మించుకుంటాం
'తెలంగాణ' బేషర్తుగా
ఈ దేశపు 29వ రాష్ట్రం...!!

- సూరారం శంకర్



# ఓపెన్ బ్లాస్టింగ్

నేలతల్లి గుండెలోతుల్లో
విస్ఫోటిస్తున్న మందుపాతరలు
ప్రభావిత ప్రాంతాల్లో పగిలిపోతున్న గోడలు
కూలిపోతున్న తాతల తరాలనాటి నీడలు
పచ్చని పంటపొలాలను బుగ్గిచేస్తూ
బొందలగడ్డలకు పునాదులు తవ్వుతున్న బుల్‌డోజర్లు
భూనిర్వాసితుల బతుకుల మీద
దూసుకుపోతున్న టిప్పర్లు
భూమి దరులను ఉల్లిపొరలుగా తొలచుకుంటూ
నల్లబంగారాన్ని నైవేద్యంగా సమర్పిస్తున్న
రాకాసి యంత్రభూత పృధ్వీభంజన్

నీరెండిన పెద్దవాగు గుండెలవిసిపోతది
నోరెండిన ఊరచెరువు మట్టిదు:ఖం మోస్తది
భూపొరల్లో పేలుస్తున్న బ్లాస్టింగులకు
పసిపిల్లలు ఉలిక్కిపడుతరు
తల్లి ఒడికోసం దేవులాడుతరు
ఆపాదమస్తకం అమ్మ స్పర్శకోసం తండ్లాడుతరు
భావిపొరులు... ఒక జీవితకాలపు అగాధాన్ని అనుభవిస్తరు
వందల ఊళ్లు వల్లకాడులై విలపిస్తయి

కైరిగూడా, కోయగూడెం, డోర్లీ, భూపాలపల్లీ,
సత్తుపల్లి, మేడిపల్లి...
వనరుదోపిడీ వర్ణమంతా ఒక్కటే
పరిహార, పునరావాసాల్లో...
మూలవాసులను మినహాయిస్తరు
జల్, జంగల్, జమీన్... నమ్ముకున్న
అడవి బిడ్డలు అనాధలవుతరు

మట్టిదిబ్బల మధ్యలో చిక్కిన
మారేడు పాకలో

భానోదయ బద్దకిస్తది
సూర్యాస్తమయం ముందే వస్తది
సకల విబేధాలు వదిలిన
ప్రకృతి తన ప్రతాపాన్ని ప్రదర్శిస్తతది
కాసిపేటలో... కాటికెళ్లాల్సిన శవాలకూ కాలం కలిసిరాదు
కంపెనీ నీళ్లట్యాంకర్‌కు కాళ్లొచ్చినప్పుడే
చావుడప్పుమీద దరువు పడేది
వియ్యానికీ, కయ్యానికీ జలగండమే ఎజెండా
పునరావాస ప్యాకేజీలో...
పురిటినొప్పులకూ, చావు ఖర్చులకూ
అధికారగణం హామీ పడుతది

శివమెత్తిన సింగిరెడ్డిపల్లె
పరిహారం చెల్లింపుల ప్రహసనంలో
ఓవర్ హెడ్ నీళ్ళట్యాంకుపై నిలబడి
చావు కేకలు వినిపిస్తది
వినికిడి సమస్యతో వినోదిస్తున్న
గని యజమాన్యానికి
ఉత్పత్తి నష్టాన్ని చవి చూపిస్తది
చీకటి, వెలుగుల సమదూరంలో...
మసిబారిపోయిన ఎరువుల ఫ్యాక్టరీ
ఏడుస్తూ కనిపిస్తుంటది
'ఓసీపీ' బొందల్లో కూరుకుపోయిన
నిర్వాసిత కుటుంబాల్లాగా...

కాలుతున్న బొగ్గులో...
గనికార్మికులు తమ జీవితాన్ని తలపోసుకుంటరు
ఓవర్‌బర్డెన్ మట్టికుప్పల్లో...
ఊరు తన గతాన్ని తవ్విపోస్తూ ఉంటది
నిగనిగలాడుతున్న నేలబొగ్గు
అదృశ్యమార్గాల్లో తరలిపోతూనే ఉంటది
గోదావరీ నదీలోయ ఎదపై
తన వికృతరూపాన్ని విసర్జించుకుంటూ...!?

- పిట్టల రవీందర్



# తెలంగాణ శతకం

వద్దు పొమ్మంటె ఎందుకీ పెద్దరికము
ఏమి దాచితిరిక్కడ ఎందుకొరకు
పోరు ఒకమాట చాలదా పోరదేల
వేగిరంబుగ ఆంధ్రుడా వెళ్ళిపొమ్ము

ఛీ యిదేమిటి వద్దంటె చేరినారు
పొమ్ము పొమ్మంటె సుతరాము పోరుమీరు
ఏమిచేస్తె మీరిటనుండి ఏగగలరు
వేగిరంబుగ ఆంధ్రుడా వెళ్ళిపొమ్ము

మూడుకోట్లకు పెరిగిన ముద్దులమ్మ
స్వంత రాష్ట్రంగ వెలిగిన సత్యశీల
ఎందుకిట్టుల కష్టాల కుంగనేల
వేగిరంబుగ ఆంధ్రుడా వెళ్ళిపొమ్ము

ఏమి మనుషులీ తెలంగాణ భూమిపైన
అడుగు పెట్టినదానిగా అసలు బుద్ధి
విడువరైతిరి ఇక చాలు వెగటుబుట్టె
వేగిరంబుగ ఆంధ్రుడా వెళ్ళిపొమ్ము

ఉన్నదూడ్చుక తింటిరి ఎన్నడైన
తల్లి తెలంగాణ క్షేమాన్ని తలచినార!
ఏమి బతుకులు ఛీ పొండి ఇంకచాలు
వేగిరంబుగ ఆంధ్రుడా వెళ్ళిపొమ్ము

తల్లి తెలంగాణ కన్నట్టి తనయులంత
వొక్క త్రాటిపై కొచ్చారు వొక్క క్షణము
నిలువలేరింక తడవేల నిజము నిజము
వేగిరంబుగ ఆంధ్రుడా వెళ్ళిపొమ్ము

- నల్లా ఉపేందర్

# తెలంగాణ విజయగీతం

మా వాదం తెలంగాణం! మా గానం తెలంగాణం!
మా శ్వాస తెలంగాణ! మా లక్ష్యం ప్రత్యేక తెలంగాణ
సామ్యవాద రాజ్యం అంటూ
ప్రతి జీవి ఘోషిస్తుంది ప్రత్యేక తెలంగాణ ఎప్పుడొస్తుందని?
మబ్బులన్నీ భీష్మించాయి తెలంగాణ రాజ్యం కోసం!
తెలంగాణ ప్రత్తిరైతులు దీపానికి ఒత్తినెలిగించి కళ్ళలో
ఒత్తులు పెట్టుకొని ఎదురు చూస్తుండ్రు!
నిరుద్యోగ యువత బ్రతుకు దారి కరువై బాటసారులై
బారులు బారులు ఏ నగర దారి పట్టిండ్రో!
ఎడారులౌతున్న మా బీడు భూముల్లోని పల్లేరు కాయలు
కొల్లేరు లౌతున్నాయ్!
దుక్కి దున్నిన సాలుల్లో పొదిగిన ధాన్యాలన్నీ
మొలకెత్తలేక భూమిని పెకలించ శక్తిహీనమై
అవి నవిశిపోతున్నాయ్!
మా ఇంటి పెరట్లోని గుంట గరుడమొక్క
గూడు కొట్టుకొని కమిలిపోతుంది!
మా చెరువెనక పొద్దు తిరుగుడు పూలు
పొద్దుకు ఎదురొడ్డి మెడ తిప్పలేనని
మొరపెట్టుకుంటుంటే!
పొట్టకొచ్చిన వరిపైరు పురుటినొప్పులతో
తెలంగాణా తెలంగాణా అంటూ వేదన పడ్తుంటే!
తెలంగాణ పల్లె తల్లి బోరున విలపిస్తుంది
పల్లె  కూలీలు, మానవ యంత్రాలైన కర్షక రైతులు,
కార్మికులను కరువు రక్కసి కబళిస్తుంటే బ్రతుకు చిద్రమై
వలస పక్షులై ఎగిరిపోతుంటే..
తెలంగాణ పాడి పశువుల బిడ్డల ఆకలి తీర్చలేక రోదిస్తున్నాయ్!
గొర్రె పిల్లలు మేక పిల్లలు
వలసవాదుల కుట్ర కుతంత్రాలని పులి బిడ్డలై ప్రతిఘటిస్తున్నాయ్!
సమైక్యవాద విషసర్పాల దర్పాలను బంగపరిచి
చెరువులోని కప్పపిల్లలు తెలంగాణ తల్లి ఋణం తీర్చుకుంటున్నాయ్!
తెలంగాణ ఉద్యమస్ఫూర్తితో చేపలు ఎగిరి
ఒడ్డున దూకి మొప్పలశ్వాసతో హార్మోనియం మోగిస్తున్నాయ్!
తెలంగాణ కోకిలలు ఉద్యమగీతాలను గానం చేస్తున్నాయ్!
తెలంగాణ జీవులన్ని చకోర పక్షులవోలె
ప్రత్యేక రాజ్యం కోసం గొంతెత్తి ఎదురు చూస్తున్నాయ్!
ఇక తెలంగాణకు అడ్డుపడే విద్రోహుల
తెలంగాణ వ్యతిరేకుల భరతం పట్టడానికి
కందిచేలు కదం తొక్కుతూ పదం పాడుతూ
పదపద మంటున్నాయ్!
కందిరీగలు, తేనెటీగలు, చీమలదండ్లు
ఉద్యమానికి ఊపిరిపోస్తాయ్!
వేపచెట్లు శిగం ఊగుతూ దయ్యాలను
తరిమి కొడతాయ్!
పత్తికాయలు చురకత్తులై తిత్తి తీస్తాయ్!
మబ్బులు మబ్బులు రాపిడై
తెలంగాణ ప్రతిధ్వనితో పిడుగులు కురిపిస్తాయ్!
పొద్దు తిరుగుడు పూలు భగభగ మండే సూర్యులై
భస్మం చేస్తాయ్!
తెలంగాణ కొండల గుండెలు పగుల్లై
విస్ఫోటనమై శకలాలుగా ఎగిరి తెలంగాణ
రాజ్య శిలాశాసనం చెక్కించుకుంటాయ్!
జై తెలంగాణ! జై జై తెలంగాణ!!

**- యలకా శ్యాంసుందరరెడ్డి**

# భూమి భవిష్యత్తు

అణచివేత ఆధిపత్యం ఒక రాక్షస క్రీడే!
అందువల్లే కదా
మా మట్టి మానభంగానికి గురైంది
మాంసం కొనుక్కుపోయేంత సహజంగా
మా నేలతల్లిని అంగట్లో పెట్టి కాజేస్తుంటే
మేము యేం చేయాలో చివరకు అదే చేస్తున్నాం కదా!

కర్మగాలి వొకే భాషీయులం కావడం వల్ల
ముగురమ్మల యమ్మ కదాయని మూలపుటమ్మకే
మా బతుకుల్ని అప్పజెప్పితిమి!
ఆమెకు తల్లితనమే లేదాయె
పోనీ పెంచగల ప్రేమైనా ఆమె రక్తంలో దొరకదాయె
నా భాగస్వామ్య బిడ్డలారా అంటు
మా నోట్లో మట్టిగొట్టే కథలకే శ్రీకారం చుట్టింది!
అంతలోనే ప్రాంతీయ పాలనొచ్చి
మా అస్తిత్వాన్నంతా
ఇనుప చీపురుకట్టలతో ఊడ్చుకుపాయె!
మేమేమో అన్నమో రామచంద్రా అంటే
చెట్టుకొక్కర్ని పుట్టకొక్కర్ని జేయబడ్తిరి!

తెలియకడుగుతా
ప్రజల భూమిని రక్షిస్తారు గానీ
భాష భూమిని రక్షించలేదు గదా!
ఆ గుణమే మన భాషకుంటే
మా భూములెందుకు మాయమైతయి!
భూమి ఉంటేనే కదా మాకు ఉనికుండేది
ఉనికి ఉంటేనే కదా మా బతుకునైనా భాషనైనా నెత్తినెత్తుకునేది
తల్లి పేరున జరిగే ఈ పిల్లల పంచాయితీలో
ముందుగా మా నేలతల్లినే రక్షించుకుంటం!
తల్లే లేకపోతే
ఈ ఇనుపకాళ్ళ బారినుండి మా పిల్లల్నెలా కాపాడేది!
మనవి భాగస్వామ్య బంధాలేగాని
రక్తబంధాలైతే కావాయె!
ఇష్టం లేనప్పుడు విడిపోండని
సాక్షాత్తు తొలి దేశాధినేతనే చెప్పిపాయె
ఇంకా ఇంకా చెప్పేదేముందిప్పుడు!
భాషపేరు చెప్పి మా భూముల్ని యేగేసుకుపోతుంటే
మేం పోయేరోజున
రూపాయి బిల్లంతైనా
మా నేల మాకు దక్కేట్లు లేదు!
మాకున్న సంపదంతా మీ అదనపు సంపదాయె
ఈ అదనపు సంపదకోసమే గదా
రైలింజన్ వెంట బోగీలు వస్తున్నట్లు వస్తూనే వుండ్రు
గానుగెద్దుల్లా మీ చుట్టు
మమ్మల్ని తిప్పుకుంటూనే వుండ్రు
గవ్వకు సాటిగాకుండా జేస్తూనే వుండ్రు
మీ అభివృద్ధి మేళామాయలో
మేం మరింత బానిసలమయ్యేకన్నా
బలుసాకు తినైనా
మా బతుకు మేం బతకడమే మంచిదనుకుంటన్నం!

- నాళేశ్వరం శంకరం

# గుతుపలందుకుంటం

తెలంగాణమ్మా తండాలకు రూపమా
ఎదిరించడమే శాపమా...!
చందనా బ్రదర్స్, బొమ్మనా బ్రదర్స్‌లా
ఒకటికొంటే ఒకటి ఫ్రీలెక్కా
ఆకలన్నోడికి అన్నం పెట్టే తెలంగాణ
ఆ తెలంగాణనే మింగి తేన్పుతూ
హైదరాబాద్‌ను ఫ్రీజోనంటున్రు
బేమాన్ తక్కువ బేకార్ నా కొడుకులు
బేపికర్‌గా ఇసురుకుంటం
ఇగ ఊరుకోం
నానా విధాలుగా నకరాలు జేసినా నారాజుగాము
నైజామోన్ని నాశనం చేసేటందుకు
నాలుగువేల మంది అమరులు
ప్రాణాలనే నైవేద్యంగా పెట్టింద్రు
నాయంగా మాకొచ్చేది గుంజుకుంటం
ఫ్రీజోన్ పీనిగెల్లెదాక ఇగ గప్‌చుప్‌గుండం
గుత్పలు అందుకుంటం
గుండెల్నైనా ఎదురోడుతం

- వడ్లకొండ భాషా



# నజరానా

తల్లి తెలంగాణా తల్లడిల్లుతూంది
నా తల్లి తెలంగాణా తల్లడిల్లుతూంది
రాజకీయ, సామాజిక, సాంఘీక,
విద్య, వైద్య, ఉద్యోగ, ఉపాదీ రంగాల్లో
విద్యుత్తు, వ్యవసాయం, నిధులు, నదులు,
పరిశ్రమలు, ప్రాజెక్టులు, పరిహారాలు,
నీటిపారుదల - వనరులు, మళ్లింపులు
ఒప్పందాలు, నిబంధనలు, నియామకాలు,
జి.ఓ.లు, జోనులు, కమిటీలు, ప్యాకేజీలు,
ఇతర అభివృద్ధి పథకాలన్నింటిలో
పథకం ప్రకారం చేసిన వెనుకబాటు తనానికి
వెక్కి వెక్కి ఏడుస్తూంది తల్లి తెలంగాణా తల్లడిల్లుతూంది
నా తల్లి తెలంగాణా తల్లడిల్లుతూంది
తరతరాలుగా అణిచివేయబడ్డ
అమాయక తెలంగాణా బిడ్డల ఆర్తనాదాల ఆక్రందనలని
పెడ చెవిన పెడుతూ పెత్తనం చలాయిస్తున్న
ఆంధ్రుల రాజకీయం అపర రాక్షసీయం
మనం అప్రమత్తమవ్వాలి నిజమేంటో తెలుసుకొని, తేరుకొని
ఉద్యమించ లెవ్వాలి ఉప్పెనలా కదలాలి
ప్రత్యేక రాష్ట్ర పోరునిక ఉధృతం చేయాలి
తల్లి తెలంగాణా తల్లడిల్లుతూంది
భావితరాలకు నజరానాగా మనగడ్డ తెలంగాణాని
బంగారు భవిష్యత్తుకై బలిదానం చేసైనా
మనమంతా ఒక్కటై పోరు చేసి
సాధించుకోవాలి ప్రత్యే రాష్ట్రాన్ని
కోటి రతనాల వీణని మన తెలంగాణాని
అందుకొరకు ఇక ఆగకుండా పొలికేకలతో ఈ పొరుగువాణ్ణి
పొలిమేరలు దాటేవరకు ఉరిమి ఉరిమి చూస్తూనే
తరిమి తరమి కొట్టాలి తల్లి తెలంగాణా తల్లడిల్లుతూంది
నా తల్లి తెలంగాణా తల్లడిల్లుతూంది

- పల్లాటి శివకుమారదాసు

# తెలంగాణ పల్లె

పచ్చదనం కుప్పబోసినట్లు
పాకాల ఏటి గలగలల సాక్షిగా
కొత్తపెళ్ళి కూతురులా ఉండే మా ఊరు
ఇప్పుడు వసంతానికి ఆమడ దూరంలో...

కాలం రంగుల వలలో మా పల్లె రంగు మారింది
కరువు రక్కసి టెలీ సీరియలై పీడుస్తుంది

సూర్యుడికి గ్రహణం పట్టినట్లు
మా ఊరిని కరువు పట్టింది
ఆకుల్లేని చెట్లపై వలసపోయిన పక్షుల గూళ్ళలా
మా పల్లె గుడిసెలు...

గతమంతా ఒకసారి కలలా మెదిలింది
మనస్సు రోధిస్తుంది
మనస్సు శోధిస్తుంది
పల్లెకోసం
పచ్చదనం కోసం

కృష్ణపక్షంలో అప్పుడప్పుడు వచ్చే చంద్రరేఖ వలె
అంతరాళంలో ఎక్కడో...
రాతికంద ఊటవలె ఆశ
రాబోయే తెలంగాణా కోసం...

- గద్దపాటి శ్రీనివాస్

# పాలకుల పాపాలు - తెలంగాణ శాపాలు

దగాబడ్డ తెలంగాణ
కన్నీటిపర్యంతమైన తెలంగాణ
నిర్లక్ష్యపు కోరల్లో తెలంగాణ
బ్రతుకు దిగజారిన తెలంగాణ
అయినోళ్ళచే దోచబడ్డ తెలంగాణ
అన్నదాతల ఆకలి చావుల తెలంగాణ
చేనేతల ఆత్మహత్యల తెలంగాణ
పాలకుల పాపపు పంజరంలో తెలంగాణ
బిడ్డలను వలసబాట పంపిన తెలంగాణ
వలసబాటలో బిడ్డలకు అన్యాయమేనా... అంటున్న తెలంగాణ
బీటలు బారిన బీడు భూములు చూసిన తెలంగాణ
బిడ్డల యొక్క బ్రతుకు బాధలు విన్న తెలంగాణ
గుండెలు చెదిరేలా ఏడ్చి, గుండె పగిలిన తెలంగాణ...
అభివృద్ధి అంటూ అడ్డదారిలో నడిచే
ఆకతాయిల ఆటకట్టిస్తానంటున్నది
తెలంగాణ రైతాంగ సాయుధ పోరు స్ఫూర్తితో
బిడ్డలలో విప్లవ జ్వాలను వెలిగిస్తానంటున్నది
వెలిగిన జ్వాలను ఆర్పేది లేదంటూ
ప్రజావిముక్తి పోరాటాలు నడుపుతానంటున్నది
సమిష్టి కృషితో, సమతుల్యతను కాపాడుతూ
ఆమడదూరాన ఉన్న అభివృద్ధిని అందుకుందామంటున్నది
ప్రత్యేక తెలంగాణ రాష్ట్రాన్ని సాధించుకుందామంటున్నది
జై తెలంగాణ! జై జై తెలంగాణ!!

- పోటు నారాయణ

# ఆంధ్రుడా!

పొట్టచేత పట్టుకొని వచ్చినవ్ 'పోనియే పాపమని బువ్వపెట్టి
సల్లగ నీడకు పండుకొమ్మని ఇంట్లెకు రమ్మంటె...
హాయిగ పండుకొని లేచి ఈ ఇల్లు ముంగిలి నాదేనంటావ్!
తిన్నింటివాసాలు లెక్కపెట్టే ఇశ్వాసం తక్కువ ముండ కొడుకవు నువ్వు!
'ఇసుంట రమ్మంటె' 'ఇల్లంత నాదే'ననే రకం బిడ్డా నువ్వు!
నీ కడుపుల ఇసం కానరాక పాపమన్నం!
ఈతాకేసి తాటాకు గుంజే రకాల్ని చూసినం కని
నువ్వు... ఏడుపు మొకంతోటొచ్చి
ఏమయ్య కుండనే పొత్తుకర్సినవ్
మా తాతలు, తండ్రులు నెత్తురు చెమట చేసుకొని కట్టుకున్న
మా ఎదరుబాదు పట్నాన్ని కాకులు, గద్దల పొల్జేద్దామని సూత్తానవ్
గప్పుడు గా చెన్నపట్నాన్ని గాలమేసి గుంజుదమని చూసినవ్
బిడ్డా! తమిళపోల్లు నీ జుట్లెనుంచి పుట్టినోళ్లు
వాళ్లు ఎడమకాల్తోటి తంతె ఏడుసుకుంటొచ్చి
కర్నూలు ఊరవతల పడ్డవ్
గప్పట్నుంచేల్లి మా బాగ్యనగరం అందాలు నిన్నూరిస్తానయ్!
ఇగ... నాసుపెట్టుకొని కూసున్నవ్!
మా బొగ్గు తిన్నవ్ మా నీళ్లు తాగినవ్
మా బూములకు బూములే మింగినవ్
మా నోటి కాడి ముద్ద కూడ మాది కాకుండ చేసినవ్
అన్నిటికన్ని మింగినవ్! అధికారాన్ని బొర్రలెక్కపెంచినవ్
మంది సొమ్మంత పిర్రలెక్క పెంచినవ్
ఒంటిమీదెంటి కలన్ని గడ్డ పారలయినయని
విర్రవీగుతానవ్!
బిడ్డా! తెలంగాణోనికి తెలివి లేదనుకుంటానవ్!
సరె, గిప్పటిదాక గట్లనే గడిచింది
ఇక తెగించినమంటె... పేగుల్ని తీసి పెంటమీదేస్తం!
గంతదాక రాకముందె నీ ఇంటిదారి నువ్వే చూస్కో
కాలికి బుద్ధిచెప్పి
కనిపించకుండ పో...

**- మద్దెర్ల రమేష్**

# జోలి

మోదుగు డొప్పలో వెన్నెలను జుర్రుకున్న గీ నేల
సలుపుతున్న సనుబాల తీపిని మోస్తుంది!

నెత్తుటితో తడిసిన
తంగేడు పూల వనంలో
జీరబోయిన బాలసంతు పాట
గుండెగూటిలో గువ్వై ఒదుగుతుంది

అంటరాని జాతంతా అలలుగా
కదుల్తుంటే
మట్టి పొత్తిళ్లలో తల్లి
మాయిని నెమరేస్తుంది!

గడప గడపకు జోలెలో నింపుకున్న కన్నీళ్లు
లిపిలేని బాధను మోస్తున్నవి
ఆకులు అల్లల్లాడుతున్న గీ అడవంతా
కొలుపు గుంతల్ల వెండి కొడవళ్లై పూస్తుంది!

మట్టి పాత్రలు బీటలెత్తినప్పుడు జీవితం ఓ పాచి మడుగు
బుడుంగున మునగాలి
కైగట్టిన పాటకు
డప్పు మీద దరువు మార్చాలి
కులపు ఊబిలో అల్లుకుపోయిన నాచుమధ్య ఎంతకాలం,
జలపాత ప్రవాహాలమై సాగాలి!

అర్థం కాని యుద్ధంలో
ఆశల నిచ్చెనలు జారవిడుచుకున్నాక
పొలాల్లో పరిగేరుకుంటున్న కలల్ని
ఈ నేల ముఖచిత్రంగా ముద్రించాలి!
కాసేపన్నా- కిరీటాల్ని కీర్తిగానాల్ని పక్కకు పెట్టి
తడి నెత్తడినే పొదువుకోవాలి

కవిత్వంలో జీవితంలో
సాకబోసిన కన్నీళ్లనే ప్రేమించాలి
తనిలెట్టాలి - కసిగా
డొల్ల కవిత్వాల్ని - కపట ప్రేమల్ని!
పుష్పించాలి కొత్తగా
ఓడిపోయిన వీళ్ల కలల్లో వెన్నుపాములమై!

ఈ మట్లె మొలచిన ఆత్మల్ని
మల్చుకొచ్చిన కన్నీటి కాలం
వెయ్యేండ్ల గాయాల్ని కెలుకుతుంది

ఇప్పుడిక - బోనం కుండల్లో
చేయి జొనిపి తిన్న వెన్నెల ముద్దల్లేవు!
జాతరలో వేలాడదీసిన చిలుకల దండల్లేవు!
దరిద్రాన్ని మరిపించిన మోట పాటల్లేవు!

బుగులు బుగులైన ఈ నేలంతా
ఏ తల్లి సాపెనో
ఈ పీనుగుల పెంటల్లో
జంగపోళ్లమై తిరుగుతున్నం
బొందల గడ్డలకు కాటి పాపలమై
కాపలా కాస్తున్నాం!

నెత్తిన మన్ను బోసుకొని
కడుపు కొట్టుకుంటూ
భోరున ఏడ్వడమే మిగిలింది గీ గడ్డకు

ఇప్పుడు
ఈ భూమిలోంచి ఎక్కడ పిడికెడు మట్టి తీసుకున్నా
ఒరిగిన వీరుల కనుగుండ్లే కదలాడుతున్నాయ్!
నుజ్జునుజ్జయిన
జీవాల ఆత్మకతలే విన్పిస్తున్నాయ్!!

**- పగడాల నాగేందర్**



# ఎవడ్రీడు?

ఎవడాడు- ఊరిగాని ఊర్లె నిలబడి జూస్తుండు
గాలిగాని గాలిల దిక్కుల కొలతేస్తుండు
బట్టమీద మాస్కోతిగ యికారంగ గన్పడుతుండు
కాకిరెట్టోలిగ గలీజుగ కన్పడుతుండు
గానికీ గీ గాలికీ సమ్మందమేంది
ఝూటా పెద్దమడ్సులు గూడ్సింది గాపోతే
కుందేలుకూ ముళ్ళపందికి గూడ్పిండి గాపోతే
ఏ ఊర్లెబడితె గా వూర్లె ఏ బజార్ల బడ్తె గా బజార్ల
రాయై గిట్ట రాజ్యం జేస్తుంది
మావోడు గాడ లారీ నడుపుతడు మూన్నెల్లు
మావోడి మాటే మార్తది
మావోడు శెరుగ్గొడ్తడు గాడ రొండునెల్లే
మావోడి పెదిమె దిప్పుడే మార్తది
ఆడు యేండ్లకేండ్లు పాతుకపోతడు గీడ
ఒక్కసారన్నా గీ మట్టి వాసనతోని దిరిగిందా గాని నాల్కే
ఒక్క పదముందా నాది, గాని డిక్షనరీల
పత్రికల బజార్లల్ల ఒయ్యిలల్ల సిల్మాలల్ల అసెంబ్లీల టీవీలల్ల
నా పిలగాని పెదిమెలల్ల
పదమై సుత పాలిస్తుండు గీ నేలల
కాటన్ ఎరికే మాకు- హేమన్ డార్ఫ్ ఎర్కనా గానికి
మా పాల్కుర్కి పేరుందా గాని నేలల
మా సురవరం పేరుందా గాని నేలల
దువ్వూరి సైరికాత్మ మాకెరుక
మా గలగల నాగలిసాళ్ళేవీ గానీ పుస్తకాలల్ల
నాజర్ తంబూరై మా శెవుల్ల ఉన్నడు
మా బందగీ యేడి గాని నాలుక మీద
విశ్వనాధ మాకు కంఠోపాఠం
మా వానమామలై ఏడీ గాని గొంతుల
జాషువా పద్యాలు మాకు ఉద్యమ గీతాలు
మా భాగ్యరెడ్డి వర్మ పేరుందా గాని నేలల
రావిశాస్త్రి కథనాలన్నీ మాకు కతలు కతలు
గాడు కతలబడ్డడు గని- మా రాజయ్యేడీ గాని కతలల్ల

గాని శెరిత్రింట్ల కంపగొట్ట
సుందరయ్య మా నడిగడ్డ బొంద్రాయైండు
మా రావి తావేదీ గాని ఊర్లల్ల
గాని ఉద్దెమాల్ల మన్నుబడ
గానికీ గీ మన్నుకూ సమ్మందమేంది
కమీనిస్టు బాపని బోకర్లు గూడ్సింది గాపోతే
పార్కుల మీద విద్యాలయాల మీద రోడ్లమీద కాలనీల మీద
పేర్లై గూడ పెద్దిర్కం జేస్తుండు గీ నేలల
కులమంటోన్ని కులపోడు శేరదీసినట్టు
బాసంటోడని, శేతుల బెల్లంబెట్టేం?
పెట్టిన శెయినే మింగుతడని గానక పోతిమి
గూడు కట్టుకుంటె అశెపాయనుకుంటె
శెట్టు నారంటదని గానకపోతిమేందిరా
గింత అవులగాండ్లను జేసెనేంరా
పదంబెట్టె పేరుబెట్టె శిలల్ని బెట్టె
అసలుకే ఎసరుబెట్టె
నా శెమటగారని ఊర్లె
నా ఒక్క యిగ్రహముందా జూయించురి
నా ఒక్క పెద్దోడ్ని జూయించురి గా శెరిత్ర కాయితాల్ల
నా ఒక్క పేరు జూయించురి గాని గుండెలల్ల
మా పేరుందా మా వాడుందా
మా పేరుమీద వీధి వుందా
మా కాలనీ వుందా గాని ఊర్లల్ల
ఓనయ్య సొమ్మని ఓనికి బుట్నోడని
ఆనయ్య జాగీరుందా గీడ- ఆని తాత కాల్ల మట్టుందా గీడ
ఆని ముత్తాత శెమటుందా గీడ
మా గల్లి గల్లిల వాని పదముంది- మా బస్తీ బస్తీల వాని పేరుంది
మా పట్నం పట్నంల వాని శిల వుంది
వాడ వుంది వీది వుంది కాలనీ వుంది
అమెరికోని ప్రపంచీకరణ గీని స్వర్ణాంధ్ర ఒక్కటేనశి-
శెప్ప- గాని పదమెందుగ్గీడ
పేరెందుగ్గీడ
విగ్రహమెందుగ్గీడ

**- సుంకిరెడ్డి నారాయణరెడ్డి**



# జాగో.. మూలవాసులారా!

చరిత్రనెంత మాయజేత్తివారా గుణాఢ్యుడా
ఆర్య బ్రాహ్మడా!
ఆరని వెచ్చటి నెత్తుటి సాక్ష్యాన్ని
ఒక సిరా చుక్కతో తుడిచేస్తివి కదరా
పారే గోదారి కడుపులో
ఏరులై పారిన రక్తపు నదులున్నయ్
జాలువారే కృష్ణమ్మ ఒడిలో నేలకొరిగిన
నాతాత ముత్తాతల బాపూబల బొమికలున్నయ్
హరప్పా, మోహంజదారో భూమిపొరల ఆనవాల్లు
ఆర్యజాతి దురాక్రమణను
కాలాంతరాలకు అందిస్తున్నయ్
సమస్త తెలంగాణ పల్లెలు వేల సంవత్సరాల
మూలవాసుల చరిత్రను ఆలపిస్తున్నయ్
ఆర్యజాతి దురాక్రమణ
ఎంతటి దుర్మార్గంరా గుణాఢ్యుడా!
బ్రాహ్మణ వర్ణ ధర్మాన్ని
మా గుండెల మీద రుద్దితివి కదరా...!
మాతాత ముత్తాతల కమ్మని కథాకావ్య చరిత్ర
పరాయి వాళ్ళ దండయాత్రను నిలువరించి
మాంత్రికుణ్ణి చేసి చురకత్తులతో కుత్తుకలు ఉత్తరించి
నా రక్త సంబంధీకుల వీరోచిత చరిత్రనంతా
చెరిపేస్తివి కదరా, బానిసల్ని చేస్తివి కదరా బ్రాహ్మడా !
నీ ఆర్యజాతి దురాక్రమణ కోసం
మమ్మల్ని బానిసలను చేస్తివి కదరా

నా తెలంగాణ చరిత్ర పుస్తకాల నిండా
ఆర్యబ్రాహ్మల గురించి చదివినప్పుడు
కొండ శిఖరాల మీద నిర్మించిన
రాతి కోటల క్రింద ఇనుప నాణాలతో పాటే
తెగిపడిన, నా తాత ముత్తాతల వేళ్ళు
ఆన'వాళ్ళు కాలేక పోయాయి

గుణాఢ్యుడా!
నువ్ తెగ్గోసుకొని నీస్వర్ణ పురిటిలో దాచుకున్న వేలు ఒక్కటైనా చూపరా
గుణాఢ్యుడా! నీకెన్ని దేహాలు
అసలు కోటలు అంతరించినా
వట్టికోటలుగా నిలబడ్డావు సోమన్నవయ్యావు
మా బుద్ధజీవులను హింసించావు
మల్లికార్జున పండితుడివై మా దైవతాత్వికుల తలలు నరికావు
పోతన్నవై, గోపన్నవై మా రాజ్యాలను బానిసీకరించినావ్

సింధూనాగరికత లిపి
రాక్షసగుళ్ళ రాళ్ళ కింద పడిన దేహశిధిలం
ఇటుకలు, నల్లటి, ఎర్రటి పెంకులు
భూమి పొరల కిందా నాజాతిని దాచిపెట్టావు కదరా
జాగో మూలవాసులారా! ఈనేల మనది, చరిత్ర మనది
ప్రకృతితో రమించి నిర్మించిన
సుందర తెలంగాణకు అసలు సిసలు వారసులం మనం
వలసొచ్చిన ఆర్య జాతి, మనరాజానన్ని ఆక్రమించి
బ్రాహ్మలై, ఆర్యవైశ్యులై ఆర్య క్షత్రియులై
అగ్రవర్ణాలై మన బతుకుల్ని వలసీకరించారు
జాగో మూలవాసులారా!
ఆర్యులు, ఆంధ్రావాళ్ళు,
ఇటాలియన్లు, పర్షియన్లు, ఆంగ్లేయులు, అమెరికన్లు..
ఎవడైతేనేం?
ఒక్కో దురాక్రమణదారుడు
మనతల్లి తెలంగాణను చెరబట్టిన శత్రువులు
జాగో నా రక్త సంబంధీకులారా!
మన పూర్వీకుల వీరత్వం శత్రు బలి కోరుతుంది
గుణాఢ్యుని గుండెకాయ తెమ్మంటుంది
జాగో మూలవాసులారా...
జాగో జగావో మూలవాసులారా ... !

**- జిలుకర శ్రీనివాస్**

# నవంబర్ 1, 2009

ఈ విద్రోహ దినాన
విద్రోహ గీతమే పాడుతాం
ఊపిరిని బాణంగా గురిపెడ్తాం
గాయాలతో ప్రాణాల్ని నదులు చేస్తాం
రక్తానికి వెరుపు లేదు
చావంటే భయం లేదు
పోరాటాల్లోనే మా పుట్టువడి
పోరు చేస్తాం తెగబడి

మాయి కాని పండుగలు మాకెందుకు
మా భూమి, మా నీళ్ళు, మా పంటలు
మా కష్టం మాకే దక్కనప్పుడు

మమ్మల్నే ఏలుతరు
మేమెందుకు సాగిలపడాలె
దిగిపొంఁడ్రి దిగిపొంఁడ్రి
తెలంగాణ గద్దెలు దిగిపొంఁడ్రి
మీ సర్కారీ మాకొద్దు
మా రాష్ట్రం మా కొచ్చేదాక
మా పాలన మా కొచ్చేదాక
తెగేసే అడుగుతున్నం
బొడ్ల చెయ్యేసే అడుగుతున్నం
దిగిపొమ్మని దిగిపొమ్మని
మాతో యవ్వారం తెగిపోనియ్యని

పదే పదే ఇదే ఇదే
విద్రోహ గీతం ఊపిరితో
ఎక్కుపెడుతం
మా గాయాల్నే జెండాలుగా
ఎగరేస్తం ఎగరేస్తం

**- ఎస్.హరగోపాల్**

# గర్జించు తెలంగాణ!

నెత్తురు సాలువారిన అమరుల సాక్షిగా
గుండెను బండగ చేసుకొని
సత్యాగ్రహానికి దిగుతే
రాజద్రోహంకింద అక్రమ అరెస్టులా?
పక్షవాత రోగిలా
.... పలుకులు చూసి
భూదేవి సిగ్గుతో తలదించుకుంది
ఆకాశం బరువెక్కి ఎక్కిళ్ళుపట్టె
వింతల్లో వింతగా ఎనిమిదో వింత చేస్తివి!
మద్దతు లేఖలన్ని గంగలో కల్పి
ఆకలికి, అన్నవరానికి
ఏకాభిప్రాయం అంటగడ్తివి
రాయికైన చెమటొచ్చె
నీకు రాకపాయె
పోతిరెడ్డి పాడొద్దని
పొర్లు దండాలు పెట్టిన
పి.జె.ఆర్ ఆత్మ మండుతూనే ఉంది
జలయజ్ఞ ఫలితాన్ని చూసి
దేవతలంతా తలకిందులుగా నాట్యంచేసిరి
అమ్మకొంగు బంగారమనుకుంటున్నం
కాకి రెట్ట చెయ్యకు
ఏ బంతిపువ్వు నడిగినా
బతుకమ్మ బాధ వలపోస్తది
ఏ గడ్డి పువ్వు నడిగినా
గల్లి గల్లి గోస ఎరుక చేస్తది
ఏ గుడిసె(ల) స్వామి నడిగినా
కన్నీటి కథ చెప్పుతరు
అవమాన మెంతున్నా
మౌనంగా రోదించాం!
మా బతుకులు శోకసముద్రాలౌతుంటే
మీ మెదళ్ళలో మొగి పుట్టేదెన్నడు

నువ్వు కూడా వలసవాదివి కదా..
వలస బాధలేమర్థమైతవని అనుకోమా

అసమ్మతిలా ఆస్తులు పెంచి
ఓబుళాపురంలా పొట్టలు పెంచిన నోళ్ళలో
కుష్ఠుపుండులా రసికారుతున్న
అభివృద్ధి నినాదం మిన్నంటినప్పుడు
పదవుల దుప్పటి కప్పి
ఉద్యమాలుయ్యాలలూగినప్పుడు
పుష్పగుచ్ఛాలనందించిన నూరేళ్ళ ద్రోహం
అనుకూలమన్న పార్టీలవన్నీ
హస్తప్రయోగాలే
జబ్బలు చరిచిన కోడెలన్నీ
గారడీ బుట్టిలో దాణ తింటున్నాయి
కైలాస పటం ఆటలో అందరు పాత్రధారులే
బతకడానికి కొచ్చినోల్లకు
లైసెన్స్ తుపాకులు కావాలట
రొమ్ములు విరుచుకోకండి
తొడగొట్టినోళ్లంతేమయ్యారు
రాజీవ్ ప్రాణత్యాగం
దేశానికి గర్వకారణమైతే
నాలుగొందల మంది బలిదానం
నా జాతి లెక్కకు రాదా?
జాతిలో చిచ్చు రేపిన
పలనాటి నాగమ్మవైతావో
రాణిరుద్రమ్మలా కీర్తికెక్కుతావో
ఆయుధం నీ చేతిలోనే
సూర్యుడు అవమానంతో అస్తమించొద్దు
చంద్రుడు కన్నీటితో కుంగిపోవద్దు
గర్జించు తెలంగాణ
గాండ్రించు తెలంగాణ

- వనపట్ల సుబ్బయ్య

# కాలాన్ని ఈ రోజు గాయపర్చిందెవరు?

ప్రజాస్వామ్యం ఇవాల ఇనుప సంకెల్లై
ముళ్ళ కంచై బంధిస్తుంది
హక్కులు, చట్టాలు, శాంతి మంత్రాలు
వెక్కిరిస్తున్నై

అసహనం నిలువెల్లా ఆవహిస్తుంది
చేతకాని తనం కబలిస్తుంది
కసి పుట్టలు తెంచుకుంటుంది
దిక్కులు ప్రశ్నిస్తున్నయ్

నేనుగా ఇంకా నేనున్నదెక్కడ
నీడ నన్ను వెతుక్కున్నదిప్పుడు
రాజీల్లో ఎత్తులపై ఎత్తుల ఆటలో
మూగపోయిన నా ఉనికిని వెదుకుతున్ననిప్పుడు
నాకేమి లాభమనే లెక్కల్లేకుండా
గొంతు పెకిలి నా వారినికలుసుకునేందుకు
తెగిపోయిన నా చేతుల్ని తడుముకొంటున్నాను

పదవుల కిరీటాల సొమ్ము సంచుల అవకాశాలేమి లేకున్నా
నా జాతికోసం కాలిపోయిన శ్రీకాంత్ దేహమై
ఉరేసుకున్న మరో కాలేజి విద్యార్థినై
అమెరికా సైన్యం గుప్పిట్లో నినాదమైన యోధుడి స్ఫూర్తిలా
పోలీసు చెరలో బంధీ ఐన
ఉస్మానియా విద్యార్థి స్పృహలా రోదిస్తున్నాను
పద్మవ్యూహంలో చిక్కిన అభిమన్యుని తెలంగాణను నేను
శాంతి యుద్ధం నీతి అవినీతి పోరు మధ్య
కరిగిపోయే రేఖను నేను
కాలాన్ని ఈ రోజు గాయపర్చిందెవరు?

పండితుల ఉపన్యాసాల్లో ఒక వ్యాఖ్యనైన
పత్రికల్లో ఒకరోజు వార్తనైనా
కాలపు నిస్పృహాయతకు పూసిన కన్నీటి బిందుని నేను
అన్యాయమెందురించ కదిలినా
మరొకక్షణం ఖాకీ రాక్షసత్వానికి రాలిపోయినా
శాంతి పాఠం జపిస్తే నేనో గాంధీని!
ఉక్రోషం, ఉద్వేగంతో నినదిస్తే భగత్ సింగ్‌ని!
మొక్కవోని ధైర్యంతో ఎదరిస్తే నేనో చాకలి ఐలవ్వని!
తెగిస్తే బందగిని, కదం తొక్కితే కొమరం భీమ్‌ని

పిడికిలైనా గేయమైనా, మరోక్షణం గాయమైన
తెలంగాఘణను నేను
మరోమారు మరోమారు మరోమారు
మరోమారు ఉదయించే తెలంగాణ నేను

విధివిధానాలు ఏవైనా
సత్తెమొకటే, తెలంగాణను నేను !

**- సూరేపల్లి సుజాత**

# విద్యుత్ కేంద్రమైనా ఆ ఒక్క టెంటు

ఆ ఒక్క టెంటు
విద్యుత్ కేంద్రమై
కోట్ల సిరలు ధమనులై
పది దిక్కుల ప్రవహించింది
ఈ టెంటులో
వార్తలు వీక్షించాల్సిన వాళ్ళు
వార్తా ప్రసార కేంద్రాలని
తమ చుట్టూరా ఉపగ్రహాల్లా తిప్పారు
పాతుకున్న టెంటు
కొయ్యల మోకాళ్ళు భూమిలో నిలిచి
నిటారుగా నిలబడ్డాయి
రాబోయే తుఫాను గాలిని సైతం ఎదుర్కొనే
ఒక దృఢ చిత్తంతో...
ఒక టెంటు
వేల టెంట్లయితే
విస్తరించిన
తమ టెంటకిల్స్‌తోనూ లాభంలేదని-
ఈ టెంటును కూల్చందే
రెండు రాజ్యాలకు నిద్ర లేదు
ఈ చిన్ని గుడారం
నాలుగు కోట్ల ఆశల గూడైంది
అక్కడ రెపరెపలాడిన ప్రతి హృదయం
ఒక్కో గుడారాన్ని గుండెల్లో దాచుకుని
బలవంతంగా, భారంగా హాస్టళ్ళు వదిలి
ఒక్కొక్కటే గ్రామాలకు చేరుతున్నాయి
నేలనేలంతా తనువై
ఆ గుడారాలను స్పర్శించాలని
ఊళ్ళు ఎదురు చూస్తున్నాయి

**- రేపల్లె వెంకటేశ్వరరావు**

(జెఏసి విద్యార్థుల చైతన్యానికి అభినందనలతో...)



# విద్యార్థీ.. నమస్కారం!

ఒక విద్యుత్ తేజం
ఆకాశం అంచులు తాకి భూమి గర్భాన్ని చేరింది
ఒక చారిత్రక సందర్భం అగ్ని పుష్పమై వికసించింది
అరవైయేండ్ల ఉద్యమం యూనివర్సిటీ ప్రాంగణంలో
తన చరిత్రను తానే తిరగరాసుకుంది

తిరుగుబాటు జెండా దిగంతాల కేసి వ్యాపించింది
పోరే చదువు కాగా లాఠీలకు వెరవని విద్యార్థులు
వీధుల్లో విస్ఫోటనం సృష్టించారు
ప్రజల చేతుల్లో కరపత్రాలై వెలిగారు
కాలమేఘం మీద మెరుపులై మెరిసారు

చదువులు నేర్చే విద్యార్థులు
సంఘర్షణ బాటలో గురువులుగా ఎదిగారు
పాలకులు కళ్ళు తెరిచేలోపు ప్రవాహం సునామీగా మారింది
నాకిపుడు విద్యార్థిగా మారాలనుంది
పోటెత్తిన కెరటాలలో మునిగి తేలాలనుంది

ఇన్నాళ్ళు- క్లాసురూం కే పరిమితమైన వాణ్ణి
విద్యార్థుల్ని గదమాయించినవాణ్ణి- చూపుల్తో శాసించినవాణ్ణి
మార్కుల్తో మేధస్సును కొలిచిన వాణ్ణి
నాకిప్పుడు విద్యార్థిగా మారాలనుంది చెమర్చే కండ్లతో వాళ్ళను కౌగిలించాలనుంది
చరిత్రకు నడక నేర్పే వాళ్ళ అడుగులో అడుగువేయాలనుంది
పోటెత్తిన పాటలకు దరువేయాలనుంది వాళ్ళ పిడికిలిలో శక్తినై నినదించాలనుంది
వాళ్ళు నిర్మిస్తున్న చరిత్రలో ఇటుకనై నిలిచిపోవాలనుంది
అరవైని ఇరవైగా మలుచుకోవాలనుంది
యుగాలుగా- నేనీ క్షణాల కోసమే ఎదురుచూస్తున్నానేమో !
విద్యార్థీ.. నీకు నమస్కారం!

**- ఉదయమిత్ర**

(పోటెత్తుతున్న విద్యార్థులకు)

## ఎదురెక్కుతున్న నీళ్ళు

భాష పేరుతో ఎదురెక్కుతున్న నీళ్ళు
తెలంగాణ భూమాత నిండె
కొండ గుట్ట గుహలలో
వలస మొనల్లు మెట్టపెట్టె

సీడు బొచ్చెలు, రవ్వ చాపలు
చెంగు చెంగున ఎగురుతుంటె
కప్పలు, నీరుకంట్లు
వడ్డనే వలపోస్తుండె నా తెలంగాణ అని

బొమ్మె అయిన బొచ్చె అయిన
చిన్న పరుకల మింగినవి
చెర్వు మంటల చెలిమిపాటు
సందమామల పై ఆటలకు

మీసాల రొయ్యల చూసి
జెళ్ళ చాపల వెన్ను విరిగిందా
ముళ్లు వాటం తప్పింది

అలలై లేస్తున్న ఆంధ్ర లాబింగ్‌ని
తామరాకై తన కాళ్లకిందికి
వంచుకుంటుంది తెలంగాణ వాదం

వాళ్లు కుడలిల మధ్య
అర్థ ఎగిసిన శ్రీకాంత్ మంటలు
ఈ నీళ్ళను మస్సిగా మార్చమని
ఇచ్చిన సందేశం

**- సంపతి సోమయ్య**



## గన్‌పార్క్

స్తూపం
మాటలై మాట్లాడుతుంది
పాటలై పాడుతుంది
గజ్జెలై నాట్యం చేస్తుంది
స్తూపాన్ని తగిలితే
సలసల కాగే విద్యార్థుల నెత్తురై చురుక్కుమంటుంది
గుండెలకు హత్తుకుంటే
బిడ్డలను కోల్పోయిన తల్లిలా బోరుమంటుంది
కాళ్ళకు మొక్కుతె
తెలంగాణ పోరాట తొవ్వను చూపుతుంది
తెలంగాణ - మానని గాయాల వేదన;
గుండెలు బాదుకుంటున్న రోదన
స్తూపాన్ని చదువుతే -
వనరులు ఎండమావులై
జీవనం నరకప్రాయమై
వికలమైన మనసులతో
చావు వాకిట్లో తెలంగాణ
తెలంగాణ - నోటికాడి ముద్ద చేయిజరిన తండ్లాట
చావు బతుకుల మధ్య దోబూచులాట
స్తూపాన్ని కదిలిస్తే -
జ్ఞాపకాల సలపరం
ఉద్యమాల నైపుణ్యం
వెన్ను చూపని ధీరత్వం
ఎగిసి పడుతున్న అగ్నిపర్వతం
రగులుకుంటున్న తెలంగాణ ఆత్మగౌరవం

**- ఒద్దిరాజు ప్రవీణ్‌కుమార్**

# ఇడ్లీ - సాంబార్ గో బ్యాక్... ఆంధ్రావాల గో బ్యాక్

ఇడ్లీ సాంబార్ గో బ్యాక్
ఆంధ్రావాలా గో బ్యాక్
జై తెలంగాణ!
యాభై ఏండ్ల గోల యాభై ఏండ్ల గోస
అరుపులు - కేకలు
నాలుగు కోట్ల జనం కారే కన్నీళ్ళకు జవాబు జై తెలంగాణ
బానిస బ్రతుకులతో
మా పేగుల అరుపులు మా ఆర్తనాదాలు
నీళ్లు ఉండి నీళ్లు ముట్టుకోలేని మేము
ఎడారి అయిన గ్రామాల
వలసపోయిన జనం - పరాయి బ్రతుకులు
తొక్కిపెట్టిన 610 జీవోలు - పెద్దమనుసుల ఒప్పందం
అణచబడ్డ - అణచి వేయబడ్డ
వీర విప్లవ తెలంగాణ మాదిరా
అరె బద్మాష్‌లారా!
రాజీనామాలతో లంజె రాజకీయాలతో
గారడీ మాటలతో ఎంత రెచ్చగొట్టినా
మనం కలిసి బ్రతకడం
ఇక ఇంపాసిబుల్
తెలంగాణ లేచింది
తెలంగాణ గర్జిస్తుంది
తప్పుడు మాటలు చెప్పకండి
లడాయి మాటలొద్దూ
స్నేహంగా విడిపోదాం
వీడిపోయే కలిసి బ్రతుకుదాం
అలాయి బలాయి లిచ్చుకుందాం
ప్రపంచానికి దాటి చెబుతాం
తెలుగు తనం ఉన్నవాళ్ళం
విడిపోయినా - ఎక్కడున్నా నంబర్‌వన్ అని
మన మధ్య పొత్తు కుదురదని -

మీ ఎత్తులు - మీ జిత్తులు
మీ మాటలు - అన్ని అనుభవించినవాళ్లం
మోసపోయిన వాళ్లం
ఈ రోజు
జనం కదిలారు విద్యార్థులు కదిలారు
ఉద్యోగస్తులు అడుగు ముందుకు వేశారు
అన్ని పార్టీల నేతలు
ఒకే గొంతుతో ఒకే నినాదం ఇస్తున్నారు
జై తెలంగాణ! జైజై తెలంగాణ!!
తెలంగాణ వచ్చి తీరుతుంది
నిలబడి తీరుతుంది
నిలిచిపోతుంది
తెలంగాణ
వీరుల పుట్టినిల్లు
నాలుక్కోట్ల రత్నాలవీణ
రావి నారన్న - ఆరుట్ల దంపతులు
కొమురన్న - చాకలి అయిలమ్మ దీవెనలతో
పుట్టే తెలంగాణ - నిలిచి వెలగడం ఖాయం
తెలంగాణ బతుకమ్మ పిలుస్తుంది
తెలంగాణ వచ్చింది - చందమామ
స్వాతంత్రం వచ్చింది చందమామ
మా పాలన మాకు వచ్చిం చందమామ
అనుబంధాలు - ప్రేమలు
పెంచుకుందాం చందమామ
ప్రి ఇంటా గులాబీ జెండా చందమామ
జై తెలంగాణా చందమామ

**- బుచ్చిరెడ్డి**

# పకడ్బందీగా ఉద్యమిద్దాం!

ఊరువాడ ఏకమైన ఉత్తుంగ తరంగం
హోరెత్తిన విద్యార్థి జోరు... ఒక్కటైన సబ్బండ వర్ణం
కదం పదం కలిపి... కదిలిన నవ యువత
నరం స్వరం కలిసి... గుండెల్లోన మోగిన డప్పు
వింటూ... ఊర్కోంటమా ?
అదిగో గుర్రపు డెక్కల చప్పుడు... వినలేదా చెప్పు?
గోసపడ్డ గొర్రెల కిక్కడ... తోడేళ్ల తొక్కిడి

చారిత్రక సత్యాన్ని గోనె సంచిలో కుక్కేసిన వైనం చూసినం
గతితార్కిక జ్ఞానాన్ని కుతర్క గోతిలో తొక్కేసిన తీరు చూసినం
కనలి కనలి కదలిన దశాబ్దాల పోరు
చెల్లని ఆరాటమై తల్లడిల్లిన తీరు
ఎన్ని ఏడుపులు ఏడిచినా
ఈడేరనిచ్చారా మన గోడు
రోజుకో కయ్యం రాజుకోనిచ్చారు
రాజీ లేకుండా రాజకీయమే చేశారు
చాటుమాటు మూటల మహా మాయజాలం
కోటల సంరక్షనార్థం మాఫీయా కేటుల కాటు
ప్రాణాలెన్ని ఒడ్డినా పథక రచన చేసి పజీత పాల్జేశారు
స్వపరిపాలన కాంక్షపై
పరాయి పాలన వేటు...
నీతులు వల్లిస్తునే, నిజాయితీకి చేటు
రాజ్యాంగబద్ధులమంటూనే రాబందు పాలనే

తెలంగాణ సాధనే
ప్రజలందరి పసందని పగడ్బందీగా నిరూపిస్తాం
గాయపడ్డ ఉద్యమమిప్పుడు
నవయువ జవసత్వ రుధిరాన్ని ఇముడ్చుకుంది

**- ఎం.ఎ. బాసిత్**



# నా భాషా నా బతుకమ్మా నాక్కావాలి

తెలంగాణ ఇప్పుడు నెత్తుటి గడ్డ
గుండె భుగభుగ మండుతున్న అగ్గిరవ్వ
తరతరాల అకృత్యాలకు అణిచివేతకు కుమిలి కనలి
ఉవ్వెత్తున ఎగిసిపడుతున్న లావా!
రెప్పలమాటున గోదావరి విస్తరించింది
కరకట్ట తెంచుకొని పరుగిడుతున్న ఉగ్రప్రవాహం
అవహేళనలకు అవమానాలకు అణువణువు అంటుకున్న
ఆత్మాభిమాన రుద్ర జ్వాల

000

నడుస్తూ నడుస్తూ నువ్వు తవ్విన 'గోతి'లో
కాలుజారి సొమ్మసిల్లాను
నన్ను తొక్కుతూ ఎక్కుకుంటూ
కర్కశంగా రక్కుకుంటూ వెళ్లావు
కళ్లు తెరిచి చూసే సరికి అంతస్తుల 'మేడలు'
ఆకాశంలో వేళ్లాడుతున్న నా ఆత్మాభిమానం
నలు దిక్కులా కమ్మిన అవినీతి వరద
ఆకాశ హర్మ్యాల్లో ఏసి గదుల్లో కులుకుతూ
నా నెత్తిమీద వామనపాదం

000

నా యాసను నా భాషను సంస్కృతిని చిదిమేస్తూ తొక్కేస్తూ
మూతితో మురిపిస్తూ నొసటితో వెక్కిరిస్తూ
ఇప్పుడు నా నెత్తురు కుతకుత ఉడికి నరాలు తెగిపోతున్నాయి
మేకతోలు కుప్పుకున్న మెఖాలు
నా నీటిని, నేలను రెక్కల కింద కమ్ముకొని
అన్నీ ఉన్నా ఏమీ లేనివాణ్ణి అయ్యి
బరిబత్తల నడి బజార్లో నిలబడ్డా
ఇప్పుడు నా మట్టి నాకు కావాలి
నా భాష నా యాసా నా బతుకమ్మా నాక్కావాలి
నా గాలిని గుండెల నిండా పీల్చుకోవాలి
నెత్తురు చిందించడం నాకు కొత్తకాదు

చినుకు చినుకు వాన చినుకు మధ్య
తప్పించుకొని పోరు జెండా లెగరెయ్యడం కొత్తకాదు
తెలంగాణ పోరు గడ్డ నుండి పొలికేక పెడుతున్నా!
సంకెళ్ళు తెంపేస్తూ పిడికిళ్లెత్తుతున్నా

కుట్రలతో కుతంత్రాలతో మళ్లీ పొగ పెడుతున్నావు
నా మట్టిని ఒక్క అంగుళం కూడా వదలను
ఒక్క అంగుళం కూడా వెనక్కి జరగను

144 సెక్షన్లతో వస్తావో లాఠీలతో వస్తావో
తూటాలతో వస్తావో నీ ఇష్టం
తల్లి గడ్డ విముక్తి కోసం సమస్తం తృణప్రాయం
అమ్మతోడు ఒట్టేసి చెపుతున్నా
మళ్లీ మోసం చేయాలనుకుంటే
మనం కలిసేది బొందల గడ్డ కాడే!

- ప్రేరణ

# ఉస్మానియా.. ఉస్మానియా..!

ఉస్మానియా ! ఉస్మానియా !
పురివిప్పిన పోరాటమా !
పుస్తకాల్ మూసి వలస పెట్టుబడి ముఖంపై
నిప్పుల పిడికిళ్ళై దూకాలె
పసుపుబట్టనో
మూడు రంగుల అతుకుల జోలెనో పట్టి
ఓట్టు మూటగట్టి
పీఠం మీద ఊరేగుతున్న దోపిడీని
పాడె మీదికి ఎక్కించాలె
ఉస్మానియా ! ఉస్మానియా !!
గేట్లెత్తిన లాఠీల మీంచి
ఎదురెక్కే నిప్పు చేపల్లారా !
మీ లావా నినాదాలకు
పల్లె పల్లెలో నిశ్శబ్దం పగిలి
పోరు సింహం ఎగిరి దుంకుతోంది
పచ్చని చెట్టు నూటొక్క ఫలాలపై
కరుకు కొక్కెంతో తొలుస్తున్న
ముద్దు పలుకుల చిలుకల పైకి
ఉస్మానియా విల్లంబులు
గురివైపు తీరం దాటాలె
దొరల మీసాలు పీకేసినం
తూపాకీ గుండ్ల మధ్య నిత్యం ఈదుతున్నాం
కాలిన బతుకులోంచి
లేచిన కార్చిచ్చు
మొగులంతా అల్లుకోవాలె
కొమ్ములు తిరిగిన ఆంధ్ర పైస
కోరలు పీకాలె
అన్నం ముద్ద ఆకలి బతుకులో
ఉదయించాలె

- పరిమళ్

# రోడ్డు ఉద్యమం అడ్డా

నేను మళ్లీ రోడ్డు మీది కొచ్చాను
భగాయించి నువ్వు ఇంట్లో నక్కినవ్
రోడ్డు ఇవాళ నినాదమైంది
రోడ్డు ఇవాళ ర్యాలీ ఐంది
రోడ్డు ఇవాళ రాస్తారోకో ఐంది
రోడ్డు ఇవాళ బంద్ కి ప్రతిరూపమైంది
రోడ్డు అసెంబ్లీ ముట్టడికి దారి చూపింది
రోడ్డు ఇవాళ నన్ను పొదువుకొని
నీపై రాళ్లు విసిరికొట్టింది
నీ బహుఅందమైన కలల్ని
భళ్లున బద్దలు కొట్టింది
నేను ఒక్క పిలుపునిస్తే
నువ్వు ఎక్కడికక్కడ జామ్
నేను నినదిస్తే
నీ గుండెలు పిక్కటిల్లాయ్
నేను మళ్లీ రోడ్డుమీదికొచ్చాను

గ్రహించావా
నీ మదిలో కట్టుకున్న గోడే
నువ్వు నా ప్రాంతానికి రాకుండా
రోడ్డుమీద అడ్డుగోడై లేచింది

నా నాడీమండలం రోడ్డు
ప్రవహిస్తున్న ఉడుకు నెత్తురు నేను
రోడ్డు నా పూర్వీకులు తొలిచిన తొవ్వ
రోడ్డుమీదికి నడవకుంటె రక్తచలనముండదు నాకు
గుమిగూడందే గుంపులో కలవందే దినం గడవదు నాకు
రోడ్డు నా అడ్డా



రోడ్డు మీద పుట్టినోళ్లల్లోంచే
ఉద్యమకారుడు ఉద్భవిస్తాడు
రోడ్డు మీద తిరిగినవాళ్లల్లోనే
ఉద్యమకారుడు ఉరకలేస్తాడు
రోడ్డు మీద బైఠాయించిన వాడి నుంచే
ఉద్యమ రక్తం చింది పడుతుంది
రాతిముక్కను ఆయుధం చేయడం తెలుసా నీకు
ఉద్యమకారుడికి తెలుసు
రోడ్డుని ఉద్యమానికి వేదిక చేయడం తెలుసా నీకు
ఉద్యమకారుడికి తెలుసు
రోడ్డు మీదికొచ్చిన ఉద్యమకారుడు ఒక్కడే
ఒక్కొక్కడే- వందలు వేలు లక్షలవుతాడు
నీకు చేతనవుతుందా ?
రోడ్డు మీద నడిచినవాడివే కదా
రోడ్డుని అవమానిస్తావా ?
రోడ్డు నా అమ్మరా !
రోజూ పలకరిస్తుంది నన్ను
నా ఎతలన్నీ తెలుసు దానికి
నా నిరసనకి ఇంత చోటు నిచ్చింది
నా ఆందోళనలన్నింటికీ ప్రతిబింబమైంది
ఉద్యమానికి అద్దమైంది
ఉద్యమించడం చేతకానివాడా!

మాకు ఉద్బోధలు చేస్తావా?
రారా! నీకూ నాలుగు నినాదాలు నేర్పిస్తా
నా రక్తంలో సోడా కలుపుకొని తాగి జోగుతున్నవాడా!
మత్తు దిగి తెరుచుకున్న నీ కన్ను మీద
తెలంగాణ పటం ప్రతిబింబమవుతుంది
అందులో నా హైదరాబాద్
కోహినూరై మెరుస్తుంది

**- స్కైబాబ**

(మో, ఖాదర్ లాంటి కోస్తాంధ్ర 'కవుల' తెలంగాణ వ్యతిరేకతను నిరసిస్తూ..)

# నినాదాలు

వాడెవ్వడు వీడెవ్వడు
తెలంగాణకడ్డెవ్వడు

తెలంగాణ కడ్డొస్తే
అడ్డంగా ... ... ...

ఫ్రీజోన్ కాదురా
హైద్రాబాద్ మాదిరా

ఆంధ్ర వలస పాలకులారా
క్విట్ తెలంగాణ

ఆవాజ్ దో
తెలంగాణవాలె ఏక్ హై

పోరాడుదాం ఆంధ్ర వలస పాలనకు వ్యతిరేకంగా
పోరాడుదాం పోరాడుదాం

జాగో తెలంగాణవాలే
భాగో ఆంధ్రావాలే

తెలంగాణవాలోంకో జగావో
ఆంధ్రావాలోంకో భగావో

సాధించుకుందాం తెలంగాణ రాష్ట్రాన్ని
సాధించుకుందాం సాధించుకుందాం

తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు బిల్లును వెంటనే
పార్లమెంటులో ప్రవేశపెట్టాలి

ఖబర్దార్ తెలంగాణ వ్యతిరేకుల్లారా
ఖబర్దార్ ఖబర్దార్!

ప్రాణాలైనా ... ... ...
తెలంగాణ సాధిస్తాం

రక్తాన్నయినా చిందిస్తాం
తెలంగాణ సాధిస్తాం

ఇదేమి రాజ్యం ఇదేమి రాజ్యం
పోలీసు రాజ్యం తుపాకి రాజ్యం

లాఠీ గోలీ ఖాయేంగే
తెలంగాణ లాయేంగే

వియ్ వాంట్
తెలంగాణ

వియ్ డిమాండ్
తెలంగాణ

ఇడ్లీ సాంబార్
గో బ్యాక్

ఆంధ్రా పోలీస్
గో బ్యాక్